Tanjore Saraswati Mahal Series No. 23

# DWIPADA BHAGAVATAMU

## (DASAMA SKANDHA)

*By*

MADIKI SINGANARYA

*Critically Edited*

*By*

Sri Vasishta A. MAHADEVA SASTRY

Pandit, Saraswathi Mahal Library, Tanjore

*Published By:*

Sri S. GOPALAN, B.A., B.L.,

Honorary Secretary for the Administrative Committee,

T. M. S. S. M. Library, Tanjore

Price] 1950 [Rs. 3 0 0

తంజావూరు సరస్వతీ మహల్ ప్రచురణము - 28

# ద్విపదభాగవతము.

మడికి సింగనార్య విరచిత

## ద్విపదకావ్యము.

పరిష్కర్త
శ్రీ వాసిష్ఠ అ. మహాదేవశాస్త్రి
పండితుండు, సరస్వతీమహాల్ గ్రంథాలయము తంజావూరు.

తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయ నిర్వాహక సంఘము తరపున
గౌరవ కార్యదర్శి
శ్రీ S. గోపాలన్, B.A.,B.L, గారిచే
ప్రచురింపఁబడినది.

మూల్యము) 1950 (రూ. 8-0-0

# PREFACE

This publication contains the earliest Telugu version available of SRI BHAGAVATA 10th Skanda, dealing with Sri KRISHNA'S life in MADHURA and in DWARAKA. The author Madiki Singanaraya lived in the early part of the fifteenth century. He was therefore an elder contemporary of POTHANNA the celebrated author of ANDHRA BHAGAVATAMU.

The present work which is in Dvipada is anterior to POTHANNA'S work. The merits of the Author's poetry can be gathered from the fact that his verses are cited as models in standard works on Grammar and Rhetoric. The author has also written three other works in Telugu namely :—

1. VASISHTA RAMAYANA
   The well known philosophical work,
2. PADMA PURANA
   and
3. SAKALA NITI SAMMATAMU
   a work in politics,

The present work has three Kandas in it:—(1) Madura Kanda (2) Kalyana Kanda and (3) Jagadhabiraksha Kanda. The Kandas dealing with the Balaleela in the beginning and the Bhaktanugraha in the end are missing.

The portion that is now published is complete so far as it goes and has been selected for its value as a high class Dvipada Kavya of the early classical age in Telugu literature. For a fuller account ot the Author and the diverse merits of the work the reader is referred to the Telugu introduction of the learned Editor who has spared no pains in editing this work.

Our thanks are due to him for his valuable services.

Our grateful thanks are due to the Government of Madras for the liberal grants which have enabled us to publish this and other valuable manuscripts of this Library.

Saraswathi Mahal,
Tanjore.
15—1—1951.

*S. Gopalan,*
*Honorary Secretary*
T.M.S.S.M. Library Committee

శ్రీ

రమణమహర్షయేనమః

# ఉపోద్ఘాతము.

---

## —: గ్రంథకర్త - మడికి సింగనార్యుఁడు :—

శ్రీపతియొక్క యెనిమిదియవ యవతారమగు శ్రీకృష్ణ భగవానుని చరిత్రగలది భాగవతమందు దశమస్కంధము. భాగవతమహాగ్రంథమును దెనుఁగు భాషలో విలసిల్లఁజేసిన మహాకవి బమ్మెరపోతరాజు. ఈ బమ్మెరపోతనార్యుఁడు హూణశకము 1400 మొదలు 1470ల ప్రాంతమందుండినట్లు, ఆంధ్ర కవుల చరిత్రలో శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు చర్చించి యున్నారు. వాసిష్ఠరామాయణ, పద్మపురాణ, భాగవతదశమ స్కంధముల కర్తయగు మడికి సింగనార్యుఁడు హూణశకము 1430వ ప్రాంతము వఱకునైనను జీవించి యుండవలయునని వారు నిర్ధరించిరి. పోతనార్యుని భోగినీదండకము తన 25వ వత్సరమున అనగా 1425వ సంవత్సరమున విరచించినట్లు తెలియుచున్నది. మడికి సింగనార్యుఁడు పద్మపురాణమును దెనిఁగించి ముగించిన వత్సరము దాని కృత్యంత పద్యమువలన స్పష్టమగుచున్నది.

మంగళమహాశ్రీ :—

"ఆకరయుగానల మృగాంకశకవత్సరములై పరఁగుశార్వరిని
బుణ్య
ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్చు నదుపాలసుతవాసరము
నందున్
శ్రీకరముగా మడికి సింగన తెనుంగున రచించెఁ దగఁ బద్మ
పురాణం
బాకమల మిత్ర శిశిరాంశువుగఁ గందసచివాగ్రణికిన్ మంగళ
మహాశ్రీ."

(కర=2 యుగ=4 అనల=3 మృగాంక=1 అంకానాం వామతో గతిః. కాబట్టి శాలివాహన శకము 1342. హూణశకము 1420 శార్వరి సంవత్సరమున మార్గశీర్ష శుద్ధ పంచమీ బుధ వారమునాఁడు పద్మపురాణము ముగింపఁ బడెను.)

దీనిని బట్టి పర్యాలోచించి చూచిన మడికి సింగనార్యుఁడు ప్రౌఢావస్థయందున్న సమయమందు పోతనార్యుని భోగినీదండకము పుట్టినదని నిర్ణయించుటకు వీలున్నది. అప్పటి కింకను పోతనార్యుఁడు భాగవతమును దెనిఁగించుటకుఁ బూను కొని యుండలేదు.

"వాసిష్ఠ రామాయణము పద్మపురాణమునకుఁ దరువాత రచియింపఁ బడిన దగుటచే నది 1420కిఁ దరువాతఁ జేయఁబడినది. ఈ రెండు కావ్యములకు నడుమ సింగన్న భాగవత దశమ స్కంధమునుఁ గూడఁ దెనిఁగించి కందనామాత్యునకే యంకిత మొనరించెను. సింగన కృత భాగవత దశమ స్కంధము నాకు లభింప లేదు. అటుతరువాత నీకవి సకలనీతిసమ్మతమను నీతి గ్రంథమును సమకూర్చెనని రామకృష్ణ కవిగారు చెప్పుచున్నారు

వీనినన్నిటిని విచారించి చూడఁగా మడికి సింగన్న 1480వ సంవత్సరము వఱకైనను జీవించి యుండును. [ఆంధ్ర॥ కవు॥ చరి॥ ప్ర॥ భా॥ 378 పుట]

మడికి సింగనార్యుఁడు 1420కిఁ బూర్వమే భాగవత దశమ స్కంధమును రచించినట్లు తెలియుచున్నది. కాఁబట్టి పోత నామాత్యుని భాగవతమునకు ముందుగా రచింపఁ బడినది మడికి సింగనార్యుని భాగవత దశమస్కంధ మనుటలో సందేహముండదు.

సింగన్న నియోగి బ్రాహ్మణుఁడు భారద్వాజ గోత్రుఁడు. అయ్యల మంత్రివరునకును సింగాంబికకును జన్మించినవాఁడు. సింగన్నకృతమగు వాసిష్ఠ రామాయణములోని యీక్రింది పద్యములను గమనింపుఁడు.

సీ॥ "అతఁడు తిక్కనసోమయాజుల పుత్రుఁడై
కొమరారు గుంటూరి కొమ్మ విభుని
పుత్రి చిట్టాంబిక బుధలోక కల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసారమగు కోటభూమిఁ గృష్ణానది
దక్షిణ తటమున ధన్యలీల
నలరు రావెల యను నగ్రహారము తన
కేక భోగంబుగా నేలుచుండి

యందుఁ గోవెల గట్టి గోవిందు నెన్న
గోపినాథుఁ బ్రతిష్ఠయుఁ గోరి చేసి
యఖిల విభవములందును నతిశయిల్లె
మనుజమందారుఁ డల్లాడ మంత్రివిభుఁడు.

క॥ "అయ్యావటీరమణులకును
నయ్యల మంత్రీంద్రుఁ డుదితుఁడై ధారుణిలో
నెయ్యెడ నర్థార్థులు మా
యయ్య యని పొగడఁగ నెగడె నౌదార్యమునన్.

సీ॥ ఆత్రేయ గోత్రపవిత్ర పేరయమంత్రి
పుత్రి సింగాంబికఁ బుణ్యసాధ్వి
వెలయ వివాహమై వేఁగి దేశంబులో
నేపారు రాజమహేంద్ర పురికి
నధిపతి తొయ్యేటి యనపోత భూపాలు
మంత్రియై రాజ్యసంపదఁ బొదలి
యొప్పారు గౌతమి యుత్తర తటమున
మహనీయమగు పెద్దమడికి యందు
స్థిరతరారామతతులు సుక్షేత్రములును
పెక్కు లార్జించి సితకీర్తి పెంపు మిగిలి
యఖిలజగదన్నదాతనా నవనిఁ బరఁగె
మధురగుణధుర్యుఁ డయ్యలమంత్రివరుఁడు.

చ॥ ఒనరఁగఁ దద్వధూవరులహోబలదేవునిఁ గొల్చి తద్వరం
బున నొగి సింగనార్యుని నమోఘ గుణాఢ్యు ననంతుని న్మహీ
జనసుతు నబ్బయాంకు బుధసన్నుతి పాత్రుని నారయాహ్వయున్
గని నరసింహనామములు గారవ మారఁగఁ బెట్టిరందఱున్.

క॥ వారలలో నగ్రజుఁడను
వారిజదళనయనచరణవారిజసేవా

సారమతి నతులవాక్య
శ్రీరచనాచతురమతిని సింగనామాత్యుఁడన్.

పై పద్యముల వలన నీకవి తిక్కనసోమయాజుల మనుమరాలి మనుమఁడనియు, గోదావరి మండలములోని పెద్దమడికి నివాసుఁడనియు, స్పష్టమగుచున్నది. ఈ విధముగాఁ దర్శించి చూచి నప్పుడు మడికి సింగనార్యుఁడు 15వ శతాబ్దపు కవియని నిర్ణయించుటలో సందేహమునకుఁ దావు లేదు.

ప్రస్తుత పరిష్కరణమైన భాగవత దశమస్కంధము మడికి సింగనార్యుని కృతమా కాదా యనునది చర్చింప వలసియున్నది. అనేక ప్రబల నిదర్శనములపై నేను ద్విపద బద్ధమైన యీ భాగవత దశమ స్కంధము మడికి సింగనార్య కృతమను నిశ్చితాభిప్రాయమునకు వచ్చితిని. కాండాంతద్విపదలను గమనింపుడు.

ద్విపద. "అని యిట్లు నయనిర్జరామాత్యువేర
ధన ధాన్య మణిమయ దానాఢ్యు పేర
భూభరణక్షమ భుజసారు పేర
నాభశ మంత్రి కందామాత్యు పేరఁ
గోరి భరద్వాజ గోత్ర సంజాతుఁ
డారూఢ మతి ఁయ్యలార్యనందనుఁడు
శృంగార రసకళా శ్రీవిచోధనుఁడు
సింగయామాత్యుఁడు చెలువగ్గలింప
సలలితరసభావ శబ్దగుంభనల
మహనీయమగు దశమస్కంధ సరణి
విహితలీలలనొప్ప విష్ణుచరిత్ర

ప్రకటంబగు మధురాకాండమనిన
నాకల్ప మాకల్పమగు భంగిఁజెప్పె."

భరద్వాజగోత్రసంజాతుఁడును, ఆరూఢమతి యయ్యలార్య నందనుఁడును నగు సింగయామాత్యుఁడు ఔబళమంత్రి కందా మాత్యుని కంకితముగా శ్రీభాగవతదశమస్కంధమును రచించినట్లు స్పష్టము: మఱికి సింగనామాత్యుఁడు రచించిన వాసిష్ఠరామా యణము యొక్క ప్రారంభమున నొక వచన భాగమును దిలకింపుఁడు.

"అని సకలజన సమ్మతంబుగా నుపక్రమించి భాగవత దశమ స్కంధంబును దెనుంగున రచియించి యిచ్చి, అప్పుణ్య పురాణంబులకుఁ గృతిపతిగా నేపుణ్యునిఁ బ్రార్థింతునోయని విచారించి, గజగంధవారణగంధ గోవాళ చలమర్తి గండగండరాయ గజశేఖరదొంతి మన్యవిభాళాది నానా బిరుదవిఖ్యాతులఁ బ్రసిద్ధుండగు రామగిరి పట్టణాధీశ్వరుం డైన కుమారముప్ప భూపాలు మాన్యమంత్రి పదదురంధ రుండగు నమ్మహారాజు దిగంతవ్యాపృత కీర్తిలతాలవాలుం డును, ధర్మచారిత్రుండును, నీతిచాతుర్య విశేషగుణగణా లంకారుండును, అనవరతదాన శీలుండును, అఖిల దిక్పరీత విశాలుండును, వారణ వంశాబ్ధిసుధాకర కాశ్యప గోత్ర పవిత్ర అబ్బనాచార్య తనూభవ కందనామాత్యుండు నాకు నతిస్నేహ బాంధవుండును నభీష్ట ఫలప్రదుండును నపూర్వ వచనరచనానుబంధబంధుర కావ్య రసాభిజ్ఞుండును, అర్థి జన పారిజాతంబును గావున నమ్మంత్రి యుగంధరుం గృతి పతింగావించి, వెండియు కవిత్వ తత్వ రచనా కౌతుకంబున

జిత్తంబు జొత్తిల్ల నొక్కకృతిఁ జెప్పంబూనితి..........."

రాచగిరి పట్టణాధీశ్వరుఁడగు కుమార ముప్పభూపాలుని మాన్య మంత్రియైన కందామాత్యునకుఁ గవి భాగవత దశమస్కంధమును దెనిఁగించి యంకితమొనర్చినట్లు ఈ వచన భాగమునుండి స్పష్ట మగుచున్నది. ప్రస్తుత పరిష్కరణము యొక్క కాండాంత పద్యము లందు కననగు కృతికర్త కృతిభర్తల నామగోత్రాది వివరములు ను, వాసిష్ఠరామాయణ పద్మపురాణములయొక్క కృతికర్త కృతిభర్తల నామగోత్రాది వివరములును నచ్చొత్తినట్లు సరిపోయి యున్నందున భాగవతదశమస్కంధము (ప్రతస్తుపరిష్కరణము) మడికి సింగనార్య కృతమనుటలో సందేహముండదు. తెనుఁగు జాతీయతను బోషించు శైలిని బట్టి చూచినప్పుడును భాగవత దశమస్కంధము, వాసిష్ఠ రామాయణము, పద్మపురాణము ఈ మూఁడును నేకకవికృతములను సత్యము నుద్ఘాటించుచున్నవి.

వాసిష్ఠరామాయణ పద్మపురాణములను బద్యకావ్యములుగా రచించిన మడికి సింగన్న భాగవత దశమస్కంధమును మాత్రమేల ద్విపదకావ్యముగా విరచించెను ! శ్రీకృష్ణభగవానుని లీలలను వీనుల విందుగాఁ బండిత పామరులందఱును, ఆబాలగోపాలము పాడుకొని యానందించుటకు వీలగునట్లు సరళమైన జాతీయగీతమగు ద్విపదలలో నిమడ్చి రచియించుట మంచిదని యుచితజ్ఞుఁడగు కవి తలంచి యట్లొనరించెనని తలంచెదను. అదియునుగాక క్రీ.శ.1240వ ప్రాంతమున రచింపఁబడిన రంగనాథరామాయణముయొక్క సకల జనాదరణమును విచారించి కవి తాను గూడ నట్టి కావ్యమును రచింప నుత్సహించి భాగవత దశమస్కంధమును ద్విపదబద్ధము గావించెనేమో!

## —: కృతిభర్త - కందామాత్యుఁడు :—

మడికి సింగనార్యుఁడు భాగవతదశమస్కంధమును, పద్మపురాణమును దెనిఁగించి ఔబళ కందామాత్యునకుఁ గృతిగా నిచ్చియున్నాఁడు. పద్మపురాణమందుఁ గృతిపతిని వర్ణించు పద్యములీక్రింది విధముగానున్నవి.

సీ॥ స్వామి భక్తుఁడు కార్యచతురుఁడు బహుకళా
    వేది నీతిజ్ఞుఁడు విప్రహితుఁడు
సరస సల్లాపుఁడు సప్తాంగరక్షణ
    క్షముఁడు భావజ్ఞుఁడు సర్వసులభుఁ
డరి మంత్రభేదన పరుఁడు ధర్మాత్ముఁడు
    సుందరాకారుండు సుజనవినతుఁ
డురుదయా పరుఁడు నిత్యోత్సవా సక్తుండు
    సద్గుణాధారుండు సౌమ్యమూర్తి

సతత గురుదేవతా పరిచారరతుఁడు
    గుణసముద్రుండు కాశ్యప గోత్రజనితుఁ
డనఁగ నుతికెక్కి పెంపున నతిశయిల్లు
    మదన సదృశుండు కందన మంత్రివరుఁడు.

సీ॥ ఈ ధర్మచారిత్రు సేధాత్రిపతి యేలు
    నాధాత్రిపతి యేలు నఖిల జగము
నీకామినీకాము నేకామినులు చూతు
    రాకామినులు చూడ రన్యపురుషు
నీయర్కసుతతుల్యు నేయర్థి గొనియాడు
    నాయర్థి యొరు వేఁడ నాస సేయఁ

ధీమంత్రి కులచంద్రు నేమంత్రి పురణించు
నామంత్రి విముఖామాత్యుఁ డఖిలమునకు
ననఁ బ్రగల్భరూపఘనదాననయమార్గ
ముల నుతింప నొప్పు ముజ్జగములఁ
హారహారహీరధవళాంశుసమకీర్తి
కలితుఁ డౌబళ కందవిభుఁడు.

కందన మంత్రికిఁ దాతకుఁ దాతయైన గన్నయ మంత్రి కాకతీయ గణపతి దేవుని కాలములో నుండినట్లు పద్మపురాణములోని యీ క్రింది పద్యము చెప్పుచున్నది.

చ॥ “పరువడిఁ గాకతీయ గణపక్షితినాయకు నొద్ద మాన్యుఁడై
ధరణిఁ బ్రశస్తుఁడై నెగడి దానములెల్లను జేసి భక్తిపెం
పిరవుగ గుళ్ళు గట్టి గణపేశ్వర దేవుని గోపికాధిపున్
దిరముగుచున్న లక్ష్మిని బ్రతిష్ఠలు చేసెఁ బ్రభుత్వమేర్ప
డన్.”

కృతిపతి కందామాత్యుని వంశవృక్షము నిచ్చుచున్నాను.



కాకతీయ గణపతిరాజు క్రీ.శ.1200 మొదలు 1260 వఱకును రాజ్య పరిపాలన జేసెను. దీనినిఁ బట్టి శ్రీ వీరేశలింగము పంతులుగారు తరమునకు నలుబదేసి సంవత్సరముల చొప్పున నేర్పఱచి కందన మంత్రికాలమును 1420గా లెక్కవేసిరి. 1420వ సంవత్సరమునఁ బద్మపురాణమును గందనమంత్రి కృతినందుట దీనికి సరిపోయినది.

మడికి సింగనార్యుఁడు తాను మొదట రచించిన పద్మపురాణ భాగవతదశమ స్కంధములను నరాంకితము చేసెను. కాలక్రమమున నతని చిత్తవృత్తి దైవపరాధీనమగుట బట్టి కాఁబోలును దన మూఁడవ కృతియగు వాసిష్ఠరామాయణమును అహోబలస్వామి కంకిత మొనర్చెను. తనకు ముందుండిన నన్నయాది యాదిమ కవీశ్వరుల యాచారము ననుసరించి కృత్యాదిని గీర్వాణభాషాబద్ధమగు శ్లోకమును వేసుకొనెను. వాసిష్ఠరామాయణము యొక్క ఆదిమ శ్లోకమును జూడుడు.

"శ్రీమద్దివ్యమునీంద్రచిత్తనిలయం సీతామనోనాయకం
వల్మీకోద్భవ వాక్పయోధిశశినం స్మేరాననం చిన్మయం
నిత్యం నీరదనీలకాయ మమలం నిర్వాణ సంధాయినం
శాంతం నిత్యమనామయం శివకరం శ్రీరామచంద్రంభజే."

ఇవి గాక మడికి సింగనార్యుఁడు "సకలనీతిసమ్మత" మను నీతిశాస్త్రమును రచియించెను. సకలనీతిసమ్మతమును శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు ప్రచురించినట్లు తెలియుచున్నది. దీనిలోనికొన్ని పద్యములను కీర్తిశేషులైన శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు, ఈ గ్రంథాలయపు తరపున మద్రాసు ప్రభుత్వసహాయముచేఁ బ్రచురింపఁ బడిన "ఆంధ్రకామందకము" యొక్క పీఠికలో నుదహరించి యున్నారు.

ఈ విధముగా సంస్కృతాంధ్రములందసాధారణ పాండిత్యము కలవాఁడును, సీతి వేదాంతశాస్త్రములందభిరుచి కలవాఁడును, మహాకవియునగు మడికి సింగనార్యుని ప్రభావంతమైన అమృతవాహినియగు లేఖని పండిత పామర రంజకమగు ద్విపదలచే భక్తజనమందారమగు భాగవత దశమస్కంధమును రచించి, ఆంధ్ర సారస్వతమునకు మహత్తరమగు సేవ యొనరించినది !

—: పరిష్కరణ — కథాభాగము :—

తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరి నెం 150 తాళపత్రప్రతి, ఈ పరిష్కరణకు మాతృకయై యున్నది. ఇట్టి ప్రతిగాని, ఇంకొకదధికప్రతిగాని వేఱె యెచ్చటను లేనందున నేను గావించిన సంస్కరణము పూర్తిగా నీతాళపత్ర ప్రతిపైననే యాధారపడి యున్నది. దీనియందు 180 తాళపత్రములున్నవి వ్రాత సుమారుగా నున్నను, తప్పులు విశేషములుగా దొర్లియున్నవి. అక్రూరుఁడు శ్రీకృష్ణభగవానుని స్తుతించు ఘట్టమునుండి యారంభమగుచున్నది. మొదటి నాలుగు పత్రములు కీట దష్టములు: అక్షరముల యాకారము పూర్తిగానశించియున్నది.

కవి భాగవత దశమస్కంధము యొక్క పూర్వోత్తర భాగములను కాండ సంజ్ఞలతో విభజించుకొని యున్నాఁడు. దశమస్కంధపూర్వభాగము కంసుఁడు తన చెల్లెలు దేవకిని వసుదేవునితోఁ గలిపి రథారూఢులఁజేసి మంగళతూర్యనినాదవైభవములతో భర్తృగృహమునకుఁ దానే సారథియై రథమును నడుపుటతో నారంభించుచున్నది. తరువాతి కథయగు నాకాశవాణి కథనము, శ్రీకృష్ణావతార ఘట్టము, నందగోపుని యింట శ్రీకృష్ణుని

బాల్యము, పూతనాదిరాక్షసమథనము మొదలగు వాని నన్నిటిని నొక కాండములో కవి రచించి యుండునని నాయూహ. ఆ కాండము దురదృష్టవశముచే ఖిలమైపోయి యుండునని తలంచెదను. ప్రస్తుత పరిష్కరణ ప్రతి రెండవకాండమగు మధురాకాండముతో ప్రారంభమగుచున్నది. ఇది జరాసంధుని రెండవమారు దండయాత్ర కథతో నంతమొందుచున్నది. ఈ కాండము యొక్క మొదటిభాగము కొంతలుప్తమై పోయినది.

కల్యాణ జగదభిరక్షకాండములలో నుత్తరభాగ కథలు చెప్పఁబడినవి. శ్రీకృష్ణుని వివాహములు, ఈ కాండలయందు వర్ణింపఁబడినవి. జగదభిరక్షకాండము శిశుపాల వధతో నిలిచిపోయినది. ఇఁక నుత్తర భాగకథలగు సాల్వమథనము, దంతవక్త్రసంహారము, కుచేలోపాఖ్యానము, సుభద్రా పరిణయము మొదలగునవి వివరించుచు మఱియొక కాండమును గూడ కవి రచియించియే యున్నాఁడని నాదృఢాభిప్రాయము. దుర్భాగ్యవశముచే నదియు మనకులభింపలేదు. "అని సకలజన సమ్మతంబుగా నుపక్రమించి భాగవత దశమ స్కంధంబును దెనుఁగున రచియించి యిచ్చి......అని వాసిష్ఠ రామాయణములో వ్రాసి యుద్ఘాటించిన మడికి సింగనార్యుఁడు కొంతభాగమునే వ్రాసినాఁడని చెప్పుట యుక్తమగునా!

కొన్నిచోట్ల గ్రంథాంతరమందు ద్విపదలలో నేకపాదము లున్నవి. ఇవి గ్రంథపాతములేమో యని మొదట నేను శంకించితిని. కాని పరిశీలించి చూచినప్పుడు అన్వయము చెడకుండ కథాభాగము నడుచుచున్నందున నా యేకపాద ద్విపదలనట్లే పూర్తి ద్విపదల క్రిందనే లెక్కించి వేసితిని. ఇట్టి లుప్తపాదములు కల శ్లోక భాగములు పూర్వగ్రంథములలోఁ బెక్కులుండుట సహజము.

విజ్ఞాననిధియగు మహాకవి సింగనార్యుని విరచితమైన దీనిని పరిష్కరించుటలో నాయల్పీయమగు బుద్ధిని సాధ్యమైనంతవఱకు నరికట్టి మిక్కిలి శ్రద్ధగానే యుపయోగించితిని. యుక్తికందు బాటులో నున్నట్టి కొన్నిలుప్తభాగములను బూరించి కుండలీకరణముగావించి పాఠకులకుఁ జూపి యున్నాను. వ్రాయసకాని ప్రమాదముచే నేర్పడిన గణభంగములను సవరించితిని. ఈ సవరణ కవిహృదయమునకు భంగముండదని విమర్శన జ్ఞానముతోనే చేయఁబడినదని మనవి చేసుకొనుచున్నాను. అన్వయము సరిగా కాని కొన్ని ద్విపద భాగములను సరిదిద్దిన పూర్తిగా క్రొత్తరూపము సిద్ధించునని తోచిన చోట్ల యథా మాతృకముగానే విడిచి వేసితిని.

బురదలో మాణిక్యమువలె, గుణగ్రాహకుల దృష్టికి మఱుఁగుపడి, ఈ ద్విపదకావ్యము సరస్వతీమహాల్ లైబ్రరి అలమారలోఁ బడియుండినది. దాని యునికిని, శ్రేష్ఠతను నాకెఱుకపఱచినవారు మన్మిత్రులును, బహుగ్రంథ దర్శులును, విద్యానిధులును నగు బ్రహ్మశ్రీ నిడదవోలు వెంకటరావుగారు M. A. (Head of the Telugu Department Madras University) వారికి నా మనఃపూర్వకమైన కృతజ్ఞతాభివందనము లర్పించు కొనుచున్నాఁడను.

—: రచన :—

శ్రీమద్భాగవతములో రసవంతమైనభాగము దశమస్కంధము. దీనిని సంగ్రహించి తెనుఁగు చేయుటలో మడికి సింగనార్యుఁడు కవితాశక్తితో పాటు విషయములను పెంచియో, క్లుప్తపఱచియో ఘట్టములను బ్రతిపాదించుటలోఁ దన విమర్శనా జ్ఞానమును జూపి యున్నాఁడు.

తెనుఁగు సారస్వతరథ మొక్కొక్క శతాబ్దము. నం
దొక్కొక్క పోకడను గల్గి సాగినది. నన్నయాదుల కాలము
ప్రాయికముగా సంస్కృతములోని పురాణేతిహాసములను దెనుఁగు
భాషలో పరిచారమునకుఁ దీసుకొని వచ్చునదిగానుండెను. పెద్దనా
దుల కాలమందు దెనుఁగు సారస్వతముయొక్క పోకడ మారినది.
ఒక చిన్న కథా వస్తువును దీసుకొని పెంచి వన్నెలు చిన్నెలు
దిద్ది స్వతంత్రముగాఁ బ్రబంధ రచన యాకాలమందు సాగినది.
తరువాతి కాలపు కవులు రెండువిధములైన పోకడలను ననుసరించుట
లోనే నిమగ్నులై యుండిరి. ప్రతిభావంతులగు మహాకవులందఱును
భాషాంతరీకరణము నందును, శృంగారాది వర్ణనలయందును
నిమగ్నులై తమ యమూల్యమైన భాషాజ్ఞానమును గవితాశక్తిని
చెక్కడపు పనులతో నగిషీకూర్చిన చక్కని పెట్టెలలో నిముడ్చి
బంధించిరే కాని స్వేచ్ఛగా నడుచుటకవకాశమిచ్చినవారు కారైరి!
వారు తమతమ నాయకానాయికల వర్ణనలయందు చాతుర్యమును
జూపుటలోఁ గన్పఱచిన కవితా శక్తిని ఆయాయీకాలములందుం
డిన దేశీయ జీవన ప్రతిపాదకములగు విషయములందుఁ గన్పఱచి
యుండినచో నాంధ్రభాషాయోష సర్వాంగ సుందరియై యుండును
గదా! ఈ విషయములో నన్నయాదుల భాషాయుగమే కొంత
మెఱుఁగని నాస్వాభిప్రాయము. ఏలనన భారతభాషాంతరీకరణము
తెనుఁగు జాతీయ కవిత్వమును బోషించుటయే గాక మానవ జీవిత
మున కావశ్యకములగు యనేక యుపాఖ్యానములతోఁ జదువుచున్న
కొలఁది చదువ వలయునని యాశక్తిని గల్గించునదిగానున్నది.

మఱికి సింగనార్యుఁడు నన్నయాదులయొక్క పోకడ ప్రధాన
ముగాఁ గల్గినకవి సత్తముఁడు. ఇతఁడు నన్నయతిక్కనలఁ దక్క
నెవరిని స్తుతి యొనరించినవాఁడు కాఁడు.

గీ॥ వ్యాసవాల్మీకశుకకాళిదాసబాణ
హర్షణాదుల నాధ్యుల నాత్మనిలిపి
సకలభాషారసజ్ఞుల సముల నన్న
పార్య తిక్కన కవీంద్రుల నభినుతింతు.

(వాసిష్ఠ రామాయణము)

తెనుఁగు జాతీయ కవిత్వమును బాగుగాఁ బోషించి, దీర్ఘములగు సంస్కృత సమాసములను దొర్లించి విసువుఁ బుట్టించక భాగవత దశమస్కంధ రచన యింపుఁ గల్గించునదై యున్నదన్నచో సత్య దూరము కాదు. కవి స్వాభిమానము కలవాఁడు. తన శక్తిని బాగుగాఁ గుర్తెఱిఁగిన వాఁడు.

క॥ ఆపరమేశ్వర మకుట
వ్యాపిత గంగాప్రవాహ కవితా స
ల్లాపుఁడగు మడికి సింగనఁ
జేపట్టక కీర్తిగలదె శ్రీమంతునకున్.

(పద్మపురాణము)

కవి గొప్ప భక్తుఁడు. వేదాంత శాస్త్రమందభిరుచి కలవాఁడు. కాఁబట్టి సాక్షాత్ లక్ష్మీదేవి యవతారమగు రుక్మిణిని వర్ణించు సందర్భమునందు స్తోత్రసాహిత్య పక్కని పాదాదికేశాంత వర్ణన జేసి యున్నాఁడు

ద్వి॥ "ఉచ్ఛ్రిత పండ్లతో నుల్లసంబాడు
నచ్ఛపలాశికి నంగుష్ఠచయము ;
పదనఖద్యుతుల నుపచరించు నెలవుఁ
గదియ మహాక్తికములుఁ గట్టి నట్లుండు ;

తనరు గచ్ఛప నిధిద్వయ మింతి పాద
వనజాతముల మీఁద వ్రాలెనో యనఁగ;
గమనజాడ్యము శుభాకరమును నగుచుఁ
గమనీయలీల మీఁగాల్గొప్ప సతికి;
పగడంపుఁ దీగల పంక్తులో యనఁగ
మగువకు నొప్పారు మడిమల తీరు;
........................."

(ద్వి॥ భా॥ పుట 72)

విష్ణు శక్తియగు రుక్మిణీదేవి వర్ణనము శ్రీకృష్ణుని వద్దకు దూతగా వెళ్ళిన బ్రాహ్మణుని నోట నుండి వచ్చునప్పుడుచితజ్ఞుఁడగు కవి చూపిన మర్యాదను, బ్రాహ్మణుఁడు రుక్మిణీదేవి యొక్క-యభిప్రాయమును రసికాగ్రేసరుఁడగు శ్రీకృష్ణుని యెదుట ప్రతిపాదించిన నేర్పును గమనింపుడు.

ద్వి॥ "అనఘాత్మ! భీష్మకుండను విదర్భేశు
తనయ రుక్మిణియను ధవళాయతాక్షి
తనుమధ్య యుత్ఫుల్ల తామరసాక్షి
గరుడ కిన్నర యక్షగంధర్వసతులు
దొరయ లేరా యింతితో నీడుఁజోల్ప;
దేవర సౌభాగ్య దివ్యవర్తనలు
వావిరి జనులెల్ల వర్ణింపుచుండ
విని పుష్పధన్వుని విషమబాణములు
యనవొందఁ దనువున నట నాటుటయును
చిత్తంబులో నీదు చెలువైన మూర్తి
చిత్తరు వొత్తిన తెలువంబుఁ దోఁపఁ
జింతించు వెఱఁగందు చేష్టలు మఱచు

నంతకంతకు నిన్ను నభిమతి సేయు
విరహాగ్ని శిఖఁ గ్రాఁగు వెలవెల నగుచు
మరులెత్తినట్లు పల్మరు చిన్నఁబోవు
నీభంగి నున్న యీ యిభరాజగమనఁ
బ్రాభవంబునఁ జైద్యపతి పెండ్లియాడ
నెల్లుండి చనుదెంచు నెఱిఁగి యీయింతి
యెల్ల విధంబుల నిది నీకుఁ జెప్పి
పుత్తెర వచ్చితిఁ బుండరీకాక్ష!
చిత్తంబులో నొండు చింతింప నేల
ఆభామ నిజభార్యయై యుండునట్టి
సౌభాగ్య మెవరికి సమకూరు! నీవు
నారుక్మిణిబ్బంగి నాసలు సేయు
కారుణ్యమూర్తివి కమలాక్ష! నిన్నుఁ
గడసి నీదరహాస కౌముదిఁ గ్రోల
ముదిత నేత్రచకోరములుఁ చేరఁగోరు
నలవడి నీప్రియాణాంబువులోవఁ
గలకంఠి చాతకి కడువేడ్క సేయు
నీకెటులైనను నేచిన వేడ్క
నావెలందుక నేలుటది నీకు నొప్పు;
నిను నమ్మియుండిన నెలఁతుక నొకఁడు
కొనిపోవఁగాఁ జూడఁగూడదు నీకు!"

మొదట శ్రీరుక్మిణి యొక్క నామ వంశాదికములను జెప్పి యా
దవాన్వయవంశమణియగు శ్రీకృష్ణుని వరించుటకుఁ దగిన
యోగ్యతను నిరూపించెను. తరువాత దక్షిణనాయకుఁడైన శ్రీ
కృష్ణుని చిత్తము నాకర్షించుటకై యువజనాకర్షకములైన తను

మధ్యత్వము, యుత్ఫుల్ల తామరసాక్షులు, దేవకన్యలతో గూడ నీడుఁ బోల్పగారాని లావణ్యము మృదువుగాను క్లుప్తముగాను నాటు నట్లు వ్రాక్రుచ్చెను. పిమ్మట సమస్తగుణగణములతో విరాజిల్లు శ్రీకృష్ణునియందు ఆమెకున్న మోహపాశమును వివరించెను. శ్రీకృష్ణుని విరోధి యామెను బెండ్లాడ నిశ్చయమైనందున దన రాకకు ముఖ్యకారణమని నొక్కి చెప్పెను. కొసకు "ఆభామ నిజభార్యయై యుండునట్టి సౌభాగ్య మెవరికి సమకూరు"? అని ప్రశ్నించి శ్రీకృష్ణుని యుత్సాహమును రేకెత్తించెను. చూచితిరా కవి చాతుర్యము! చాతుర్యముతో పాటు కవితాధార మిట్ట పల్లములులేని నడకతో సొంపుగా సాగెడు తీరును గమనింపుడు!

అదే సందర్భమందుఁ బోతనార్యుని వర్ణన యించుక గమనింపుడు.

సీ॥ "పల్లవనైభవాస్పదములగు పదములు
కనకరంభాతిరస్కారు లూరు
లరుణప్రభా మనోహరములు కరములు
కంబు సౌందర్యసంగళము గళము
మహిత శోభావాభావ మధ్యంబు మధ్యంబు
చక్షురుత్సవదాయి చన్నుదోయి
పరిహాసితార్ధేందు పటలంబు నిటలంబు
జితమత్త మధుకర శ్రేణి వేణి

భావజాశుగముల ప్రావులు చూపులు
కుసుమకరుని వింటి కొమలు బొమలు
చిత్తతోషణములు చెలువ భాషణములు
జలజనయనముఖము చంద్రసఖము."

వెలలేని యీపద్యరత్నము నెంతకొనియాడినను దనివి తీరనిది. కాని స్థానము చెడి శోభింప లేకున్నది. దూత్యముఁ జేయఁబోయిన బ్రాహ్మణుఁడిట్లు వర్ణించుట సందర్భోచితము కాఁజాలదు. ఈ సందర్భమునందు సింగనార్యుని రచనయే స్వాభావికమై యింపును గూర్చునదిగా నున్నది

సౌధవర్ణన, ఋతువర్ణన, యుద్ధవర్ణనము మొదలగునవి కవి చాలచోట్ల చేసియున్నాఁడు. ప్రబంధముల విసుగు పుట్టించు ఘట్టములిట్టి వర్ణనాడంబరములే యగును. అయినను జతురుఁడగు నీకవి పాఠకులకా భాగములందు వినోదమునే కలిగించి చరితార్థుఁడయ్యెను. మచ్చునకు కొన్ని యెత్తి చూపించుచున్నాను.

పురస్త్రీలు శ్రీకృష్ణబలరాములను జూచి వారిలో వారు మాట్లాడుకొనుటను దిలకింపుడు.

"ఈతఁడే, ఎలనాగ! ఇసుమంత నాఁడు
పూతన (పాల్ ద్రావి) పొరిఁగొన్నవాఁడ,
"సకియరో! ఈతఁడే శకటమై వచ్చు
ప్రకట దానవుఁ ద్రుళ్ళిపడఁ దన్నినాఁడు.
ముద్దియ! ఈతఁడే మొగి ఱోలుఁ ద్రోచి
(మద్దియలు) [illegible]పిన మహనీయ యశుఁడు
అక్కరో! ఈతఁడే యఘదైత్యుఁ జీరి
కొక్కెర రక్కసుఁ గూల్చిన వాఁడు.
గోవర్ధనముఁ గేల గొడుగుగాఁబట్టి
(గోవుల దే)ర్చిన గోవిందుఁ డితఁడె.
కొమ్మ! ఈతఁడే పిల్లగ్రోవూది వ్రేతఁ
గొమ్మల గడువెట్టిఁ గొలిపిన వాఁడు."

కవి శ్రీకృష్ణుఁడు బలరామునితోఁ గలసి కంసుని కొలువు కూటములో ప్రవేశించు సందర్భమున, శ్రీకృష్ణుని స్వరూపమును గుణగణములతో సహా పాఠకుల కంటిముందఱ నెంత మనోహరముగాఁ జిత్రించుచున్నాఁడో చూడుఁడు !

"కరిమదరక్త పంకములచే మేన
దొరఁగెడు ఘర్మ బిందువులును నరయ
హరిమేను చిత్రవనాంబుద మనఁగ
నరుదారఁ జూపట్టె నందంద చూడ;
గజదంతములుఁ దాను కామపాలుండు
భుజశిఖరంబులఁ బొలుపొందఁ దాల్చి
దారుణతర దండధరయుగ్మమనఁగ
గౌరత మల్లరంగము సొచ్చి నిలువఁ
గోరి మల్లులకెల్ల కులిశమై, ప్రజకు
ధారుణి నాథుఁడై, తల్లిదండ్రులకుఁ
బసి బాలుఁడై యొప్పు, పంకజాక్షులకు
నసమాస్త్రుఁడై, వల్లవాళికి నెల్లఁ
బరమాప్తుఁడై, యతిప్రతతికి నెల్లఁ
బరతత్త్వమూర్తియై, బంధు సంతతికి
దైవమై, రోహిణీతనయుఁడు దాను
నావిష్ణుఁడరుదెంచె నందఱుఁజూడ."

శ్రీకృష్ణుని రూపును వర్ణించు కొన్ని ద్విపదలు చిత్రకారులకుం చెకు రసాయనమై ప్రోత్సాహమును గల్గించునదిగా నుండుట జూడుఁడు !

"నల్లని మేనున్నతమైన యురము
దెల్లదమ్ముల మించు తెలి గన్నుగవయు
నెరిజడ చొళ్లెము నిటల రేఖయును
జిరునవ్వు మోమును జేత వేణువును
పాయక జగిమించు పసిఁడి చేలయును
దలఁబురి పెనవు కదంబ మంజరియు
ధళధళ వెలిఁగెడు దంతదీధితియుఁ
గలరూపు మోమున గట్టినట్లుండు."

ఈ విధముగా వివిధమైన మనోహరవర్ణనలతోను, ఇంపును గూర్చు స్వభావోక్తులతోను, చక్కని తెనుఁగు నడకతోను, నాతిదీర్ఘ ములగు మధురమైన సమాసములతోను శ్రీకృష్ణుని చరిత్ర ద్విపద బద్ధముఁ గావించి మహాకవియగు మడికి సింగనార్యుఁడు భాగవత దశమ స్కంధమును మాట్లాడు చలన చిత్రముభంగి పాఠకుల దృష్టి పథమునకుఁ బ్రదర్శించి ధన్యుఁడయ్యెను !

—: కొన్ని వ్యాకరణాంశములు :—

1. సంధి :—"పరిమార్చినతఁడు" "రుక్మిణిబ్బంగి" ఇత్యాది సంధిరూపములక్కడక్కడ కన్పడుచున్నవి. ఇట్టిసంధులు భావలోవిరళములు. మహాకవుల సమ్మతములే. "తామర సనేత్రలిండ్లు" "మా భక్తులొద్ద" "ఇతరులిండ్లు" ఇట్టి ప్రయోగముల నేకములున్నవి.

2. "హరుషనిర్భర చిత్తుఁడై పలికె నతఁడు" ఇచ్చట "హర్ష" అనుపదమును విడదేసి "హరుష" అని ప్రాసకొఱకు ప్రయోగింపఁ బడియున్నది.

అప్పకవివంటి లాక్షణికుఁడు మడికి సింగనార్య కృతమగు వాసిష్ఠరామాయణములోని రెండు పద్యములను "అప్పకవీయ" ములో నుదహరించి యున్నాఁడు.

—: ముగింపు :—

సరస్వతీమహాల్ లైబ్రరిలోని తెనుఁగు వ్రాతప్రతుల సంఖ్య సుమారు 816 ఉన్నవి. ఇవి తంజావూరాంధ్ర నాయక రాజుల కాలమునుండి వచ్చుచున్నవి. నాయకుల పరిపాలన కాలశకము 1535—1675 వఱకు సాగినది. తరువాత మహా రాష్ట్ర రాజులు తంజావూరును బరిపాలించిరి. నాయక రాజులలో "రఘునాథ నాయకుఁడు", అతని కుమారుఁడు "విజయరాఘవ నాయకుఁడు" ఈ యిద్దఱును తంజావూరాంధ్ర సాహిత్యమునకు జీవగఱ్ఱలై యుండిరి. స్వయముగా గూడ అనేక గ్రంథములను విరచించిన ప్రజ్ఞానిధులు వారు. మహారాష్ట్ర రాజులలో గూడ తెనుఁగు సాహిత్యము కొనసాగినదే కాని మొరడు పోలేదు. మహారాష్ట్ర రాజులైన ఏకోజి, శాహ మహారాజులు స్వయముగా తెనుఁగు ప్రబంధములను వ్రాసిన మేధావులు. లైబ్రరిలోని తెనుఁగు గ్రంథములను ఈక్రింది విధముగా విభజింపవచ్చును.

(1) పద్యకావ్యములు
(2) ద్విపదకావ్యములు
(3) శతకములు
(4) దండకములు
(5) గానములు
(6) నాటకములు (యక్షగానములు)

(7) వచన కావ్యములు
(8) శాస్త్రసాహిత్యము
(9) వివిధగ్రంథములు.

మద్రాసు ప్రభుత్వము వారు స్వతంత్రమును బొందిన హిందూదేశ పురోభివృద్ధికి విజ్ఞానము ప్రధానాంశముగా గమనించి పైలైబ్రరి లోని తెనుగు శాఖకు సంబంధించిన పుస్తకములను గొన్నింటిని బ్రచురించి, ఆంధ్రసాహిత్యమునకు మహోదుపకారమును జేయుటకు పూనుకొని యున్నారు. ఈ విషయమందు మద్రాసు ప్రభుత్వము వారు చూపిన శ్రద్ధకు ఆంధ్రలోకము మనఃపూర్వకమైన ధన్య వాదములు సమర్పించుకొనుటలో వెనుకంజ వేయదు. ఈ చిన్న సేవను జేయు సందర్భమును నాకిచ్చి భాగవతదశమ స్కంధము యొక్క పరిష్కరణ భారమును నాకొసంగిన సరస్వతీమహాల్ లైబ్రరి గౌరవకార్యదర్శి శ్రీయుతులు యన్. గోపాలన్ బి.ఏ., బి.ఎల్., గారికి నాకృతజ్ఞతాభివందనములను సమర్పించుకొను చున్నాను.

మా సరస్వతీమహాల్ లైబ్రరి విమర్శనశాఖా నిర్వాహకులును, బహుగ్రంథ ద్రష్టలును, సర్వతోముఖ పాండిత్యమును గల శ్రీయుతులు కే. వాసుదేవ శాస్త్రిగారు నాకన్నివిధములుగా ప్రోత్సాహము నొసంగి నాయుద్యమము కొనసాగుటకు సహాయ మొనరించిరి. వారికి నా మనఃపూర్వకమైన కృతజ్ఞతాభి వందనము లర్పించుకొనుచున్నాను.

నాకన్ని విధములను జేదోడు వాదోడుగానుండి సహాయ మొనర్చిన మన్మిత్రులు శ్రీయుతులు విఠలదేవ్రని సుందరశర్మగారికి నాకృతజ్ఞతాభివందనములను నివేదించు కొనుచున్నాను. తాళపత్ర

ప్రతి గ్రంథమును శ్రమను పాటించక శ్రద్ధగా వ్రాసి యిచ్చిన లైబ్రరి తెనుఁగు లేఖకుఁడు చిరంజీవి యస్. విశ్వనాథునకు నా యాశీర్వాదపూర్వకమైన ధన్యవాదములు. ఈ చిన్న పొత్తమును సకాలమందు తగువిధముగా ముద్రణ చేసిన "అముదనిలయం" ముద్రణాలయమువారికి నా ధన్యవాదములను సమర్పించుకొను చున్నాను.

ఈ యుపోద్ఘాతారంభము మా కులమునకు పరమగురువులగు శ్రీరమణ మహర్షులవారికి నమస్కృతులతో ప్రారంభించినది. నాజనకులును, గురువును దైవమునగు శ్రీ వాసిష్ఠ కావ్యకంఠ గణపతి మునులవారిని స్మరించుటతోపాటు శ్రీకృష్ణభగవానుని పై వారు సెలవిచ్చిన శ్లోకముతో నీ యుపోద్ఘాతమును ముగించు చున్నాను.

శ్లో॥ భూమిభార వారణాయ యోయదుప్వభూ ద్విభు
ర్విస్మయం శిశోశ్చ యస్య చేష్టితాని తేనిరే
శర్మవః స పూరుషో రథాంగమాయుధం దధ
త్కర్మయోగదేశికః కరోతు పార్థసారథిః.

సరస్వతీమహాల్ లైబ్రరి
తంజావూరు. 7-12-50.

వాసిష్ఠ, ఆ. మహాదేవశాస్త్రి.

# ఉపోద్ఘాతానుబంధము.

---

క్రీ. శ 1948 వ వత్సరమునందు జరిగిన భాగవత ముద్ర
మునకు విద్యారత్న శ్రీ నిడదవోలు వెంకటరావుగారు M. A
(Senior Lecturer and the Head of the Telugu Departmen
Madras University.) వ్రాసిన పీఠికలో "భాగవతానువాదములు"
అను శీర్షికలో నుదాహరింపఁబడిన ద్విపదభాగవతముల పట్టి
నీక్రింద నుదాహరించుచున్నాను. చిత్తగింపుడు.

1. పండ్రెండు స్కంధములు (సంపూర్ణము) తరిగొండ వెం
   మాంబ (అముద్రి)
2. మొదటి నాలుగు స్కంధములు - తేకుమళ్ళ రంగశా
   (అము)
3. దశమ స్కంధము (ప్రస్తుతపరిష్కరణము) - మడికి సింగన
4. ,, రత్నాకరము గోపాలకృష్ణకవి (అము)
5. రుక్మిణీకల్యాణము - చెన్నయ (అము)

పరిష్కర్త

ద్వా॥ భా॥

# విషయ సూచిక.

—: మధురాకాండము :—

పుట.

పుట.

పుట.



—: కల్యాణకాండము :—

పుట.

పుట.

పుట.

పుట.



—. జగదభిరక్షకాండము :—

పుట.

శ్రీరస్తు

# ద్విపదభాగవతము.

(దశమస్కంధము)

## మధురకాండము.

—: అక్రూరుఁడు శ్రీకృష్ణుని స్తుతియించుట :—

................ లబ్ధిచయము
లన్నగంబులు, గుహ్యామ ప్రజాపతియు
నగు, విశ్వరూపాత్మ! అధ్యాత్మరహిత!
నిగమమార్గగోచర! నినుఁగొల్తుఁగృష్ణ!
విద్యా (ధరస్తుత్య) విశ్వలోకేశ!
ప్రద్యుమ్న! యనిరుద్ధ! బలవాసుదేవ!
సంకర్షణాభీమ సర్వసర్వాత్మ!
పంకజోదర! శుభప్రద! హృషీకేశ!
[1]జలధిలోపల నున్న జలచరములును
[2](చెలఁగ) నవని సర్వజీవులు నినుఁడు
సరసిజాననరుద్రమణ్ముఖభోగి
వరులును, నీలీల వర్ణింపలేరు.
ఏనొక్కమనుజుండ హీనమానుసుఁడ

---

[1] జలధిలోపల జలచరము. [2] ........నిలో సర్వజీవులునుడు.

........మూర్తిఁ బొగడంగ గలనె ?"
(అనియిట్లు) కొనియాడు నక్రూరుఁజూచి,
తనరారశౌరి యంతర్ధానమయ్యె.
అతతసుస్నాతుఁడైన యక్రూరు
(నీతరిముర)హారి యీక్షించిపలికె.

*  *  *  *  *
*  *  *  *  *
*  *  *  *  *
*  *  *  *  *
*  *  *  *  *
*  *  *  *  *
*  *  *  *  *
*  *  *  *  *

—: శ్రీహరి అక్రూరుని కంసునికడకుఁ బంపుట :—

" కావున నీవు నక్కంసుతోఁ జెప్పు,
వేవేగ మేము నీవెంటనే వత్తు   10
మనవుండు నక్రూరుఁ డరదంబునెక్కి
............ నచ్చటి వార్తఁ జెప్పె.
తనయింటికేఁగినంతట రామకృష్ణు
లనుపమంబగు వేడ్క ననుఁగులుఁదారు.

—: శ్రీకృష్ణుఁడును, బలరాముఁడును మధురాపురికేతెంచుట :—

తొడివూసి కట్టి సంతోషంబుతోడ,
...........దెంచికనిరంతరమోల ;

పసిడిగోపురములుఁ బసిడికోటలును
బసిడి మాడవులను బసిడిమేడలను
హేమకుంభంబుల నెంతయునొప్పి
హేమ (మయముగ) సొంపెసలారి యుండఁ
గని వానిమహిమకుఁ గడుసోద్యమంది
తనరార తత్పురద్వారంబు సొచ్చి
రమణీయ (శోభపుర) మున నేతెంచుఁ
గమలాయతాక్షులఁగని చాలవేడ్కఁ
బౌరకామినులెల్ల భావకోల్లాస
పారవశ్యంబునఁ బరతెంచి పేర్చి

—: పురస్త్రీలు శ్రీకృష్ణ బలరాములఁజూచి వర్ణించుట :—

సౌధాగ్రములయందు సదనంబు(లందు)
(వీధు)లయందును వెఱవొప్ప నిలిచి
కరపల్లవంబులఁ గరమొప్పఁజూపి
సొరిది వారండఱుఁ జూపులు వఱపి ; 20
" ఈతఁడే, యెలనాగ ! ఇనుమంతనాఁడు
పూతన (పాల్ద్రావి) పొరిఁగొన్నవాఁడు,
సకియరో ! ఈతఁడే శకటమైవచ్చు
ప్రకట దానవుఁ ద్రుళ్లిపడఁదన్నినాఁడు.
ముద్దియ ! ఈతఁడే మొగిఱోలుఁద్రోచి
(మద్దియలు)డిపిన మహనీయ యశుఁడు.
అక్కరో ! ఈతఁడే యఘదైత్యుఁజీరి
కొక్కెరరక్కసుఁ గూల్చినవాఁడు.
గోవర్ధనముఁగేల గొడుగుగాఁబట్టి

(గోవులఁ దే)ర్చిన గోవిందుఁ డీతఁడె.
కొమ్మ! ఈతఁడె పిల్లఁగ్రోవూది వ్రేతఁ
గొమ్మలఁ గను వెట్టిఁ గొలిపినవాఁడు.
కాళీయుపడగలుఁ గ్రతఁద్రొక్కి వాని
కాళి............న పుఃఖ్యుఁడితఁడె.

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

[1](పడఁతిని దంౘ్రడిచేఁబలమినిఁగొన్న)
యెదిరి? కంసుని యేపుమాయించి
యీతఁడే రాజ్యాన నిలమెల్లఁ బ్రతుకు;

*　　*　　*　　*　　*

నెలఁత యీతఁడు రోహిణీదేవికొడుకు
బలుఁడను రక్కసుఁ బరిమార్చినతఁడు;" 30

*　　*　　*　　*　　*

మలసి యుద్ధటి విక్రమంబులఁజూడ
నారామ కృష్ణులు నాపట్టణంబు,
భూరిసౌఖ్యముల నుబ్బుచుఁబోయి

—: శ్రీకృష్ణుఁడు రజకుని రూపుమాపుట :—

(రాచ)చీరలఁ దెచ్చు రజకుని శౌరి
చూచి యల్లన నవ్వుచుఁ జేరి పలికె.
"మడివాల! మాకైన మణుఁగుఁబుట్టములు

[1]......తంౘ్రడిచేకొన్న.

కడు వేగఁ దెమ్మన్న" కనలి (వాఁడనియె).
"అద్దిరా! లెస్సవో యగునగు మీకు
దిద్దంగ వచ్చునే తివిరి మీగుణము
నిను విచారించవు, నినుఁ జూచుకొనవు
చను నె యీ రాచ (వసనము)లడుగ
నడవులలో మందలాఁగి రానేల!
పొరలు పెట్టెడు పుట్టుభోగులు మీరు
పరిఘమ్ములును గోరుపడము గొంగళ్లు
(కరకంచు)కోకలు కట్టుడు మీరు.
(ఈ రాచ)కోకలు యిమ్మన్న నెట్లు,
నోరాడ! నొంచితి, నొవ్వకుండనిన,
శౌరి కోపించి యాచాకలిఁ బట్టి
* * * * * 40
పిడికిటఁ బొడిచినఁ బెల్లుగా నేలఁ
బడి తన్నుకొని వాఁడు ప్రాణముల్ విడిచె;
వడి వాఁడుఁ గూలిన వానితో వచ్చు
మడివాళ్లు వెగ్గలి మడుఁగు(లువీడి)
కనుఁగొని పారినఁ గన్నిచ్చు వచ్చు
తనుపారు చీరలు ధరయించి శౌరి
బలరామునకును గోపాలసంతతికి
వలయు వస్త్రములిచ్చి వారును దాను

—: శ్రీకృష్ణుఁడు తన్నుపచరించిన పట్టుశాలివనుగ్రహించుట :—

జ(నుచున్న చోఁ) బట్టుశాలి యొక్కరుఁడు
తననేర్పు మెఱసి వస్త్రము నేసి వేడ్క

మనుజేంద్రునకు నిచ్చి మన్నన వడయఁ
గొనిపోవుచు ప్రేమ గోవిందుఁగాంచి
(యనుపమ) భక్తితో నడుగుల కెఱఁగి
తనచేతి చీర ముందటఁబెట్టి నిలిచి ;
" యవధరింపుము కృష్ణ ! అంభోజనయన !
తవిలి పుణ్యుఁడనైతి ధన్యుఁడనైతి
(నాపద్మ) జాదుల కందరాని
నీపాదము (లభించె) నిఖిలలోకేశ !
మునిలోకనుతపాద ! మురవైరికృష్ణ !
(కొనుము యీపుట్టంబు గోవింద ! యనినఁ) 50
గని శౌరి కరుణ (సకలకామ్యములును)
తనలోకమును నిచ్చి ధన్యునిఁ జేసె

—: శ్రీకృష్ణుఁడు సుదాముఁడను పుష్పలావికుని
యనుగ్రహించుట :—

అరుగుదేర సుదాముఁడను పుష్పలావుఁ
డరిగి యెదుర్కొనె నత్యంతభక్తి
బలరామకృష్ణుల పాదాబ్జములఁ
జెలువారఁ బూజించి చెంగల్వదండ
లిరువురకునునిచ్చి యింపుసొంపార
విరు(లమాలి)కలిచ్చి వెసవేయుగతులఁ
గీర్తింపఁగని హృషీకేశుండు శౌరి
యార్తరక్షణశీలి యతనిమన్నించి
వరము వేడుమటన్న వాఁడు " మీపాద
సరసిజంబులుఁగొల్చు సద్భక్తి నాకు

దయసేయుమనుచు నాతనిఁదన్పుసేసి
నయమైన తత్ప్రసూనములర్థిఁదాల్చి
మనమున హర్షించి మరలిపోవంగ

—. శ్రీకృష్ణుఁడు కుబ్జను మంచిరూపమునిచ్చి
యనుగ్రహించుట :—

కనియెఁగృష్ణుఁడు రహిఁగంధపుదిప్ప
వలచేతఁబూని త్రివక్రయై నడచు
జలరుహాక్షుఁడు కుబ్జ చపలాక్షి(నారసి)
(కని)చల్లననగుచు కలకంఠి యెందుఁ
(జనియెదు)గంధభాజనమెవ్వరికిని
గో: పో(వుచున్నావు కోమరొప్ప నీవి?)
(అనవుఁడు) హరిఁజూచి యాకుబ్జ పలికె.
" వనజాక్ష రేను...............త్రివక్ర
యనుదాన రాజు నన్నర్థి మన్నించు
గంధంబు వాసించి కలపంబుఁగూర్చి
యందంబుగా మేన నలఁదఁగా నేర్తు
నిదె, దేవరకు యోగ్యమీగంధ, మలఁది
పతివేలుభూములు పాలింపు" మనుచు
మ్రొక్కి గంధపుదిప్ప మ్రుంతఁ నిడిన
నక్కజంబుగ శౌరి హలియునుఁదాను
చందనంబలఁది యాచపలాక్షిమేని
చందంబుఁజూచి యాచతురుఁడు దాని
కాలుకాలున మెట్టి కందువకేలఁ
గీలించినంత మైకిటుకును మాని

మెలఁతుక క్రొవ్వాఁడి మెఱుఁగకోయఁగఁ
గలికి కన్నులసోయగము నివ్వటిల్ల
మురిపంబు చిరునవ్వు మోమున మెఱయ,
హరిఁజేరి సరసోక్తి నల్లనే పలికె.
"నాకాలుఁద్రొక్కితి నన్ను మన్నించి
నాకోర్కిఁదీర్చుట నెయ్యంబు నీకు 70
నాయింటికే తెమ్ము నలినాక్ష!" అనుఁడు,
ఆయింతిఁగనుఁగొని "యటఁబోయి మఱలి,
చనుదెంచెదముగాన చనియెద" మనుచు
వనిత వీడ్కొలిపి, యావసుదేవసుతుఁడు
చని వణిక్పథమున సకల (బేహార్లు)
అనుపమదివ్య గంధాంబరాభరణ
ములు కానుకలు చేసి మ్రొక్కిదీవింప;
చెలువల మనములఁజిత్తజానలము

—: శ్రీకృష్ణుఁడు కంసుని మహాధనువును విఱచుట :—

మురిగొని చూడఁగ మొగశాల కడకు
నరుదెంచుచో మందరాంతంబునందుఁ
బొలుచు మహాభోగిభోగమో యనఁగఁ
జలనిధిమొందనియట్టి చాపమో యనఁగఁ
బ్రకటారిజలరాసిపటు కేతువనఁగఁ
గకుటివారణ కరకాండమో యనగఁ
నారూఢ గంధపుష్పార్చితంబగుచు
మేరుశైలాకృతి మెఱయు కార్ముకముఁ
గని, దాని చాపరక్షకులు వారింప

దనుజారి యమ్మహాధనువెక్కు ద్రోచి
వడిగుణధ్వని సేసి వారక తివిసి
పిడికిలి వదలిన ఫెళఫెళధ్వనులు 80
దిక్కులు వ్రయ్యంగ దిగిభంబులగలఁ
జుక్కలు డుల్లంగ సురలోకమదర
ధారుణి వణఁక పాతాళంబువగుల
వారాసి పిండలివండు గాఁగఁగఁగ
పిడుగులు పదివేలుపెట్టి యొక్కడను
పడియునోయన విల్లు బల్లన విఱిగె
అట మహాధ్వని విని యాపౌరులెల్లఁ
బటుగతిఁ దూలఁగ భూపతి బెట్టుకలఁగి

—: కంసుఁడు శ్రీకృష్ణునిచేఁదన ధనుర్భంగమును విని విచారించుట :—

తన కెలంకులనున్న దానవాధిపులఁ
గనుఁగొని పలికె నుత్కట కోపమొనఁగ,
కోపించి "వసుదేవుఁగొడుకులు నేఁడు
నా పట్టణముఁ జొచ్చి నావిల్లువిఱిచి
చలముచేకొని ధనుశ్శాల నున్నారు.
బలసి మీరందఱు బలశక్తి మెఱసి
వారలసిద్ధఱ వధియింపు డొండె
కారాగృహాన నుక్కరఁబెట్టుడొండె".

—: శ్రీకృష్ణుఁడు కంసుని పంపున నేతెంచిన రక్కసుల రూపడరించుట :—

అని పుచ్చుటయు దైత్యులసమసాహసులు,

చనుదెంచి వారితో సమరంబు సేయ
నారామకృష్ణులు నవ్వీరవరులఁ
దోరంబుగల వింటితునుకల నడచి 90
(మెఱసి) కంసునియింటిభృత్యుని బలునిఁ
బరిమార్చి యుండఁజేఁ బఱపి యాలోన
గమ్మన నాయుధాగారంబు వెడలి
యిమ్ములఁ బురలక్ష్మి నెలమిఁ జూచుచును
నొప్పార నందాదులున్న యయ్యెడకుఁ
దప్పకఁ జనిరంతఁ దపసుండు గ్రుంకె.

—: కంసుఁడు దుర్నిమిత్తములను జూచి బెగడుట :—

తనరారు శోణాంశుతమ్ములుఁ దీర్చి
యనుపమసుఖలీల నారాత్రియందు
నంతనంతయువిని యాభోజనృపతి
చింతించి బెగ్గలి చేష్టలు సడలి
దారుణంబైన వేదనఁబొంది కంది
కూరుకుఁగానకఁ గొందలంబంది
యద్దంపు నీడలో నాతతంబునను
నిద్దంబుగాఁ దననీడఁ జూడఁగను
తలలు రెండై యుంట..........
గలవెత నగ్నులు గానంగ బడుట
ఖరలులాయోష్ట్రాదికములును గనుట
యరుదార తలనూనెలంటుకొంచుంట
విసములుఁ దినుచుంట ప్రీతిదాసనపు
కుసుమధామంబులఁ గొనధరించుటయు 100

ధూళిలో రొంపిలోఁ ద్రొక్కినయపుడు
కాలుమోవక పాదఖండమై యుంటఁ
చెవులు మూసినయెడ సింధుఘోషంబుఁ
బ్రవిమలంబుగ వినఁబడకుండుటయును
నివియాదిగాఁ బెక్కు లీక్షించి తనకు
యవసానకాల మానని యాత్మనెఱిఁగి
పురపురఁ బొక్కుచుఁబొగిలి లోఁగంది
మరణభయంబున మదిఁదప్పెనంత;
నెట్టకేలకు వేఁగ నినుఁడు పూర్వాద్రి
దట్టుఁజై పొడ తెంచెఁ దమ్ములింపలర.

—: కంసుఁడు కొలువుకూటమందు శ్రీకృష్ణబలరాముల రాకను ఎదురుచూచుట :—

అంతఁ గంసుఁడు పూర్వాహ్ణకక్రియలు
నంతనంబునఁ దీర్చి సకలభూపతులుఁ
గొలిచియుండఁగఁ బెద్దకొలువుండి వేడ్క
బలరామకృష్ణుల బవరంబుఁ జూడఁ
దలఁచి పెంపెసలారు తమకంబులందు
వలయువారును దాను వసియించెనంత;
మఱియును బహువిధమంచియలందు
వరులు సద్విజరాజవైశ్యశూద్రులను
బ్రవిమలంబుగనుండి, రంగమధ్యమున
వివిధపుష్పసుగంధవిధులు వాసించి 110
పరగనవ్వేళ గోపాలురుఁదాను
నరుదెంచి నందుండు నాభోజపతికిఁ

బోడఁజూపి తమ తెచ్చు భూరివస్తువులు
కడఁకతో నిచ్చినఁ గరము మన్నించి
తనచేతువనె యొక్క తమకంబుమీఁద
నునిచివారునుదాను నొగిఁజూచుచుండె.
కరియూధమే తెంచుగతిమల్లవర్గ
మరుదెంచ వందిబృందారవంబెసఁగఁ

—: కొలువునకు ముష్టికచాణూరులే తెంచుట :—

జనుదెంచి ముష్టికచాణూరముఖ్యు
లెనయ రంగస్థలంబెల్లఁ దారగుచు
భుజమప్పళింపుచుఁ బోరి విజృంభించి
గజభజింపుచునుండగా నంతలోన;

—: శ్రీకృష్ణునిపై మావటీఁడు మదగజమును బురికొల్పుట .—

వికసితపుష్కరవిభవంబుఁ జెంది
యకుటిలదీర్ఘశృంగారూఢి నొప్పి
మానుగావంశాధ్యమహిమఁ జెన్నొంది
దాననిర్ఝరలీలఁ దనుపారఁ బేర్చి
పొడవు తక్కవగాని భూధరేంద్రంబు
వడువునఁ జెలువారు వరశక్తిచేత
నష్టదిగ్గజముల నాపంగనోపు
నష్టమదాపూర్ణమై పేర్చుకరిణి 120
కువలయపీఠంబు కో[illegible]యాశాల
నవిరళంబుగ నిల్పి యం[illegible]కౌతుకమున

నెదురుచూచుచునుండె నెంతయు వేడ్క.
యదుకులోత్తంసులు హలియును హరియు
రమణీయజలజాకరమునఁ గ్రీడింప
గమనోగ్రగతివచ్చు గజయుగ్మమునగఁ
గరియూధముల మీఁద కలుషించివచ్చు
హరికిశోరద్వయమునఁ బెంపు మిగిలి
పౌరులుఁదముఁ జూచి బహుభంగిఁబొగడ
నారూఢరంగము నటు డాసి శౌరి
యరుదారఁ దెరువున కడ్డంబు వేర్చు
కరిఁజూచి మావంతుఁగనియు నిట్లనియె.
" ఈకరిఁ దొలగించి యిటఁద్రోవఁ జూపు
మాకంసుకడకు మాకరుగఁగావలయుఁ
బోవనీకుండినఁ బొరివుత్తు" ననిన;
మావంతుఁడంతనర్మరుషంబుతోడఁ
గరిపతి హరిమీఁదఁ గదియింప నదియుఁ
దిరిగి మహోదండతీవ్రతుండంబుఁ
బ్రసరింపుచును గృష్ణుఁబట్టుశక్తి నొడియ
నసమసత్వుఁడు కృష్ణుఁడటఁ దప్పఁగ్రుంకి 180

—: శ్రీకృష్ణుఁడు మదగజమును సంహరించుట .—

చరణమధ్యములకుఁ జనిబాహులెత్తి
యరుముష్టి బొడిచిన యురమూరదాఁకి
హుంకారరవమున నోడించి మొరగ
నంకుశంబున నూదిహస్తిపుండార్వఁ,
బుఁగొని కరటి యాపుండరీకాక్షుఁ

గరకాండమెత్తి యొక్కట మేనుఁజుట్టి
తివిచినఁ దనమేనుఁ దివియక శౌరి
యవిరల భోగి[illegible]గావృతుఁడగుచు ౧౦
దిరిగెడి మందరాద్రియుఁబోలెఁ దిరిగి
కరమొప్ప శక్తిఁబుష్కర మొప్పఁబట్టి
వెనకకుఁ ద్రోచిన వివశమై యొరగి
ఘనరౌద్రమున లేచి కరినదంతముల
హరిమేను బొడవంగ నతఁడు మైఁదప్పె.
కరముగ్రమగు ముష్టిఘాతలఁ జరుప
మావంతుఁడలిగి తోమరములు మూఁట
నావిశ్వవిభుమైవ నతఁడు కోపించి
కడఁగి హస్తిపకుని కడకాలుఁబట్టి
పుడమిపైఁబడ నీడ్చి శౌరిఁద్రొక్కిచంపె.
మావంతుఁడీల్గిన మత్తేభమదరి
గోవిందుపై నాఁకఁ గొనకఁబెల్లురకఁ 140
బడతాడనంబులఁ బరుషఘాతముల
బ్రిదులంబులును బోని పిడికిళ్ళఁ బొడువ
ముక్కునవాతను మొగికర్ణములను
నక్కజంబుగ నెత్తురందందనొలుక
పవిఁ వ్రేఁకి కూలిన పర్వతంబనఁగఁ
బవనుచేఁబడు మహావృక్షమో యనఁగ
గజము నిశ్చేష్టమై గజభములుడిగి
గజగతి వసఁకి యక్కజముగాఁద్రెళ్లె,
కడువడిమెడఁ ద్రొక్కి (గజదంతములను)
బెదిరంపు లావునఁ జెఱికి మురారి
దానవకుంభనిర్దళనంబు సేసి

మేను వ్రేయఁగ వేఁగి మిడమిడ మిడికి
గైరికనిర్ఝరకలితాద్రి వోలె
భూరిరక్తంబులఁ బొలిచె నగ్గజము.

—: శ్రీకృష్ణుఁడు కొల్వుకూటమును బ్రవేశించుట :—

ద్వి

కరిమదరక్తపంకకములచే మేనఁ
దొరగెడు ఘర్మబిందువులును నరయ
హరిమేను చిత్రవనాంబుద మనఁగ,
నరుదారఁ జూపట్టె నందందఁజూడ;
గజదంతములుఁదాను కామపాలుండు
భుజశిఖరంబులఁ బొలుపొందఁదాల్చి 150
దారుణతరదండధరయుగ్మ మనఁగ
గారత మల్లరంగము సొచ్చినిలువఁ
గోరిమల్లుల కెల్ల కులిశమై, ప్రజకు
ధారుణీ నాథుఁడై, తల్లిదండ్రులకుఁ
బసిబాలుఁడై యొప్ప, పంకజాక్షులకు
నసమాస్త్రుఁడై, వల్లవావళి కెల్లఁ
బరమాప్తుఁడై, యతిప్రతతికి నెల్లఁ
బరతత్వమూర్తియై, బంధుసంతతికి
దైవమై, రోహిణీతనయుఁడుఁదాను
నావిష్ణుఁడరుదెంచె నందఱుఁజూడ.
అతులితగంధపుష్పామోదితులును
సతతసౌఖ్యాఢ్యులఁ జారుభూషణుల
శ్రితకీర్తియుతుల, నాశ్రితకల్పతరులఁ
బ్రతిభటవనదావపావకసముల

ఘనదీర్ఘ బాహుల, కఠినవిక్రముల
వనజాతనేత్రుల, వసుదేవసుతుల,
నా రామకృష్ణుల, నతులవిక్రముల,
నారూఢ నవయావనాంగులఁ జూచి 160
ఘోరున జనులెల్లఁ బొగడఁగఁ గంసు
డారవ మాలించి యటఁ జూచునంత;
కువలయపీఠంబుఁ గూల్చి తన్నఖి
కువలయంబంతయుఁ గొనియాడ వచ్చు
హరి కామపాలుర నండండఁ గాంచి
తిరుగుడువడి గుండె దిగులొంది తాల్మి

—: కంసుడు చాణూరముష్టికులను శ్రీకృష్ణునిపైఁ బోరఁబంపుట :—

డింది చాణూరముష్టికులరప్పించి
దండడిఁ బెదవులు దడవుచుఁ బలికె,
" మనమంటపము సొచ్చి మనవిల్లు విఱిచి
మనపట్టపేనుఁగ మడియించి వీరు
మనమీఁద వచ్చిరి మహితవిక్రములు,
తనరార మల్లయుద్ధము నేర్పు మెఱసి
పోర మీరరువురుఁ బొలియించి వేగ
నా రాజ్యమును నన్ను నా బంధుజనుల
రక్షించి నాదుసామ్రాజ్యమెంతయును
నక్షయంబుగ నేలుమ''ని పల్కుటయును;
తివిరి యుక్కున ధాత తీర్చినయట్ల
ప్రవిమలంబగు మహాప్రతిమలో యనఁగ

నవయుతంబులుగల యద్రులో యనఁగ
[1]పవి వ్రేయ నాపెదు బలుదిట్టలనఁగ
ముష్టికచాణూరముఖ్యులు నృపతి
యిష్టంబుఁగని రంగమెల్లఁదారగుచుఁ
గినుకమై బలరామకృష్ణులఁ జేరఁ
జనిమహాధ్వని మల్లచఱచి యిట్లనిరి. 170

—: ముష్టికచాణూరులు బలరామకృష్ణుల నధిక్షేపించుట :—

" వసుదేవసుతులార ! వసుధలో మిమ్ము
లసమానసత్వాఢ్యులంద్రెల్ల వారు
పెక్కండ్రదనుజులవీచంబులణఁచి
యక్కజంబుగ మెఱసినయట్టి సాహసులు ;
భోజభూవిభుఁడు మీపేరు నీక్షించి
రాజిల్ల మమ్మిట రప్పించినాఁడు ;
మందగోపల గొల్లమగవాండ్లఁ దిరిగి
సందింపుచును నాడ సానురాగములఁ
బిల్లగ్రోలూఁదుచుఁ బెరయుటగాదు
మల్లయుద్ధములకు మమ్ము డగ్గరుట ;
యేను చాణూరుండ యితఁడు ముష్టికుఁడు
పూని నీవును నేను బోరుదమెలమి
ముష్టికుతోడ రాముఁడు మల్లయుద్ధ
మిష్టలీలల నొప్పడిదిసాటి" యనుఁడు.
అల్లన నవ్వుచు నంబుజోదరుఁడు

---

[1] పవి వ్రెయ్యగాపిన బలుచాగలనంగ

—: శ్రీకృష్ణుఁడు హేళనగాఁ జాణూరునకు బదులు చెప్పుట :—

" పల్లవులము చిన్న పాపలు మేము
తగిన జెట్టులను మీరు ధరణీశునొద్ద
జగతిపైఁ బోరుల నడిసిన్నవారు 180
మీతోడ రణవీధి మెఱసి సేయంగ
నాతరంబులవారమగుదుమే మేము!
చేసి భూపతి వేడ్కఁ జెడకుండ కొంత
పెనఁగెద"మని పల్కి ప్రీతి మైపెంచి

—: శ్రీకృష్ణుఁడు చాణూరునితో మల్లయుద్ధముఁ జేయుట :—

వడిమల్లచఱచి భూవలయంబు పగుల
బెడిదంబుగా నార్చి పిడికిళ్లు చాఁచి
(వానిమై)కదియు ముష్టాముష్టి గవియఁ
జాణూరుఁడును మల్లచఱచి యిట్లొరసి
యిరువురు భుజమప్పళించు చప్పుళ్లు
శరనిధి కలఁగ నాశాచక్రమగిలె
నంతకుఁ దెసఁజేరి యవనిపరాగ,
మింతింతఁగాన మేన నిరవారఁజల్లి
కొనిపదఘాతల కూర్మంబు వగులఁ
దనరు మహాభద్రదంతుల రీతిఁ
జేరికి నొడిసినఁ జేయూక లివిసి
ఘాతసేయంగ దగ్గతి మేనుదూలఁగి
పొడిచిన నది వెలివుచ్చిమైవంచి
యొడిసి తొడలఁదట్టి యార్చి పెల్లురికి

లాగంబుఁ గొంచను మేలనఁదలఁగ్రుంకి
బాగుఁదప్పకఁ దలప్రహతుల నొంచి 190
నడుముఁ బీడింప(విణ్ణానుదున)మలఁగి
విడిపించుకొని ముష్టి విసరమై పొడిచి
పట్టుచు విడుచుచుఁ బరుషఘాతముల
దట్టించి కూర్పరోద్ధతుల నొప్పించి
కరవశంబుఁగొనకాభీరుశోక
దరకాండములు లోనుగానీక తొలఁగి
శసకంబొనరింప శిరమూన్చి పెట్టు
గాసిల్లి కేలడొక్కరమున నొత్తి
రంకెలువైచు గోధాజుల భంగి
ఝుంకించి బింకంబు సరిగాఁగఁబెనఁగి
ముంగల బలసింగములభంగిఁబొంగి
నింగిమోవఁగనార్చి నిధుగుడిపై కుఱికి
మెడయుఁగాళ్లును బట్టి మీఁదికి నెత్తి
పుడమి మోవఁగ్రేయ భోరున నెగసి
ఘుడపకరాఁగేల నిరియ బిగించి
వడినుగ్రమగు ముష్టి వక్షంబుఁబొడువఁ
దడబడ ముష్టిఘాతల మోములవసి
దొడిదొడి పన్నెత్తురులు వఱ్ఱుగాఁగ
హరియు చాణూరుఁడు నటమల్లయుద్ధ
పరుషతఁదుల్యులై బవరంబు సేయ ; 200

—: బలరాముఁడు ముష్టికునితో మల్లయుద్ధముఁ జేయుట :—

సీరితోఁ దొడరి ముష్టికుఁడుగ్రవృత్తిఁ
బోరఁ జూపరకు సభ్యులు చూచి పొగడ ;

హరిరాములకు జయంబయ్యెడుననుచు
సురలు దీవించిరి, శోకించి పౌరు

—: శ్రీకృష్ణబలరాములఁగాంచి పౌరులు శోకించుట :—

"అక్కటా! ఈకంసుఁడతి పాపకర్ముఁ
డెక్కడి యీబాలురెక్కడి వీర
లెక్కడననిఁ జూడ కెట్లుగావించె
నక్కటా! వారింపరైరి యెవ్వరును.
ఈసుకుమారుల నిటు సేయఁదనకు
దోసంబుఁ దిట్టును దూరును గాదె!
పరుషత రిపులతో బవరంబు సేయ
హరిమేను ఘర్మకణాంచితంబగుచు
[1]వివళితాంభోజంబువిధమొందెఁజూడ
డీవాసుదేవులకీబారిగడవు
దైవమాయని" క్రొక్కి తరుణులు వగవ;
దేవకియును వసుదేవుఁడుఁ బ్రీతి
గోవిందబలులఁ గన్గొని వంతనొంది

—: శ్రీకృష్ణుఁడు చాణూరుని జంపుట :—

రప్పుడు దనుజారి యామహాజట్టిఁ
దప్పకఁ జూచి యుద్ధత శక్తి మెఱసి 210
పిడికిటఁ బొడిచినఁ బెంపేది వాఁడు
పడియొడ్డ నిల్చి యాపంకజోదరుని
వక్షంబు శిరమున వడిదాఁకుటయును ;

[1] ఈ పద్యపాద మొక్కటియే కన్పడుచున్నది.

ఈక్షించి హరివాని వెనుకకుఁ ద్రోచి
కుడిరెట్టవట్టి పెళుకుఅఁ ద్రిప్పి నేలఁ
బడవైచి తన్ని గొబ్బున మీఁదికుఱికి
మెడఁద్రొక్కి యినుమునవ్మెట మోదినట్లు
తడబడ ముష్టిఘాతల మేను నొంప;
వెగడొంది (ప)ట్టెమ్ము విఱిగి గుండియలు
పగిలి చాణూరుండు ప్రాణముల్ విడిచె.

—: బలరాముఁడు ముష్టికుని జంపుట :—

అప్పుడు ముష్టికుండమరులీక్షింపఁ
జెప్పబెట్టులుగాఁగ సీరితోడఁదొడరి
పులులచందమున సుబ్బుచుఁ బొంగిపొంగి
బలులులాయంబులపగిది దాఁటుచును
పాయుచు డాయుచు బాహార్గళముల
వేయుచు నొగిఁబెక్కు విధములఁ బోర;
ద్రిష్టించి చూపర దిగులొంద నిలిచి
ముష్టికుండడరి రాముని బెట్టుఁ బొడువ
ఫాలంబు వగిలి తప్పక నెత్తురొలుక
నేలపైఁబడిలేచి నీలాంబరుండు 220
పిడుగు వేసిన భంగిఁబిడికిటఁబొడువఁ
బడితన్నుకొని జెట్టిప్రాణముల్ విడిచె;
గతుఁడైన ముష్టికుఁగని వానితమ్ముఁ
డతిబలాఢ్యుఁడు కూటుఁడను వాఁడు సీరిఁ
జోకుఁబోకని దాఁకి పోరిముష్టిఁబొడువ
యాకూటుఁ డెకటార్చి యార్చె మిన్నద్రువఁ
గోసలప్రభృతులొక్కొట యేడుగురను

వాసుదేవుఁడు వారివధియించె నంతఁ
గనుఁగొని మల్లవర్గముషాథు వారుటయును
యనిమిషావలిఁ జూచి యచ్చెరువందె.

—: కంసుఁడు ముష్టికచాణూరులు మడియుటఁజూచితన
సేనాపతులతోఁ బలుకుట :—

భోజభూపతి వారు పొలియుటఁజూచి
రాజసంబెడలి బోరన నశ్రులొలుక
వడివాద్యముల మ్రోఁత వారించి తనదు
పడవాళ్ళఁబిలిచి నిర్భయవృత్తిఁబలికె.
" ఈ పాపకర్ముల నిరువుర నీళ్ల
ద్రోపించి, వసుదేవుఁడును మాడి, నంద
గోపునియిల్లు ముట్టుకొని చెఱఁబెట్టి
గోపాలకులఁబట్టికొని, యుగ్రసేను
దండించు"డని భోజధరణీశుఁడాడు
దండిమాటలకల్గి దానవాంతకుఁడు 230

-: శ్రీకృష్ణుఁడు కోపించి కంసునిపై లంఘించి యీడ్చి చంపుట :-

గిరిశృంగమునకు లంఘించు సింహంబు
కరణి దగ్గన దనుకలిమీఁది కెగయ,
కనిభోజపతి కేలఖడ్గమంకించి
కొని యాజికెదురఁగఁ గోకనవ్వ వెలయ
నురగంబు పక్షీంద్రుఁడొడియు చందమున
కరవాలుఁగేలునుగ్రతశక్తిఁబట్టి
కొసవెంట్రుకలు వట్టి గొరగొరనీడ్చి
వసుమతిఁబడఁద్రోచి వడి మీఁదికుతికి

పిడికిళ్ళనొప్పింపఁ ఖిరికిఁబ్రాణములు
యొడలికిఁబెడఁబాయ నొప్పార కంసు
ఘనకళేబరము రంగము వాయనీడ్చి
యనుపమధ్వనిఁ బేర్చి యార్చి మురారి
యతనితమ్ములు సునాభక్రోధనాథు
లతిసత్త్వులైనమంద్రమలపాణి చంపె;
నప్పుడు పౌరులయార్పులు నింగి
నుప్పొంగి బహుపాళకోత్తులఁ జెలంగె.

-: కంసుని మరణముఁగని దేవతలు హర్షించుట :-

భవకమలాసనప్రముఖదేవతలు
ప్రవిమలంబుగఁ బ్రణుతించిరెలమి
దివిబీఁటకొనిమ్రోసె దేవదుందుభులు
దివిజకామినులు నర్తించిరింపార ; 240
పొరిఁబొరి మందారపుష్పవర్షములు
సురకోటి దేవకీసుతుమీఁదఁ గురిసి
రంతట, కంసుండు హతుఁడౌట యెఱిఁగి
యంతఃపురాంగనలడలుదీపింప
నడుగులు తడబడ నాత్మలు కలఁగ
నుడివడి [illegible]గుంది స్రుక్కి బల్వడిని,
నురములశిరముల నొరిమ్రోదుకొనుచు
పరిపరివిధముల పలవించి మిగుల
నార్తనాదంబుల నంతంతఁ బొగిలి

— : కంసునిస్త్రీలు తమపతి మరణమునకు విలపించుట : —

భర్తపై వ్రాలుచు బహుభంగి నొగిలి
హా! యని యేడ్చుచు హా నాథ! యనుచు

పోయితే! మము బాసి భోజవంశాఢ్య!
కటకటా! శోకానలాగ్రాలంగ మమ్ము
నిటఁజూడవించుక యేలఁగైకొనవు?
ఇనుఁడు నీమీఁదట యెండరానోడు;
ననిలుండు నీమీఁద నటువీవ వెఱచు;
ననలుండు తీవ్రార్చులడరింపనోడు;
ననిమిషాదులు మీకు నడకుదురెపుడు;
నీయాజ్ఞ నీలావు నీరాజసంబు
నీయొప్పు నీనేర్పు నీమంచితనము 250
వ్రేయవారలచేత వేల్మిడినడఁగి
మాయమైపోయితే మనుజదేవేంద్ర!"
అని బహుభంగుల నార్తులైపొగుల
వనితలనూరార్చి వాసుదేవుండు

-: శ్రీకృష్ణుఁడు కారాగృహమునుండి దేవకీవసుదేవులను విడిపించుట:-

కారాగృహంబునఁ గనునొచ్చియున్న
వీరుని వసుదేవు, వెలఁది దేవకిని,
గనివారికాలి సంకెలయలూడ్పించి
వినయంబుతో మ్రొక్క వెఱఁగందివారు
గోవిందహలులఁ గన్గొని తమపాలి
దైవంబులని, యాత్మఁదలఁచిరిగాని
తనయభావంబుగాఁదలఁచకయున్నఁ
తనమాయ హరి మోహతమముఁగారించ
చన్నులఁ బాలును సమ్మదాశ్రువులు
కన్నులఁ దొరల నక్కాంతాలలామ

సుతులఁగౌఁగిటఁజేర్చి శోకంబుఁదక్కి
యతులితంబగుప్రేమ నందఁదఁజూడ
వసుదేవుఁడును బుత్రవరుల నీక్షించి
యసమానమగుప్రేమ నక్కునఁజేర్చి
పుణ్యాత్మ! మీయట్టి పుత్రులఁగాంచి
పుణ్యకీర్తులఁగంటి పుణ్యుఁడనైతి; 260
నింతగాలము మిమ్ము నీక్షింపలేక
సంతాపమందుచు శత్రులచేతఁ
బడని బాధలఁబడి పసువుచుండితిమి ;
కడపట! నినుఁజూడగంటిమి నేడు;
జన్మజన్మాంతర సంచితౌఘములు
చిన్మయ! నినుఁ దలఁచిన మాత్రమేఁగు.
మహనీయ! నీవు కుమారుఁడవైతి
విహపరంబుల మాకు నేమిటఁగొఱత?
అనియున్న గురుల సత్యాదరలీలఁ
గనుఁగొని శౌరి యుత్కటబాష్పుఁడగుచు

—: శ్రీకృష్ణుఁడు తల్లిదండ్రులఁ జూచి చింతించుట :—

"మానిమిత్తముల దుర్మనుజులచేతఁ
బూని బహుక్లేశములు మీకుఁగలిగె;
జనియించినపుడే యిచ్చటనున్న వెఱచి
యనఘ! నందుని యింటికనిచిన, వారు
బాల్యంబుమొదలుగా భక్తిఁబోషింపఁ
గొల్లవర్తనలమెలఁగి కొంచితిఁగాని
యప్పటప్పటికి మమ్మరసి మీరర్థిఁ
జెప్పిన పంసేయ సిద్ధించదయ్యె ;

తనయుఁడు జనియించి తల్లిదండ్రులకు
ననుపమంబగుభక్తి నరయకుండినను 270
దనయుండె? అతఁడు తల్లియవ్వనముఁ
గొనకొని తెగఁజూచు గొడ్డలిగాక !''

-:శ్రీకృష్ణుఁడు ఉగ్రసేనుని రాజ్యభారమును వహింపఁజెప్పుట:-

అనిభక్తిసూరార్చి యయ్యుగ్రసేనుఁ
గనుఁగొని కౌఁగిటఁగదియించి, శౌరి
"ఈరాజ్యమంతయు నిర్దయవృత్తిఁ
గ్రూరుఁడై తానక్కైకొని యంతఁబోక
యాకలఁబెట్టి మిమ్మలఁచినయతఁడు
కాకున్న పనియట్లగాక పోరాదు
హీనమానసులైన యాదురాత్ములకుఁ
గానఁజింతింపకఁ గంసాదిసుతుల
కగ్ని సంస్కారాదులర్థిఁ జేయింపు
ప్రాజ్ఞులవిప్రులఁ బనిచి వేవేగ
రాజ్యభారముఁ దాల్చిరమణ మాకెల్ల
పూజ్యుఁడవై లీల భూమిపాలింపు'',
మనుటయు హరిఁజూచి యయ్యుగ్రసేనుఁ
"డనఘ! నన్నిమ్మాటలాడంగఁదగునె ?
హీనుఁడనతివృద్ధ నీరాజ్యభరము
పూననాకర్హంబె? పుండరీకాక్ష !
వసుదేవుఁబట్టంబు వలనొప్పఁగట్టి
యసమానగతిని రాజ్యము నీవెతీర్పు; 280
కన్నులు చల్లఁగాఁగలకాలమెల్ల

నిన్నుఁ జూచుచుఁ బ్రీతి నగడద కృష్ణ!"
అనుచుఁ బల్కిన శౌరి యారాజుఁ జూచి
వినయంబు నీతియు వెలయ నిట్లనియె.
" యాదవులకు రాజ్యమర్హ కృత్యములు
గాదు యయాతి వాక్యముఁ ద్రోయరాదు;
కావున సామ్రాజ్య కమనీయలక్ష్మి
నీవె పాలించుమన్నించు, బాంధవుల
రప్పించి వారికి రాజ్యంబులిచ్చి
తప్పక మమ్మెల్ల దయ నేలుకొనుము.
నిఖలభూపతులును నింపు సేయంగ
సుఖలీలనుండు; కంసుని వంతమాను".
మనిపల్కి యాతని నవనీభరంబుఁ
గానకొనుమని నియకొలిపి మురారి

–: శ్రీకృష్ణుఁడు నందుని కడకు వచ్చుట :–

బలుఁడుఁదానును నందుపాలికే తెంచి
కలిసి యాతనిఁ జిక్క కౌఁగిటఁ జేర్చి
భోజాధిపతియింటఁ బొలుచు వస్తువులు
రాజ్యయోగ్యములైన రవణంబులిచ్చి
యతని మన్నించి నెయ్యము తియ్యదనము
నతిగారవంబున నమరనిట్లనియె. 290
" నీవు నీసతియును నెమ్మిఁ బోషించి
ప్రోవఁగఁ బ్రతికిన ప్రోడలమేము
తల్లియుఁదండ్రియు ధనములియ్యమును
నెల్లబంధువులును నిటమాకునీవ ;
మందలోపలికి నెమ్మది నేఁగి మీర

లందఱిసేమంబులడిగితిమనుఁడు;
యేనాఱుదినముల యీలోన నచటి
కే నేఁగుదెంచెద నీవంతమాను".
మనివారి నూరార్చి యనుప నందుండుఁ
జనియె గోపాలకసమితియుఁదాను.
అంతట నిశ్శంక నారాత్రి సౌఖ్య
సంతోషలీలలు సలిపిరింపొంద.
మఱునాఁడు శౌరి కుమారులఁజూచి

-: శ్రీకృష్ణుఁడు తనగురువగు గర్గునివద్ద విద్యలనభ్యసించుట :-

తెరగొప్ప సద్గురుద్విజుల రప్పించి
కాలోపనయనసంస్కారాదివిధులుఁ
గాలోచితక్రియగతులుఁ జెప్పింప
యదుకులాగతగురుఁడగు గర్గువలనఁ
జదువొప్ప వేదశాస్త్రములభ్యసించి
యెఱుక సాధంవుడంచను విప్రునింట
యఱువదినాల్గువిద్యలు నభ్యసించి 310

—: శ్రీకృష్ణుఁడు గర్గుని గురుదక్షిణఁ గోరుకొనుట :—

గురువులఁబూజించి కొలిచి మన్నించి
"గురులార! యేనిక గురుదక్షిణార్థ
మిరవార మదినున్నయీప్సితార్థములఁ
దరమిడికొనివత్తు దయ వేఁడు" మనిన
నతఁడు భార్యయుఁదాను నటవిచారించి
హితబలాఢ్యునిఁ గృష్ణు నెఱిఁగి యిట్లనియె.

—: ప్రభాసతీర్థమందు మునిఁగి చనిపోయిన కుమారుని తెచ్చిపెట్టుమని శ్రీకృష్ణుని గర్గ్యుఁడు కోరుట :—

"తనర ప్రభాసతీర్థములోనఁదొల్లి
మునిగిపోయినపుత్త్రు మొగిఁదెచ్చియిమ్ము
[1]డిదిదుష్కరపుకార్యమిటు సేయుఁ"డనిన
యగుఁగాకయని ప్రీతి నాలియునుదాను
నగణితాయుధపూర్ణమగురథంబెక్కి

—: శ్రీకృష్ణుని సముద్రుఁడు పూజించి వచ్చినపనిఁ దెలియఁ జెప్పుమనుట :—

చనుదేర; నెదురేఁగి జలరాశి మ్రొక్కి
యనుపమదివ్యరత్నాళిఁబూజించి
"తామరసాక్ష! మాధవ! లోకవంద్య!
ఏమి విచ్చేసితిరెఱిఁగింపు"మనుఁడు;
"తొడరి మాగురుపుత్త్రుని మ్రింగినాఁడ
వుడుకకఁ దెచ్చి మాకొప్పించు" మనిన;
"నాకేమిపని యిది? నాలోననుండి
భీకరాకారుండు పృథుకంపురూపుఁ 310
డగురాక్షసుఁడుమ్రింగె" ననిచెప్ప శౌరి
యగణితశక్తిని యంభోధినుఱికి
వేదచోరునిఁదొల్లి విదళించుభంగి
నాదుష్టదనుజుని యడగించి వాని
కడుపునున్న శంఖము పుచ్చుకొనుచు
తడయక వెడలి రథంబెక్కి కదలి

[1] "డిది మాతృభిన్నమిది దుష్కరపుకార్యమిటు శేయుండనిన" అని పాఠము, దీనిని రెండు పాదములుగా విభజింప వీలులేనందున పైవిధముగా సరిదిద్ది యొక పాదముమాత్రమివ్వబడినది.

—: శ్రీకృష్ణుఁడు యమలోకమునకు వెళ్ళి గురుపుత్రుని యసువులను దెచ్చుట :—

కాలుని పురము దగ్గర వచ్చి శౌరి
కాలమేఘధ్వనిగతి శంఖరవము
సేసిన, యముఁడుగాసిల్లి యేతెంచి
యా శౌరి బొడగాంచి యర్థిపూజించి
" ఏమి వేంచేసితిరిందిరాధీశ !
నామీఁద కృపఁజేసి నాకెఱింగింపు"
మనవుఁడు "గురుపుత్రు నక్కటా! ఏల
కొనివచ్చినాఁడవు! కోరి నాకొసఁగు"
మనవుఁడు సమవర్తి యా విప్రతనయుఁ
గొనివచ్చి వెసలోకగురునకు నిచ్చె.
ఏపార జమునింటి కేఁగిన సుతుని
కోపించి లావునఁగొనివచ్చి శౌరి
గురులముందటఁ బెట్ట గోవిందుఁజూచి
హరుషనిర్భరచిత్తుఁడై పలికెనతఁడు 820
" భూరిసత్త్వాఢ్యులు పుణ్యమానసులు
కారణపురుషులుగారె! ఎవ్వరికిఁ
జమునిల్లుఁజొచ్చినఁజత్తువుఁదెచ్చు
నమితసత్త్వాఢ్యులీయవనిలోఁగలరె!
నాకోర్కెఁ దీర్చితి నాపుత్రునిచ్చి
యాకల్పసుఖలీల యవుగాక మీకు"
అనియర్థి దీవించి యవ్విప్రవరుఁడు
తనర వీడ్కొల్ప నిద్దఱు రథంబెక్కి
యమరపట్టణతుల్యమైపోల్చు మధుర
కమరలోకార్చితులరుదెంచిరలమి.

తల్లిదండ్రులకును దగునుగ్రసేను
వల్లభునకు మ్రొక్కి వారిజోదరుఁడు
మతిసురాచార్యుఁడై మాన్యుఁడై పొల్పు
నతని నుద్ధవుఁడనుయాదవుఁ జూచి

—: శ్రీకృష్ణుఁడు ఉద్ధవుని మందకుఁబుచ్చుట :—

తనరార మన్నించి తగఁ గౌఁగిలించి
కొని బుజ్జగించి మ్రొక్కుచు సిరివలికె.
" ఏపార వ్రేపల్లెకేఁగి యానంద
గోపయశోదలఁ గొమరారఁ గాంచి
మక్కువ వారిసేమములెల్ల నడిగి
మ్రొక్కితినను, నేము మొగిఁదమ్ముఁ జూడ 330
వచ్చెదమను, వేగ వసుదేవు దొంటి
యిచ్చటిచుట్టాలు యేమును గలసి
యున్నారమను, మమ్ము నుగ్రసేనుండు
మన్నించునని చెప్పు, మందలోఁ గల్గు
గొపాలకుల నెల్లఁ గోరి వేర్వేర
నేపార నక్కున నిడినంటి ననుము;
ననుఁ బాసి మదనబాణములలోఁ దారి
ఘనమైన విరహాగ్నిఁ గ్రాఁగుచునున్న
వల్లవసతుల నెవ్వగ లెల్లఁ దీర్ప
నెట్టుటిలోననే నే తెంతు ననుము
పొమ్మన్న" నయ్యాదుపుంగవుఁ డెలమి
క్రమ్మర రథమెక్కి కదలి మాపటికిఁ
గర మొప్ప రవికన్యకాతీరభూమి
బొరి గిన్నరేశునిపురి గ్రేణిసేసి

సకలసంపదలకు సదనమై పొలుచు
నకలంకగతి మందగిరిగ నుద్ధవుఁడు
| ద్వి॥ తనరాక నెఱిఁగింపఁ దగ నందుఁడెదురు

—: నందుఁడు ఉద్ధవుని పూజించి శ్రీకృష్ణునివృత్తాంత మడుగుట :—

చనుదెంచి యతనికి సాష్టాంగమెఱఁగి
కొనిపోయి పెక్కుభంగులఁ బూజసేసి
యనుపమప్రీతిమై నప్పూజ్యధనుని 340
యలవడ మజ్జనయాహారవిధుల.
నలయికఁ దీర్చించి యతనికిట్లనియె.
“ దేవకియును వసుదేవుఁడు సుఖులె?
గోవిదగ్రామణి కొడుకులుఁదాను
సురచిరప్రీతిమై సుఖమున్నవాఁడె?
హరి మమ్ముఁదలఁచునే యప్పటప్పటికి?
సురలోకవైరిఁ గంసుని నేలఁగూల్చి
ధరణిరాజ్యము వానితండ్రికి నొసఁగి
యన్నయుఁదమ్ముఁడు నతులితప్రేమ
నున్నారె సౌఖ్యులె, యుద్ధవాచార్య?
బలురక్కసులబారిఁబడి చావనీక
చెలఁగు మహాదావశిఖిఁ గ్రాఁగనీక
యహివిషానలవహ్ని నడఁగంగనీక
మహనీయమగువాన మడియంగనీక
యప్పటప్పటికి మమ్మరసి గండములు
దప్పించి రక్షించె దానవారాతి.

కడుపటఁ దనుఁజూడఁ గానక యేముఁ
బొడవడఁ బొక్కుకఁబోలు రాఁడాయె;
నతనివిక్రమలీల లాత్మలయందు
సతతంబు దలఁచి నిశ్చలవృత్తులగుచు 350
వ్రేపల్లె విహరించు వెలఁదులుపతులు
నాపూర్ణధన్యులు యగుదు రేశ్రాద్ధ
మాయింటఁబెరిగిన మందెమేలమున
నాయన్నదమ్ముల నాత్మజులనుచుఁ
దలఁతుము దేవతాతనువులు గాక
యిలనిట్టి విక్రమంబెవరికి గలదు!"

–: ఉద్ధవుఁడు శ్రీకృష్ణుని గుఱించి యశోదానందులకుఁ జెప్పుట :–

అనిపల్కు నందుండు నయ్యశోదయును
మనమున హర్షించి మ్రాన్పడి మేను
గరుపార హర్షాశ్రుకణములు దొరుగఁ
బొరిఁబొరిఁ జిత్రరూపులుభంగి నున్న
యాదంపతులఁ జూచి యనియె నుద్ధవుఁడు.
" వేదాంతవిదుఁడైన విష్ణునియందుఁ
బూని మీచిత్తాబ్జములుఁ బెట్టినారు
కాన యెందును బుణ్యాకర్ములు మీరు.
కృష్ణ! జనార్దన! కేశవ! శౌరి!
విష్ణు! నారాయణ! వేదాంతవేద్య!
అని తలంచిన వారికఘములు వొలియుఁ
బెనుపార వారలఁ బెంచి పోషింప
మీభాగ్యమహిమకు మితి వేరె కలదె!

శోధనాద్యులమిమ్ముఁ జూడంగఁగలిగె; 360
సాదికిని మీామీాఁది యక్కిలి ఘనము
సారిది మిమ్మందఱఁ జూడంగ వచ్చు
జననంబు మరణంబు శత్రులు హితులు
తనువులింద్రియములు తల్లిదండ్రులును
నతనికెవ్వరు లేరు యతఁడె యంబుజాక్షిఁ
బతి, జగత్పతి, రామపతి, సర్వసముఁడు,
నిర్గుణుండయ్యును నిఖిలంబుఁద్రావ
స్వర్గాదులకు వచ్చు సర్వాత్ముఁడతఁడు;
అతఁడు సర్వాత్ములయందె కావుండు
నతనివ్యతిరిక్తమది లేదు దలఁప".
అనియిట్లు బోధించి నవ్విభావరియుఁ
జనియె నంతట గోపసతులొప్ప పెరుగు

-: ఉద్ధవుఁడు వ్రేతలఁ గన్గొనుట :-

ద్రచ్చుచు ఘుమఘుమధ్వానులతోఁగృష్ణు
సచ్చరిత్రముఁ బాడు సామగానములు
ఘోషింప నంతనర్కుఁడుదోఁప వినయ
భాషణుఁడగు నేదుప్రవరుఁడు వెడలి
యరదంబు వెసనెక్కి యమునకు నరిగి
తరమిడి కాలోచిత బులుఁ దీర్చి
చనుదెంచి వల్లవసతుల నీక్షించి
యనునయోక్తుల వారినందఱఁ బిలిచి 370
తప్పక కృష్ణుఁడు తమతోడ మున్ను
చెప్పినమాటలు నేర్పుగాఁ జెప్ప

విని గోపరమణులు వెఱఁగంది యుతనిఁ
గనుఁగొని పలికిరుత్థిత బాష్పులగుచు.

—. విరహార్తులగు గోపభామినులు ఉద్ధవునిఁజూచి పలుకుట :—

" హరి నిన్నుఁబుత్తేర నరుదెంచి యుత
వరయశోదకును నవ్వార్తలుఁజెప్పి
యూరకె పోవేల? ఒగిమమ్ముఁ జూచి
చేరి స్వామిహితంబుఁ జెప్పదుగాక !
ఇట నింక నెనరువారెవ్వరు గలరు?
కటకటా! మ మ్మేల కమలాక్షుఁడడుగు?
అడిగెడివాఁడైన నరుదేఁడె యిట్లు
విడుచునే మమ్ము నీవిరహాగ్నినడుమ?"
అని పల్కి కృష్ణుని యంగంబుశోభగుఁ
దనుకారులీలలు, తనువుచిత్తమునఁ
గ్రొత్తైన విరహాగ్ని గురుసులు వార
నత్తలోదరులు సిగ్గరి యాడిపాడి
యొకయింతి కుసుమగుచ్ఛోద్ధూతమధువుఁ
బ్రకటితంబుగఁగ్రోలి పాడుచున్న
మధుపంబుఁ జూపి నెమ్మది మాటువెట్టి
మధురగర్వోక్తి నున్మాదియై పలికె. 380

—: గోపికల విరహము :—

" చంచరీకమ! నీవు చంచలాత్ముఁడవు
వంచకుండవు పుష్పవతులఁ గీలింతు
నిలిచినకాలున నిలువవేప్రొద్దు

మలినాంగుఁడవు దానమహిమ కాసింతు
వెచ్చోటికై నను నేఁగుదుగాని
మచ్చిక కల్గునా! మరియొల్ల; నీవు
పక్షపాతివి నీవు బహుచుంబకుఁడవు
వీక్షింప నివి నైజవిద్యలు నీకు!
ఏలయ్య! మధుకర! ఈపుష్పరసముఁ
గ్రోలెదు వేడుకఁ గులకాంత మీఁద
నెయ్యంబు వదలెదు నినుఁబాసియుంత
దయ్యదే నొవ్వదే దర్పకుఁజేత!"
అని పెక్కుభంగుల నన్యాపదేశ
మునఁ బల్కుచున్న యప్పొలఁతులఁ జూచి
యల్లన నుద్ధవుండాకృష్ణు మాట
లెల్లను బల్కుట యెఱిఁగి యిట్లనియె.

—: ఉద్ధవుఁడు గోపికల నూరార్చుట :—

"దానతపోధ్యానధర్మవర్తనల
కైనను గలుగదీహరిభక్తి పెంపు
తనయులఁబతులను దల్లిదండ్రులను
యనుగులఁజుట్టాలనందఱి విడిచి 390
హరియందు మర్మలు నై తిరిగాన
నిరవార మీభాగ్య మేమని చెప్ప!
హరి వేడ్క మీతోడ ననుమన్న పలుకు
వెరవేది చెప్పెద వినుఁడు యింతటను
సర్వేంద్రియంబులు సమతఁ బోషించు
నిర్వికల్పజ్ఞానః ధియైన నన్ను

విరహాగ్ని నెపమున వెలుపల మఱచి
పరమయోగధ్యానపరులచందమున
పరమానురక్తి హృత్పద్మంబులందు
చిరలీల నిలిచి భజింపుటఁ జేసి
మీతలంపులయందు మెలఁగుదుఁగాని
మీతో వియోగమేమియు లేదు మాకు
నిచ్చట పనిఁజూడ నెఱిఁగి మీకడకు
వచ్చెదనని యె నవ్వాసుదేవతనయుఁ"
డని చెప్ప, నుద్ధవాచార్యునిఁ జూచి
మనసిజోన్మాదులై మగువలిట్లనిరి.

—: గోపికలు శ్రీకృష్ణుని రూపును జేష్టలును వర్ణించుట :—

"నల్లని మేనున్నతమైన యురముఁ
దెల్లదమ్ముల మించు తెలిగన్నుగవయు
నెఱిజడ చొాళ్లెము నిటలరేఖయును
జిఱునవ్వుమోమును జేత వేణువును 400
నాయతబాహులు నధరంపుకెంపు
పాయక జగిమించు పసిఁడిచేలయును
[1]తలఁబురి పెనపు కదంబమంజరియు
ధళధళ వెలుఁగెడు దంతదీధితియుఁ
గలరూపు మోమున గట్టినట్లుండ
తలఁచకుండిన నుండు తలఁచిన నుండు
[2]కలలందు మాతోడఁ గవయుచు నుండు
నెన్నడు వచ్చునో యిందిరావిభుఁడు

[1] తలబిరి పెనపు. [2] ఈ పద్యపాద మొక్కటే కన్పడుచున్నది.

కన్నులాకలి దీర్పఁగలుగునో!" అనుచుఁ
దరుణులు ప్రేమనుద్ధవుఁ జూచి "మమ్ము
నెరవుగాఁ జూడక నిందు రమ్మనుచు
నిక్కడఁ గృష్ణుఁడు, ఇందఱుఁ జూడ
గోక్కరరక్కసుఁ గూల్చిన చోటు;
గిరికొని యున్నది కేళిమైఁ జూడ
హరిచేత [1]గతజన్ముఁడఘదైత్యు డొక్క;
యావులఁ గృపను మమ్మందఱిఁ గాచి
గోవిందుఁ డెత్తిన గోవర్ధనాద్రి;
సఖులుఁ దానును శౌరి చల్దులు గుడిచి
సుఖలీల నుండిరి సురపొన్న నీడ; 410
నీసైకతస్థలి నిందిరావిభుఁడు
రాసకేళిఁ జరించు రమణులుఁ దాను;
జల్లని యీరూపచాయ మురారి
పిల్లగ్రోలూదు గోపికలాత్మ మెచ్చ;
నాపొన్నక్రిందఁబో హరి వేడ్కలెల్ల
గోపికలలుక గ్రక్కున మ్రెక్కి తీర్చ;
బలభద్రుఁడును దాను బసుల మేపుచును
యలమి చిమ్మనబంతు లిచ్చట నాడు;
పొలుచు నీగురివింద పొదరిండ్లలోన
జలజలోచనఁ గ్రీడ సలిపి మాధవుఁడు
అమ్మాని పీడ నాకిటిఁ గౌఁగిలించి
తమ్ముఁ బ్రసాదించె తామరసాక్షుఁ"
డని పెక్కుభంగుల హరి విచారములు

---

[1] గతజన్మయఘదైత్యు డొక్క.

## —: ఉద్ధవుఁడు గోపికల మాటలను విని వారి పుణ్యమునకై మెచ్చుకొనుట :—

తనరారఁ జెప్ప నుద్ధవుఁడు చిత్తమున;
"వీరు దన్యాత్ములు వీరు పావనులు
వీరికి శౌరికి వేరు లేదెందు
వీరలఁ గనుఁగొంట విష్ణునిఁగంట
వీరికై హరివచ్చి వ్రేపల్లెఁ బెరిగె
నిన్ని చందంబుల నిమ్మందవారి
మన్నించి కృష్ణుఁడు మమత వాటించి 420
నామీఁదఁ గృపఁగల్గి నన్ను మన్నించి
యీమహాకార్యార్థ మిటు వచ్చె శౌరి
యిది జన్మఫలసార మిదిదోషమార
మిదిగదా సౌభాగ్య మిదిగదా యోగ్య"
మని సంతసిల్లుచు, నతివలుఁదాను
జనుదెంచి ప్రేమ మజ్జనభోజనములు
సలిపి, గోపికలు నిచ్చలు మానసములఁ
గలిసి చెప్పఁగ విష్ణుకథలెల్ల వినుచు;
నందయశోదలున్నతిఁ గారవింప
మంతవారెల్ల సమ్మతి విందులిడఁగ
నొకకొన్ని నెలలుండి యుద్ధవుఁడంత;

## —: ఉద్ధవుఁడు మధురానగరికి మరలుట :—

యకలంకగతి వారలనుపంగఁ గదలి
మధురకుఁ జనుదెంచి మాధవుగాంచి

మధురోక్తి నచ్చటి మాటలు చెప్ప ;
నంతంత నడుగుచు నప్పటప్పటికి
మంతలోఁగలుగు సేమము లెల్ల వినుచు
ననుపమయోగవిద్యాలీల శౌరి
తనుఁ బొందఁగోరిన తరుణి నెంతయును

—: శ్రీకృష్ణుడు కుబ్జయభీష్టమును నెరవేర్చుట :—

కరిగామియగు గంధకారకి యింటి
కరుదేర నది శౌరియడుగుల కెఱఁగి 430
మజ్జనభోజన మహితసౌఖ్యముల
నజ్జగన్నాథున కతిభక్తిఁ దనుపఁ
బువ్వులసజ్జపై పుండరీకాక్షుఁ
డవ్వేళఁ గృప నంగజాహవకేళి
దాని యభీష్టంబు దయనిచ్చి శౌరి

—: శ్రీకృష్ణుఁడు అక్రూరుని మందిరమునకుఁ జనుట :—

మానుగా నక్రూరుమందిరంబునకుఁ
జనుదేర నెదురుగాఁ జనియు నొండూరుకు
వినతుఁడై చనుదెంచి వేతెఱంగులను
గంధమాల్యాంబరఘనభూషణముల

—: అక్రూరుఁడు శ్రీకృష్ణుని స్తుతియించుట :—

బంధురార్చనలిచ్చి ప్రణుతుఁడై నిలిచి
" మాన్యుఁడనైతిని మత్కులంబెల్ల

ధన్యమై వెలుఁగొందె తామరసాక్ష!
కులముద్ధరించితి కులశైలధైర్య!
నీవె భూతంబుల నెరయఁబుట్టించి
ప్రోవనడపఁగనోపు పురుషుండ వీవ
[1]సకలంబుఁ గనుఁగొను సాక్షివి నీవ
వసుదేవునకును దేవకికుదృవించి
వసుధభారము మాన్చి వైరుల నడఁచి 440
యక్షయ! నీచేత నసురసైన్యంబు
లక్షౌహిణిశతంబణఁగిపోగలదు;
దేహబంధంబులుఁ దెలియంగ లేక
మోహాంధుఁడైన నామోహపాశములుఁ
దెగఁగోసి నాకోర్కె తెలుపానతిమ్ము
సగుణనిర్గుణరూప! సత్యసల్లాప!"
అని వేడుకొనియెడు నక్రూరుఁ జూచి

—: శ్రీకృష్ణుఁడు అక్రూరుని పాండవులసేమము నరయుటకై హాస్తినాపురికిఁ బుత్తెంచుట :—

"అనఘ! పితృవ్యుండ వాత్మబంధుఁడవు
సరసవాక్ప్రౌఢిని సౌమ్యచిత్తుఁడవు
పరమాప్తుఁడవు మాకు బంధులలోన
నీయట్టి చెలికాఁడు నీయట్టి సుకృతి
నీయట్టి సుజ్ఞాననిధి యెందుగలఁడు?
మాతండ్రియట్లట్ల మమ్ము శిక్షించి

[1] పద్యపాద మొక్కటి కన్పడుచున్నది.

యీ తెఱంగని చెప్పు దేకార్యమైన ;"
ననిపల్కి కమలాక్షుఁడక్రూరుఁ జూచి
తనరార బాంధవత్వముఁదోఁపఁ బలికె.
" ఆనకదుందుభియనుజ ! ధర్మాత్మ !
మేనత్త గాకు నర్మిలి తల్లికంటె
పెనిమిటి గడచన్న బిడ్డలుఁదాను
మనపట్టు లేక యున్నలికతోఁగొంతి 450
క్రూరాత్ముఁడగు బావ కుదురుసేయున్న
యారాజ పుత్రులు యసమసాహసులు
తెమ్మని పాలుఁ దత్తనయులకిచ్చి
నెమ్మదినుండగ నేరఁడా నృపతి
వారికి వీరికి వసుధకై పోర
నీరసంబున మీఁద నెట్లుగాఁగలదొ ?
కరిపురికేఁగి యక్కడ పాండుసుతుల
నరసి యిచ్చటి నేమమంతయుఁ జెప్పి
[1]గర్వితుఁడగు కంసుఁ గడపి తజ్జనకు
నుర్వి యేలింపుచున్నారమనుము
ధృతరాష్ట్రచందంబుఁ దెలిసి
మతులెల్లఁ దెలిసి క్రమ్మర వేగరమ్ము
సొమ్ములందఱకుఁ గట్నములు భూషణములు
నిమ్మంచు" దెప్పించి యిచ్చి యాలోన
నుద్ధవుండును దాను నోగియింటి కరిగి
బద్ధానురాగుఁడై పద్మాక్షుఁడుండె.

[1] దర్పితుండగు కంసక్రుంచి తజ్జనకు.

—: అక్రూరుఁడు హస్తినాపురిఁ బ్రవేశించుట :—

అరుదార నక్రూరుఁడట రేపఁగదలి
యరదంబు వెస నెక్కి హస్తినాపురికి
నరిగి యాధృతరాష్ట్రు నలమొగసాల
నరదంబు డిగిపోవ నటయింద్రులీల 460
కొలువిచ్చి యున్న యాకురురాజుఁ గాంచి
యలసతఁజని యల్ల నడుగులకెఱఁగ
గద్దియపై నుండి కౌఁగిటఁజేర్చి ;
గద్దియఁ దనగద్దెఁ గదియఁబెట్టించి
యర్ఘ్య పూజలఁదన్ప నక్రూరుడంత
హరియిచ్చు కట్నంబు లారాజుకిచ్చి
సేమఁబులడిగి తత్సేమంబుఁజెప్పి
ప్రేమ కాలోచిత ప్రియములుఁ బలుక
విడియంగఁ బంపించి విదురుని యింట

—: అక్రూరుఁడు విదురునియింట విడియుట :—

విడియు మట్లని చెప్పి వీడుకొల్పుటయు ;
నతని మందిరమున కరుగంగ విదురుఁ
డతులితగంధపుష్పార్చన లిచ్చి
పొలుపార మజ్జనభోజనవిధులు
సలిపి యిద్దఱు మృదుశయ్యల నుండి
హరి జనించిన మొదలే, వచ్చి మధుర
దారసి యేలుచునుండఁ దుదిదైనలీల
లక్రూరుచే విని హర్షాశ్రులొలుకఁ
జక్రాయుధునిఁ దల్చి సాష్టాంగ మెఱఁగి

పులకలుప్పొంగఁగ్రమ్మఁ బుండరీకాక్ష !
జలజాయ ! గోవింద ! శౌరి ! శ్రీకృష్ణ ! 470
అని భక్తిఁగీర్తించి యతనిఁ దోడ్కొనుచుఁ
జనుదెంచి పాండుని సతి యింటికడకు

—: అక్రూరుఁడు కుంతీదేవినిగాంచి కుశలప్రశ్నఁ గావించుట :—

నరుదేరఁ గొంతియు నక్రూరుఁ జూచి
కరచకితాస్యయై కన్నీరు దొరుగ
నెలుఁగెత్తి యేడ్చుచు నెడపైన వగలఁ
బలుమారు పలవింపఁ బడఁతి నూరార్చి
ధర్మనందనవృకోదరపార్థకవల
నర్మిలి కౌఁగిట నంతంతఁజేర్చి
యందఱ మణిభూషణాళిఁ బూజించి
కాంచనీనూనుఁడా కమలాక్షి కనియె.
"అమ్మ మీ మేనల్లుఁడమరేంద్రవంద్యుఁ
డమ్ముకుందుఁడు మిమ్ము నరయఁ బుత్తెంచె.
పాండుమహీపతి పరలోకమరుగ
నిండిన వగలతో నీవుఁ బుత్రులను
యిచ్చటి కరుదెంచి రెట్టిఁగి రమ్మనిన
వచ్చితి, నచ్చట వసుదేవుఁడొంటి
మనవారలెల్ల నెమ్మది నున్నవారు
ఘనపాపకర్ముని గంసునిఁ ద్రుంచి
ధరణిరాజ్యము వాని తండ్రికి నిచ్చి
వారియెల్ల శత్రుల నణఁచుచున్నాఁడు ; 480
తగిన మీకిట్టిదుర్దశ వొందుటెట్టిఁగి

వగచుచునుండు నావసుదేవసుతుఁడు;
తనపుత్రులట్ల తాఁదలఁచి నీసుతుల
యనుఁగొప్ప బ్రోచునా యాంబికేయుండు ?
దుర్యోధనాదిపుత్రులు వీరితోడఁ
గ్రార్యంబు లెడబాసి కలసియుండుదురె !
పండిత సామంత బంధులు మిమ్ముఁ
బాండుఁ గొల్చినయట్ల భజియింతురమ్మ !"

—: అక్రూరునితోఁ గుంతి తనకష్టములను జెప్పుట :—

అనిపల్కుటయుఁ గొంతి యక్రూరుఁ జూచి
యనుకంపతోడ నిట్లని యల్లఁ బలికె
"ఆరాజు సముఁడౌను యతని నందనులు
క్రూరులు ప్రజ వీరిఁ గొలువంగ నీరు.
అదిగాక బిడ్డల నందఱఁ ద్రోచి
మదిఁ బూని బంధించి మడుగులోపలను
గరళంబు పెట్టించి ఘనసర్పవితతి
పరువడి గరపింపఁ బ్రాణగండములుఁ
దలఁచిన వీరును తప్పఁగాఁ గొనరు
వలదని సుతులను వారింపఁ డతఁడు
దైవంబుకతన నింతలు బారులడఁగె
గోవిందుతోడ మాకుశలంబుఁ జెప్పు 490
పుట్టిన యిల్లునుఁ బోరిఁ జొచ్చినిల్లు
నిట్టిదె మాభాగ్య మేమంచు వగవ
దేవకి కడుపున దేవేంద్రవంద్యుఁ
డావిష్ణుఁ డుదయించునని పెద్దలాడఁ

బలుకులు విందు "భాగ్యంబు కతనఁ
దలఁచిన తేఁ(వులు (దలకూర్చె దైవ
మ''ని చెప్పుటయు విని యక్రూరుఁడంత
వినయంబుచేఁగొని విదురుఁడుఁ దాను

—: అక్రూరుఁడు కుంభజాదులయిండ్లకుఁ జనుట :—

దుర్యోధనాదిపుత్రుల గుంభజాది
యార్యుల కర్ణాదులగు యోధవరుల
నాపగా[1]జాయాదులగు బంధుజనుల
నేపారఁగని వారియిండ్లకు నరిగి
కుతుకంబుతో నందు కొన్నాళ్లు నిలిచి
దృతరాష్ట్రుకడ కేఁగి తెంపును దగవు
[2]హితవును ధర్మంబు నేర్పడఁ బలికె

—: అక్రూరుఁడు ధృతరాష్ట్రునికి హితోక్తులనుడువుట :—

" ధరణీశ ! నీవును ధర్మచిత్తుఁడవు
భరతవంశాఢ్య ! నీ ప్రతియవ్వరెందు !
పాండుభూపతి నీకుఁ బరమభక్తుండు
దండివీరుఁడు నిన్ను ధరణి యేలించె 500
నాతని పుత్రులకతిబలాఢ్యులకుఁ
బైతృకంబగు రాజ్యభారంబుఁ బంచి
యిచ్చిన నీకుఁ బెంపెక్కు లోకములఁ
[3]బొచ్చెంబుఁగల్గఁ బోవుదువద్భోగతికి

[1] తనయాదులగు. [2] ఈపద్యమునకుపాద మొక్కటే కన్పట్టుచున్నది. [3] బొంచంబు గలిగిన భోగభోగతికి.

నీపుత్రమిత్రులు నీశరీరంబు
నీపురి యీరాజ్య మింతయు మిథ్య
మేలుఁగీక ను గడ మిమ్మొందుఁ గాని
కాలంబు చేతఁ గ్రాఁగని వారు లేరు
హరి పాండుపుత్రులకాత్మబాంధవుఁడు
హరిసంతసించుట యది లెస్స మనకు
చిత్తమే భంగిరో చెప్పి"నంత
నుత్తరంబీఁజూచి యొయ్యనఁ బలికె
"నీవాడినన్నియు నిజమంటి, తెలుఁగుఁ
గావింతు నట్టిదైవగతి యెట్టిదగునొ!
[1]అమృతతుల్యములు నీవాడు వాక్యములు
కమలనాభునకు నీక్రమ మెఱిఁగింపు"
మనిపల్కి, హరికుపాయనమిచ్చి యతనిఁ
దనరారఁ బూజించి దయపీడుకొల్ప
నరిగిపాండవులతో నంతయుఁజెప్పి
యరయ సౌఖ్యమునొంది యక్రూరుఁడంత. 510

.. కంసుని భార్యలు మగధేనునివద్ద మొఱయిడుట :—

అస్తియు............ నను కంసుభార్య
లస్తికుండను మగధాధీశు సుతలు
హరిచేతఁ దమభర్త యడఁగిన దుఃఖ
పరవశలై తండ్రిపాలికేతెంచి
యడుగులపైఁబడి యడలూనఁ జెప్పఁ

[1] యుమిత.

గడురోషభీషణాగ్రహావృత్తిఁ బలికె
“ఏనేమిరా! కృష్ణుఁడే యింత సేసె!
భూమినయాదవంబుగ సేయవలయు”

—: మగధేశుఁడు యాదవులపై దండెత్తుట :—

నని పల్కి, యందంద ననిభేరి వ్రేయ
ఘనభాంకృతుల నబ్ధిగలఁగ సైనికుల
నీక్షించి మొనలేర్చి యిరువదినాల్గు
యక్షోహిణులఁగూడి యటవచ్చి మధుర
వెడలి మైముచ్చుట విడిసిన ప్రజను
వాడకుండ శ్రీకృష్ణుఁడుగ్రసేనాదు
లగువారుఁ దానుఁ గార్యాలోచనంబుఁ
దగఁ జేయ వేగ నందఱుఁ జూచుచుండ

—: యాదవమాగధుల యుద్ధము :—

దివ్యరథంబులు దివ్యాయుధములు
నవ్యోమగతివచ్చి హరిమ్రోల నిలిచె
నప్పుడు కమలాక్షుఁడన్న నీక్షించి
తెప్పకచూడు యాదవకోటినెల్ల
మడియఁ గాలంబన మనమీఁద నాజి
నడచి వచ్చిరి వీరి నడఁపక నుండ
నొండుపాయంబున నుడుగునే వీఁడు!
దండిమీరిన యాయుధంబులఁ బూను”
మనవుఁడు ముసలము హలమునుఁ బుచ్చు

కొని దివ్యరథముపైఁ గొమరారె సీరి,
హరి శంఖచక్రగదాదిశార్ఙ్గముల
ధరియించి కరమొప్పఁ దనరథం బెక్కె
మేరుశిఖరముల మెఱుఁగులతోడ
సారమై బహువిధచ్ఛాయలఁ గలిగి
[1]ధారాధరము బంగిఁ దనరారెఁ జూడ;
నాలోన వృష్టిభోజాంధకాధిపులు
నేలఁబట్టవియించి నిష్ఠురోక్తులను
గరిఘటాబృంహితఘననేమిరావ
తురగఘోషితరావతూర్యముల్ మ్రోయఁ
బురికొని వెడలి యార్పులు నింగి ముట్టఁ
బరవసంబునఁ దాఁకెఁ బరగ సైన్యములు ;
నేలయీనిన భంగి నిగిడి "యే మేము
చాలుదుమనివచ్చు" సైనికోత్తముల 530
యురుపాదహతులను నోర్వక దివికి
నరిగెనో యన ధూళి యర్కునిఁ గప్పె ;
నప్పుడు గోవిందుఁడఖిలసైనికులు
నుప్పొంగ నిజశంఖ మొత్తె, నొత్తుటయుఁ
బెదరె దిగ్గజములు, భీతిల్లెదిశలు,
కదలె కులాద్రులు, కలఁగె వారిధులు
వంగె మేరువు ధరావలయంబు దిరిగె,
క్రుంగెఁ గచ్ఛపరాజు, ఘూర్ణిల్లె నభము,
కెరలి సేనలు పెల్లగిలి పారఁజూచె
శరపరంపరలు భీషణముగా నిగిడి

---

[1]ఒకపాఠము కన్పడుచున్నది.

కరములు దునిసి యంగంబులు నాటి
శిరములు వెసఁ ద్రుంచి శిడములు నఱికి
బరులు వ్రక్కలు వాపి పదములు విఱిచి
కత్తళంబులు చించి కంఠంబు లెడపి
నెత్తురు వెడలించి నెనళ్లు గలఁచి
కండలుఁ దెగఁజెండి గాత్రంబు లడఁచి
గుండెలుఁ గూల్చి ప్రేగులు వెల్వరించి
బొమ్మిడకల్ రాల్చి బొడగలుఁగూల్చి
యెమ్ములు నలినేసి యెఱచులు చదిపి 540
పోరి వీరి వారినిఁ బోలింపరాక
బెరసె పీనుగులై పృథివియంతయును ;
హాలికుండు నఱికిన యడవిచందమునఁ
గలసి కాల్వురు చాపకట్టుగాఁ బడిరి
ముంచఱ బయలైన మొనసి రావుతులు
యుందఱు నొక్క సాహసకేళి సలిపి
తురగంబు రవుతును దునుకలై పడఁగఁ
దరవలికత్తి నుద్ధతి మొత్తువారు
లవుణిప్రవేశిన మేను లవుణియై తిరిగి
తివిరి ఖడ్గంబులఁ దెగవ్రేయు వారు
యంతళంబుల మేను లందంద పొదువ
నెత్తురు వఱ్ఱలై నేటఁ గూలువారు
మునిగాళ్లు తెగి వాహములు ప్రమొగ్గ సరకు
గొనక మార్తురమ్మని కొనునాశ్వికులును
యమ్ములు తగనాట యావల వెడలి
బొమ్మలక్రియఁ గూలి పొలయు గుఱ్ఱములు

తుండంబు గొమ్మును దునియ రోఁజుచును
గొండలవలె వ్రాలు కుంజరంబులును
నొగలూడి యిరుసులు నులిసి చక్రములు
పగిలి రథంబులు ప్రాణంబులెడలి 550
రక్షకులు మడిసి సారథు లుర్విఁగూలి
రథములు వికలమై రణభూమి నిండె.
కీలాలనదులలోఁ గీలాలకేళి
నోలలాడుచునుండు నోలిభూతములుఁ
గంకగృధ్రాదుల కలకలంబులును
బింకంబుతోనాడు భేతాళములును
గొడుగులచిప్పలు గుబురులై పడిన
పడగలు తుమురైన బహుశస్త్రములును
నాడెడు నట్టలు హతవీరవరుల
నాడకుఁగొనిపోవు నమరకామినులు
నీభంగి రణభూమి యొసఁగి చూడ్కులకు
బీభత్సరసములు బెరసి యాలోన
సరభసంబున జరాసంధుఁడు తరుమ
భరమంది యాదవబలమోహటించి
[1]విరిసినసేనఁ గవిసి యార్చుచును

—: శ్రీకృష్ణబలరాముల యుద్ధవర్ణన :—

తరమి యుద్ధతలీలఁ దాలాంకుడంత
నరదంబు వరపించి యట్టహాసమున
శరలాఘవమున భీషణవృత్తిఁగురియ

---

[1] విరిసినశాత్రవపైవిని.

మ్రగ్గె నేనుఁగలు మడిసెగాల్బలము
మ్రొగ్గె రథములశ్వములుఁ గీటడఁగె. 560
అక్షీణబలశాలియగు సీరిచేత
నక్షౌహిణులు పడి యవనిపైఁగూలె.
గరుడకేతనకాంతి గగనంబుఁ గప్పు
యరదంబు రప్పింప హరి యాజికెలఁగి
పటుశౌర్యనిర్ముక్త బాణజాలముల
విటతాటమై కూలె వీరసంఘంబు
హరివజ్రహతిఁ గూలె నటవారణములు
తరిమి కృష్ణుని చక్రధారలచేతఁ
బరివరలై మ్రొగ్గె బహుళశతాంగములు
దనుజారి నందకదారుణహతుల
తునకలై ధరవ్రాలె తురగసంఘములు
నడవులనేర్చు దావాగ్ని చండమునఁ
గడువడి శౌరి సంగరకేళీ సల్ప
నతనితోఁబద్నాలుగక్షౌహిణిలును
హతమయ్యె వెస బ్రహరార్ధమాత్రమున

—. తనసైన్యముయొక్క పాటును జూచి జరాసంధుఁడు విజృంభించుట :—

నంతట మగధేశుఁడాత్మసైన్యంబు
నంతకుకడ కేఁగుటంతయుఁ జూచి
ఘనరోషలయకాలకాలునిభంగి
తనర ధనుర్గుణోద్ధతి సింహనాద 570

---

[1] మ్రొగ్గె.

నేమి నిర్ఘోషంబు నెరపంగ రథము
కామపాలుని తేరుఁ గదియించి పలికె.
"పిన్నవాఁడవు మున్ను భీమసంగ్రామ
మెన్నఁడైనను జూచి యెఱుఁగు దే(నీవు)!
పటుశత్రువనదావపావకుండనఁగ
నిటఁ జరాసంధుని నెఱుఁగవే తొల్లి!
తలఁ గోసి వేసెదఁ దరలక నిలువు
కలఁచి నాయమ్మునిఁ గ్రక్కింతుననుచు;"
యమ్ములు వఱగించ యందంద సీరి
యెమ్ములుఁ గీలింప నెంతయు నలిగి
యేమిటికీరజ్జలిటు ప్రేలెదనుచు
నామహాబలశాలి యరదంబు డిగ్గి
వానకుఁ దలవంచి వచ్చు గోరాజు
పూనికె వాని యమ్ములు లెక్కఁగొనక
ముసలంబుఁగొని హయంబులఁ జావ మోది
యెసఁగి సూతుని తల నిల డొల్లవేసి
కదిసి జరాసంధు కాయంబు మోముఁ
జదియంగ నడిచి నిశ్చలితుగాఁ జేసి
పెడ కేలుఁ గట్టి యాభీమవిక్రముఁడు
పెళపెళ నార్చినఁ బేర్చి సైన్యములు 580
పటహశంఖారావపటుసింహనాద
చటుల ఘోషముల దిక్సంధులు వగిలె.

—:కట్టువడిన జరాసంధుని శ్రీకృష్ణుడు దయచే విడలి పుచ్చుట:—

కడువేగ హరివచ్చి కరుణామై నతని

విడిపించి యనిపిన వెలవెల నగుచు
నసిహేతి హతశేషులగు వారుఁ దాను
మసలకఁ జనియె నమ్మగధభూవిభుఁడు
జయముఁ జేకొని రామజలజాక్షులంత
జయజయధ్వనులును సామగానములు
వందిమాగధభాగవతసంఘునినద
మందంద మ్రోయఁగ నమరేంద్రు లీల
పురము సొత్తెంచి యిమ్ములఁ రాజ్యభోగ
వరసౌఖ్యలీలల వ్రాలుచు నుండె
నాలోఁ జరాసంధుఁడఖిల బాంధవుల
నాలోచనము సేసి యప్పుడెంతయును
నలువొంద నిరువదినాలుగక్షోహి
ణులుఁ గూర్చి మధురమున్నగ వచ్చి సుట్టి
వదలకఁ దొంటికై వడి నొచ్చి పోయి
పదునెనిమిదిమార్లు బవరంబు సేసి
హరితోఁ జరాసంధుఁ (డావహకేళిఁ)
బరిభవంబందుట పరికించి చూచి 590

—: నారదుని ప్రోత్సాహముచే కాలయవనుఁడు సైన్యముతో జరాసంధునకు సహాయుఁడై వచ్చుట :—

యారూఢుఁడగు కాలయవనునితోడ
నారదుఁడెఱిఁగింప నలివాఁడు కదలి
ఘోరసత్వుల మూఁడుకోట్లను నేర్చి
శౌరిపై దండెత్తి చనుదెంచె నంత;

—: జరాసంధకాలయవనుల దాడినిఁ జూచి శ్రీకృష్ణుఁడు క్రొత్తపట్టణమును నిర్మించుట :—

హరి రాముఁడును దాను నటు విచారించి
"పరఁగ యాదవులకాపద వచ్చెఁ జూడు
డిడవచ్చె బలవంతుఁడీ కాలయవనుఁ
డదె జరాసంధుఁడు నటవంక వచ్చె
నేదికార్యము? మనకీ ప్రోలనుండ
రాదు; నాశమునొందుఁ బ్రజయిందు నున్న
దనిపల్కి; గోవిందుఁడబ్ధిఁ బ్రార్థించి
చనుదెంచి దేవతాశైలంబుపొంతఁ
గరమొప్ప విశ్వకర్మ రావించి
పురము నిర్మింపఁ బంపుటయు నతండు
బహువప్రగోపురధర్మహర్మ్యముల
బహురత్నకనకవిభ్రమచిత్రితముల
తతి చెలంగగను ద్వాదశయోజనములఁ
జతురశ్రమంబుగా సౌభాగ్యలీల
వలను మీరఁగ ద్వారవతి యనుపేరఁ
గలిగింప నప్పురిఁ గని సంతసిల్లి 600
తనరారఁ బారిజాతము సుధర్మమును
యనిమిషేంద్రుఁడు శౌరివీథిఁ బుత్తెంచె
ధనదునిఁ దలఁచిన దన మహాద్రవ్య
మెనిమిది కోశంబులిచ్చి పుత్తెంచె.
అధిక యోగారూఢుఁడగు ముకుందుండు
మధురలోపలఁ[1] దన్ను మఱచి నిద్రించు

[1] నాడ

జనుల నెత్తుక రాత్రి చని ద్వారవతినిఁ
దనరు మందిరములఁ దగుభంగి నునిచి
మరలి సీరయుఁదాను మధుర కేతెంచి

—: శ్రీకృష్ణుఁడొంటరిగా కాలయవనునికడకుఁ జనుట :—

హరి నిరాయుధలీల నట కాలయవను
కడకు నిర్భయత నొక్కరుఁడు నేతేరఁ
గడుసోద్యమంది యక్కమలాక్షు నెఱిఁగి
యడరి దిగ్గనలేచి యటఁ గాలయవనుఁ
డడనయ్యె నదె పట్టుడని వెంటఁదగుల
హరి వానిఁ గడకట నందంద పరువ
వెరవేది వాఁడును వెనుకొని పలికె
" వీరధర్మము మాని విలివారు నగఁగ
నీరీతిఁ బారుట యిది బంటుతనమె!
పగవాఁడు నీవెంటఁ బడ సిగ్గుమాలి
తెగిపారఁ బ్రాణంబు తీపటె కృష్ణ! 610
పోవకు పోయినఁ బోరిగొందు ననిన "

—: శ్రీకృష్ణుఁడు వెంటఁ దఱుముచున్న కాలయవనుఁడు చూచుచుండగా నొక కొండగుహను బ్రవేసించుట :—

నావిష్ణుఁడడరి మహాద్రిగహ్వరముఁ
జొచ్చిన వాఁడును జొచ్చి తోడ్తోన
నచ్చోట సుఖనుప్తుఁడగు పుణ్యుఁగాంచి
హరి యదృశ్యుఁడైన యట నిద్రనొందు
నరుఁగాంచి యతఁడు నున్నతప్రీతిఁ బలికె

—: శ్రీకృష్ణుఁడను భ్రాంతిచే కాలయవనుఁడు ముచుకుందుని లేపుట :—

" ఓరి ! గోపాలక ! ఓర్వక వెఱచి
దూరించి వెడఁగుసందులుఁ జొచ్చి యచట
నిద్రపోయినఁ బోదునె ? నిన్ను దీర్ఘ
నిద్రఁ బుచ్చెదనంచు నిగుడి తాఁకటయుఁ
బెద్దకాలము నిద్రఁ బేర్చిన పుణ్యుఁ
డద్దురాత్ముఁడు చావ నట మేలుకాంచి
యీక్షింపఁ గాలాగ్ని యెరఁ గాలయవనుఁ
డాక్షణంబున భస్మమై పోయె ననుఁడు

—: ముచికుందుని వృత్తాంతము :—

" ఎవ్వఁడా పురుషుఁడం దేల నొక్కరుఁడు
నవ్విధి నిద్రితుఁడై యుండఁ గోరె ?
అతని చూపులఁ గాలయవనుఁడు కాల
గతమేమి ? ఆయనకథఁ జెప్పవలయు "
ననుఁడు నాశుకయోగి యారాజచంద్రుఁ
గనుఁగొని విస్మయకలితుఁడై పలికె. 620
కురువిభుఁడిక్ష్వాకుకులవార్ధిచంద్రుఁ
బరహితచంద్రుఁడు ప్రథనసాహసుఁడు
మాంధాతసుతుఁడు నిర్మలమతి సత్య
సంధాస్యుఁడఖిలరాజన్యశేఖరుఁడు
ముచికుందుఁడను వాఁడు మును దేవతార్థ
మచలితస్థితిఁ బోరి యసురులనోర్చె.
అతనిని మెచ్చి యింద్రాది దేవతలు

యతులితంబగు వరమడ్గవే యనిన
నారాజు పెక్కండ్రు యసురులతోడఁ
బోరాడి తనియకవో నిద్రఁ బోవ
"వరమిందు నన్ను నెవ్వఁడు మేలుకొలుపుఁ
బోరివాఁడు భస్మమై పోయెడు" ననుచు
దివిజుల వీడ్కొని ధృతి నొక్కశైల
వివరంబు సొచ్చి యవ్విధి నిద్రవోంద
హరిమాయఁ బడెఁ గాలయవనుఁడీరీతి.

—: ముచికుందుఁడు శ్రీకృష్ణునిఁ గాంచుట :—

ధరణీశవర్యుఁడంతట లేచి వచ్చి
జలజాక్షు దేహతేజస్స్ఫూర్తి బిలము
వెలుఁగొంది చీఁకటి విడియుటఁ జూచె.
ఆయతాంబునేత్రు నతిదీర్ఘబాహు
తోయదనీలాంగు తుహినాంశువదను 630
కనకపీతాంబరుఁ గౌస్తుభోద్భాసి
వనమాలితోరస్కు వారిజనాభు
మకరకుండలదివ్యమకుటకేయూరు
వికసితాలంకారు విష్ణునిఁ గాంచి
వెఱఁగంది యుండెంద వెఱచి గోవిందు
నెఱుఁగక ముచికుందుఁడిట్లని పలికె.
"హరివహ్నిశశిభానులందొక్కదివ్య
పురుషుఁడవో ? కాక భువిఁబుట్టి తేజ
మెవ్వరికున్నదిం దేల వచ్చితివి
తెవ్వరు నీనామ మెఱిఁగింపు మనిన.

—: శ్రీకృష్ణుండు ముచికుందునకుఁ దన వృత్తాంతము నెఱుఁగఁ జెప్పుట :—

" వసుదేవతనయుఁడ, వాసుదేవుఁడను
నసమపాహసుఁ గంసు నవలీలఁ జంపి
మసలక రాక్షస మథనంబు సేసి
మధురాపురంబు నెమ్మది నేలుచుండ
నధికసత్వుఁడు కాలయవనుఁడే తెంచి
నలిమీఱి మాపట్టణము నిరోధింప
నెలయించి యాతని నిటు తోడితేర
నీకోపశిఖచేత నీరయ్యె నాతఁ
డేకతంబీ గుహా నేల యున్నాఁడ? 640
వాదిరాజులకంటె నధికుండవైతి
మేదినీశ్వర! నిన్ను మెచ్చితి వరము
పోఁడిగా నిచ్చెదఁ బొంది నేదియైన
వేఁడుము" వన్న వినతుఁడై పలికె.
" దివ్యతేజోమయ! దేవేంద్రవంద్య!
అవ్యయాత్మజ! కృష్ణ! అంభోజనయన!
భక్తపరాధీన! భక్తలోకేశ!
భక్తవ్రజత్రాణ! పరమకల్యాణ!
రాజ్యంబు సేసి యారాజులలోన
పూజ్యుఁడనై మహి పుత్రులఁ గంటి
ధనదాన్యవస్తుసంతతియందు నాకు
మనమురోయుట సేసి మదికోర్కులుడిగ
నేకర్మములు మాని యీగుహాంతమున
నేకచిత్తుండనై యుట నిద్రవోవ

నామీఁదఁ గృపఁగల్గి నన్ను మన్నింప
నీవిందు విచ్చేసితేఁ గృతార్థుఁడను ;
బ్రహ్మాదియోగీంద్రులు భావింపలేని
బ్రహ్మమైతోఁచు నీపదపంకజములుఁ
గనుఁగొంటి నీదు లోకముఁ బ్రసాదింపు
వనజాక్ష ! ఏనొండు వరమొల్ల" ననుఁడు 650

—: శ్రీకృష్ణుఁడు ముచికుందునకు వరము ప్రసాదించుట :—

" రాజవై యుండియు రాజధర్మములు
రోజఁ దప్పక యుండియును మృగహింస
మాని చిత్తమునఁ జిన్మయుఁడఁగు నన్నుఁ
బూని నిల్పితిగానఁ బొలిసెఁ బాపములు
భావిజన్మమున విప్రత్వంబుఁ దాల్చి
సేవకోత్తమ ! నన్నుఁ జెందెద"వనుచు
ముచికుందు బోధింప మొగి నమ్మహీశుఁ
డచలితంబగుభక్తి నందంద మ్రొక్కి
హరికిఁ బ్రదక్షిణమై వచ్చి నృపతి
గురుతరంబగు శైలకుహరంబు వెడలి
యతిసూక్ష్మతర దేహులగు మనుష్యులను
నతిసూక్ష్మతరువుల నందంద చూచి
కలియుగంబున వెళ్లగా నోపు ననుచుఁ
దలఁచుచు గంధమాదనముల కరిగె
బదరికావనభూమిఁ బద్మాక్షు నాత్మ
వదలక ఘనతపోవరనిష్ఠనుండె.
హరి కాలయవనుని యడఁచి యమ్మధుర

కరిగి తత్సేనల నవనిపైఁగూల్చి
వాని ఘోటకమణి వారణావళుల
మానైన హాటకమణి కటంబముల
ద్వారావతికిఁబుచ్చి తానుసీరియును
నారూఢజయకాములై యుండిరంత.

—: మరల జరాసంధుఁడు శ్రీకృష్ణునిపై దండెత్తుట :—

నట జరాసంధుఁడు నత్యుగ్రలీల
భటకోటిరథకరిప్రకరంబుఁ గూర్చి
యాత్మింప నదిగాక యిరువదినాల్గు
యక్షోహిణులు దాను నట దండువచ్చి
మధురపై విడిసిన మదిఁజింత వొడమి
మధువైరి హలియు నమ్మగధీశుకడకు
నల్లనఁ గాల్నడ నరుదేర వీర
లెల్లను జూచి వీరెవ్వరో యనఁగఁ
జని జరాసంధుఁడచ్చటఁగోపుఁడగుచు
వెనువెంట నడువంగ వెఱచిన భంగిఁ
బరువంగ మగధాధిపతి సేనతోడ
నరిమురిఁ దరుమంగ నతిదూర మరిగి

—: హర్షాచలముపై నెక్కిన బలరామకృష్ణులను జూచి జరాసంధుఁడు కొండకు నిప్పంటించుట :—

హరియు రాముఁడుఁ దాను హర్షాచలంబుఁ
దరమిడి నెక్కి నుద్ధత జరాసంధుఁ
డాకొండ దిరిగిరా ననలంబు వెట్టి

చేకొని కాల్వఁగా నీఁయు హరియు
వారుఁ గానక యుండి వడిదిగ నుఱికి
ద్వారకాపురికి నిద్దఱు నేఁగిరంత. 670

—: బలరామకృష్ణులు నిప్పులో మాడిరని తలంచి
జరాసంధుఁడు మఱలిపోవుట :—

నాలో జరాసంధుఁడా గోపవరులఁ
గాలి చచ్చిన వారిగా నిశ్చయించి
యగణితంబగు సేనలన్నియుఁ గొలువ
మగధదేశమునకు మగుడ నేతెంచె.
అక్కడ గోవిందుఁ డఖిలబాంధవులఁ
దక్కక తనుఁగొల్వ ద్వారకాపురిని
నానకదుందుభి యనుమతి నుగ్ర
సేనుఁడు తనపంపు సేయ సామ్రాజ్య
కలనంబునకుఁ దాన కర్తయై పేర్చి
బలభద్రుఁగూడి నిర్భయవృత్తినుండె.
మధురలోపల శత్రుమథనంబు సేసి
మధువైరి విహరించు మహనీయకథలఁ
దాత్పర్యమున విన్న ధన్యచిత్తులకు
సత్పుత్రలాభంబు శత్రుజయంబుఁ
గమనీయధర్మార్థకామమోక్షములు
సమకూరి హరిభక్తిసౌఖ్యంబు నొందు
నని చెప్పటయు వీని ననఘునిచేత
విని కృతార్థుఁడనైతి వివిధసంపదల
హరి యెట్లు విహరించె నట మీఁది కథలఁ

బరిపాటితోడ నేర్పడఁ జెప్పుమనిన 680
నమ్మహీశ్వరునకు నభిమన్యునుతుకు
నమ్మహాయోగి యిట్లని చెప్పఁదొడఁగె.
అనియిట్లు నయనిర్జరామాత్యు పేర
ధనధాన్యమణిమయదానాఢ్యు పేర
భూభరణక్షమభుజసారు పేర
శోభితమంత్రి కందామాత్యు పేరఁ
గోరి భారద్వాజగోత్రసంజాతుఁ
డారూఢమతి నయ్యలార్యునందనుఁడు
శృంగారరసకళాశ్రితవచోధనుఁడు
సింగనామాత్యుఁడు చెలువగ్గలింప
సలలితరసభావశబ్దగుంభనల
వలనొప్ప శ్రీభాగవతపురాణమున
మహనీయమగు దశమస్కంధసరణి
విహితలీలల నొప్పు విష్ణుచరిత్రఁ
బ్రాకటంబగు మధురాకాండ మనిన
నాకల్పమాకల్పమగు భంగిఁ జెప్పె. 688

మధురకాండము సమాప్తము.



శ్రీరస్తు.

శుభమస్తు.

# ద్విపదభాగవతము.

## కల్యాణకాండము.

—. విదర్భరాజు తనకుమార్తె రుక్మిణిని శిశుపాలునకిచ్చుటకుఁ దీర్మానించుట :—

ఆరూఢయౌవన నాయింతి జనకుఁ
డారాజు తనయున కిత్తు నేననుచుఁ
జింతించి చైద్యుండు శిశుపాలుఁడర్హుఁ
డింతికి నని నిశ్చయించి పెండ్లికిని
సకలదిక్పాలుర సకలభూపతుల
సకలమహీశ్వరసమితి రప్పించి
ధీయుక్తమై నాలు దినములలోన
నాయతంబగు లగ్నమరుదెంచుటయును
నంత నారుక్మిణి యంతయు నెఱిఁగి

—: రుక్మిణీదేవి తనపురోహితుని శ్రీకృష్ణుని వద్దకు పంపుట :—

చింతించి "నేనింక శిశుపాలు నెట్లు
వరియింతు ! త్రైలోక్యవరుఁడు నావిభుఁడు

హరి నాకుఁ బ్రాణేశ్వరుఁడై యున్నవాఁడు
నేనేమి సేయుదు నిటమీఁద నింక!
నానోములన్నియు నన్నుఁ బ్రదోక్కనియె
నెవ్వరు గలరింక నాభారి గడప!
ఎవ్వఁడోవుడు నాకు నీవార్తఁ జెప్పు."
అని పల్కి చింతించి యవ్వారారోహ
తన పురోహితపుత్రు ధర్మచరిత్రుఁ
బిలిపించి యెంతయుఁ బ్రీతి నెమ్మోము
కలఁగఁగఁబలికె గద్గదకంఠియగుచు ; 10
" అనఘాత్మ! మనవారు లవనీతి సేసి
నను [1]చైద్యపతికి నున్నతిఁ బెండ్లి సేయఁ
దలఁచుచున్నారు నాతలఁపు జీవనము
జలజాక్షుఁడనుచు నిశ్చలవృత్తి నుందు
నీమాటలన్నియు నెఱిఁగింపరాదు
నామీఁదఁ గృపఁగల్గి నన్ను మన్నించి
యరసి తోఁబుట్టినయట్లుగాఁ జూతు
మొరవు సేయకఁ జిత్త మెఱిఁగి వర్తింతు
వటుగాన నాకైన యక్కఱఁ దీర్ప
నిట నీవె కాక యింకెవ్వరు బంధు
లాయసంబునఁ జని యాద్వారవతికిఁ
బోయి కృష్ణునిఁగాంచి పొసఁగంగఁ జెప్పి
మరుఁడెత్తుకోల నామానంబు గొనును
పరువెత్తి రాకున్నఁ బరిణయలగ్న
మెడలేదు! తానింక నేతేరకున్న

---

[1] దైత్య.

విడుతుఁ బ్రాణంబులు వేఱొండులేదు." !
అనిన నావిప్రుఁడు నతివచోధనుఁడు

—: పురోహితుఁడు శ్రీకృష్ణుని వద్దకు వెళ్లి రుక్మిణి ప్రేమను రూపును వర్ణించుట :—

జనియె సత్వరమున శౌరిసన్నిధికి.
అరుదార ద్వారపాలావళిచేత
హరివిని యెదురేఁగి యా విప్రవరునిఁ 20
దోడ్కొనిపోయి సంతుష్టుఁ గావించి
వేడ్క ప్రియంబును వెలయ నిట్లనియె.
"ఎవ్వరు బుత్తెంచి రెందుండి వచ్చి
తెవ్వరు నీనామ మెఱిఁగింపు" మనిన
"అనఘాత్మ! భీష్మకుండను విదర్భేశు
తనయ రుక్మిణియను ధవళాయతాక్షి
[1]తనుమధ్య యుత్ఫుల్ల తామరసాక్షి
గరుడకిన్నరయక్షగంధర్వసతులు
దారయలేరాయింతితో నీడుఁబోల్ప ;
దేవర సౌభాగ్యదివ్యవర్తనలు
వారిరి జనులెల్ల వర్ణింపుచుండ
విని పుష్పధన్వుని విషమబాణములు
యనువొందఁ దనువున నటనాటుటయును
జిత్తంబులో నీదు చెలువైనమూర్తి
చిత్తరువొత్తిన చెలువంబుఁదోఁపఁ
జింతించు వెఱఁగందు చేష్టలు మఱచు

[1] ఒకోపాదమున్నది.

నంతకంతకు నిన్ను నభినుతి సేయు
విరహాగ్నిశిఖల గ్రాఁగు వెలువెలనగుచు
మరులెత్తినట్లు పల్మరు చిన్నఁబోవు 30
నీభంగినున్న యాయిభరాజగమనఁ
బ్రాభవంబునఁ జైద్యపతి పెండ్లియాడ
నెల్లుండి చనుదెంచు టెఱిఁగి యాయింతి
యెల్లవిధంబుల నిది నీకుఁ జెప్పఁ
బుత్తేర వచ్చితిఁ బుండరీకాక్ష!
చిత్తంబు నొండు చింతింప నేల?
ఆభామ నిజభార్యయై యుండునట్టి
సౌభాగ్యమెవరికి సమకూరు? నీవు
నారుక్మిణిభృంగి నాగలుఁ జేయు
కారుణ్యమూర్తివి కమలాక్ష! నిన్నుఁ
గదిసి నీదరహాసకౌముదిఁ గ్రోల
ముదితనేత్రచకోరములు చేరఁగోరు
నలవడి నీప్రయాణాంబువులోన
కలకంఠిచాతకి కడువేడ్క సేయు[1]
నీవెట్లైనను నేచిన వేడ్క
నావెలందుక నేలుటది నీకు నొప్పు;
నినునమ్మియుండిన నెలఁతుకనొకఁడు
కొనిపోవఁగాఁ జూడఁగూడునే నీకు?
పురవరాంగణములఁ బోరి దుర్గఁగొలువ
నరుదేర నాకన్య నాసురలీల 40
వరియించి చైద్యభూవరుసైన్యములను

[1] చెప్పు.

సరగున సమయించి జలజాక్షిఁ గొనినఁ
గీర్తియు లాభంబు గెలుపు పౌరుషము
నార్తరక్షణమును నగు నీకు కృష్ణ!
ఈకార్యమెడ మైన నిందిరారమణ!
ఆకామినీమణి యసువులు విడుచు
నిన్నిమాటలుఁ జెప్ప నెడలేదు వేగ
నున్నతి పరిణయంబొనరించుటొప్పు."
అనియని చతురోక్తులల్లనఁ బలుక
ననియె విప్రునితోడ నంబుజోదరుఁడు

—: శ్రీకృష్ణుఁడు రుక్మిణినిఁ గాపాడి పరించుట కొప్పుకొనుట :—

"వనజాక్షి రూపులావణ్యసంపదలు
విని చిత్తమునఁ జూడ వేడుక పుట్టి
వచ్చెదమనువేళ వరపుణ్య నీవు
విచ్చేసితివి లెస్స విధమయ్యెఁ దలఁప
నాకన్యకకు నాకు నలరుబంధుఁడవు
గాక యెందును వేరు గలదయ్య మనకు!
ఇదె వచ్చిశిశుపాలు నేగెల్చి సేనఁ
జదిపి యందఱు మెచ్చఁ జపలాక్షిఁ దెత్తు"
అనుచు మజ్జనభోజనాదికృత్యములు
తనరార సలిపి యాతనిఁ బూజసేసి 50

—: శ్రీకృష్ణుఁడు కుండినపురికిఁ బయనమగుట :—

శైన్యసుగ్రీవాదిచటులాశ్వపాంచ
జన్యచక్రస్ఫూర్తి చదలెల్లఁగప్ప

గరుడకేతన కాంతి కరమొప్పుచున్న
యరదంబు సన్నాహమై ప్రోల నిలుప
దారకుఁడును విప్రతనయుఁడుఁ దాను
నారూఢశుభవేళ నరదంబునెక్కి
గగనంబునను దివాకరబింబమోయ
నఁగఁ జనియె విదర్భ నలినాక్షురథము ;
పోవుటయును సీరి బుద్ధిఁ జింతించి
" యావిష్ణుఁడొంటిమై నరిగెఁ బెండ్లికిని
బలియురు మాగధప్రముఖభూపతులు
కలహంబు పుట్టు నేఁగదిసెద ననుచు
బలువొప్పఁ జతురంగబలసైన్యపతులుఁ
గొలువంగ హలివచ్చె కుండినపురికి.

-: ప్రౌండ్రకదంతవక్త్రాదులు కుండినపురి కేతెంచుట :—

అంతట శిశుపాలుఁడతి వైభవమున
దంతితురఁగసద్భటపదావళియు
వలనొప్ప పటహాదివాద్యముల్ మొరయ
బలియుఁడై చనుదెంచెఁ బరిణయంబునకు
హరితో విరోధాత్ములగు సాల్వమగధ
ధరణిఁ బౌఁడ్రకవరదంతవక్త్రులును 60
గొమరార శిశుపాలుఁగూడి యేతేర
నప్పుడు భీష్మకుండధికవైభవము
లొప్పారఁ బురమున నుత్సవంబొదవ
కలువడంబులు మేలుకట్లు తోరణము
లలవడ నేతెంచి యధికవైభవము

కలయఁ గుంకుమనీటఁ గలయాపులలికి
మెలుపార కస్తూరి మేడలఁ బూసి
మొనసిన కప్పురమున మ్రుగ్గు వెట్టి
తనరారఁ గదలికాస్తంభంబు లెత్తి
పురము సింగారించి పురుహూతులీలఁ
దరుణులు గొలిచిరా తరుణులుఁ దాను
వంది సన్నుత గీతవాద్యముల్ మొరయఁ
జెంది పేరంటాండ్రు సేసలుఁ జల్ల
గురుసంపదల నెదుర్కొని తోడి తెచ్చి
ధరణీశ్వరుల సంతతి మనోహరము
లగుచోట విడియించి యఖిలసౌఖ్యములఁ
దగుభక్తి నొసరించి దక్షులఁ బిలిచి
ఘడియారమిడఁగ మంగళతూర్యనినద
మెడపక మ్రోయంగ నెఱిఁగి రుక్మిణియు 70

—: రుక్మిణి శిశుపాలాదులు వచ్చుట విని హరిరాకకై పరితపించుట :—

కలఁగి మ్రాన్పడి నిల్చు, కళవళంబందుఁ
బెలుకుఱులోఁ దాలు పెదవులుఁ దడపుఁ
బలుకకూరకనుండుఁ బలుమాటలాడు
నిలువనేరక వ్రాలు నిట్టూర్పువుచ్చు
నంతయు హరిఁ జేర్చు నంతరంగమున
సంతాపమొదవంగఁ జర్చించి చూచు ;
“ సక్కట ! యెక్కడి కరిగెనో ! విప్రుఁ
డెక్కడఁబోయెనో ! ఏలకోతడసె !

వారికి యిక్కడివార్తలంతెనో! నడుమ
దిరిగెనో! శౌరిఁదోతెచ్చుచున్నాఁడో!
ఈకార్య మెఱిఁగింప నిందిరావిభుఁడు
కైకొనకుండునో! కడువేడ్కతోడ
వచ్చునో! ఎవ్వరే వలఁతందురొక్కొ!
మచ్చికతో నన్ను మన్నించునొక్కొ!
నెడమకన్నును జన్ను నెడమభుజంబు
వడి నదరెడి హరివచ్చు నిశ్చయము."
అని యిచ్చ నూహింప నంబుజోదరుఁడు
చనుదెంచి సీరితో సైన్యంబుతోడ
నావురోద్యానంబు నందొప్ప విడిసి
భూపాలతనయకింపుగఁ దనరాకఁ 80
జెప్పి పుత్తెంచినఁ జెన్నార విప్రుఁ
డప్పొలంతుకఁ గాంచి హరివచ్చెననుడు
హరుషాశ్రువులు గ్రమ్మ నందంద మేను
గరుపార నవ్విప్రుఁ గని యిట్టులనియె.
" పురుషార్థపరుఁడవు పుణ్యచిత్తుఁడవు
పరమాప్తుఁడవు నాకుఁ బ్రాణంబు నీవ!
ప్రాణవల్లభుఁడైనఁ బద్మాక్షుఁ దెచ్చి
ప్రాణంబుఁ గాచితి పలుకులింకేల!"
అనిపల్కి యతనికి నందంద మ్రొక్కి
కనకాంబరములిచ్చి ఘనతతో ననిచె.

—: రుక్మిణి గౌరియాలయమునకు వెడలుట :—

గౌరికి మ్రొక్కింపఁ గరము సంప్రీతి

నారాజబింబాస్య నటతోడి తేరఁ
గలికి రాయంచల గతుల గీడ్వఱచుఁ
జెలువలు నలుగడఁ జెన్నారి కొలువ
పటహకాహళశంఖపణవాదులొలయ
పటుతరంబగు వీరభటకోటి కొలువ
దేవతనగరికే తెమ్మన్న, శౌరి
కావార్త యెఱిఁగింప నవ్విప్రుఁబంచె.
ఆమెలఁత కాల్నడ నరుదెంచె నప్డు.
డేమని వర్ణింతు! ఇభపురాధీశ! 90
అడుగడుగిడుచోట నవనియంతయును
గడునొప్పు పద్మరాగ శ్రీవహించు;
ఉచ్చిఁతపండ్లతో నుల్లసంబాడు
నచ్చపలాక్షికి నంగుష్ఠచయము;
వదనఖద్యోతులనుపచరించు నెలవుఁ
గదియ మౌక్తికములుఁగట్టి నట్లుండు;
తనరు గచ్ఛపనిధిద్వయమింతిపాద
వనజాతముల మీఁద బ్రాలెనో యనఁగ;
గమనజాడ్యము శుభాకరమును నగుచుఁ
గమనీయలీల మీఁగాళ్లొప్పు సతికి;
పగడంపుఁదీగెలపంక్తులో యనఁగ
మగువకు నొప్పారు మడిమెల తీరు;
తరిసేయు మదనువుత్తళికలుఁ దమకు
నెరతనంబంచును నెరసులు వలుకుఁ
గనకకాహళకాంతిఁ గడచి చూపరకుఁ
గనుపట్టు కాంతజంఘలు దన్యమగుచు;

కదళికాయుగళంబు కటిభార మొప్ప
నడనవుఁగరికరయుమళంబు పసిఁడి
తొలచి నిలిపిన భంగిఁ దొలుకాడు రుచులఁ
గలకంఠి కొప్పారుఁ గరభోరుయుగము ; 100
వెడవిల్తుఁ గల్యాణ వేదికతోడఁ
దడఁబడు కొంత నితంబభారంబుఁ
గరిశిరస్పర్ధియై కనకపుపెట్టె ;
వరసైకతంబనా వలనొప్పు కటియు ;
కటిసూత్రఘంటికా ఘనరత్నకాంతి
పటిమతో నొప్పారు పసిఁడిదువ్వలువ ;
కామునికై పుత్రకామేష్టి వెల్వ
హోమగుండముభంగి నొప్పారునాభి ;
చలదలపల్లవసంకాశమగుచు
పలుచనై కనుపట్టు భామిని కడుపు ;
అలమిన ముష్టిలోనడఁగి చూపరకు
కలదు లేదను వాదుఁ గలిగించు నడుము ;
ఆపూర్ణకుచవిహారాద్రులకిడిన
సోపానములభంగిఁ జూపట్టు వళులు ;
హరినీలనాళంబులందుద్భవించు
గురుహేమసరసిజకోరకద్వయము
కిరణి నూఁగారుపై ఘనకుచద్వయము
కరమొప్పుఁ జూడ నా కామినీమణికి ;
పసిఁడి మించుల మించు పణఁతి కక్షములు ;
బిసవల్లికలరోజ బెరయు చేదోయి ; 110
కెందమ్మిరేకుల గెలిచి కెంపొదవు

నందమై తేమకు నరచేతులమరు ;
విద్రుమలతలతో నీడు దోఁగాడు
విద్రుమద్యుతి చేతివ్రేళ్లు పెంపొందవు ;
కలువరేకుల మించుఁ గరనఖద్యుతులు ;
పొలుచు శంఖముభంగిఁ బొలఁతికంఠంబు ;
జలజంబుఁ దెలివియుఁ జంద్రకాంతి యును
జలజాస్య నెమ్మోము సరిసేయరాదు ;
చెలువారు పగడంపుజిగురకో ! బింబ
ఫలమకో ! యననొప్పు బామకెమ్మోవి ;
వెలఁది వెన్నెలనీట వెలసిన కుంజ
కళికలో యననొప్పు కాంతపల్వరుస ;
దరహాసచంద్రిక ధళధళ వెలుఁగు
కరిదంతరుచి మించు గండపాలికలు ;
పొలుపైన పసిఁడితిలపుష్పమో యనఁగ
నలినాక్షి కొప్పారు నాసాపుటంబు ;
చారు శ్రీవర్ణంబు సరినచ్చెలొత్తి
చేరినయట్లొప్పుఁ జెవులు రుక్మిణికి ;
కందర్పుఁడింపుగాఁ గదల నిర్గమము
ముందట విల్లునమ్ములు నిడెననఁగఁ 120
దరలాక్షి నెమ్మోముతామరమీఁదఁ
గరవంకబొమలతోఁ గనుదోయి వొలుచు ;
శశి యింతి నెమ్మోము సవతుగాలేక
యసలార సగమైన యట్లొప్పు నొసలు ;
వదనాంబుజాతంబు వాసనఁగ్రోలఁ
గదియు తేంటులభంగిఁ గాన్పించుగురులు ;

తొయ్యలి మోముచందురు వెంటఁదగులు
నయ్యహిభంగిఁ జెన్నగు నీలవేణి ;
భావజన్ముని నెత్తపలకచందమున
నావామలోచనకసలారె వెన్ను ;
కటకనూపురహారకంకణరత్న
పటలరోచుల దిశాభాగంబుఁ గప్పఁ
గరిరాజగమనంబుగతి రాజతనయ
యరుదెంచె గౌరినిజాలయంబునకు.
ఈభంగి సౌభాగ్యమెసఁగ నేతెంచి

—: రుక్మిణి కృష్ణుని బతినిఁ జేయుమని గౌరిని బ్రార్థించుట :—

యాభామినీమణి యంబిక కెఱఁగి
ఘనసారమృగమదగంధమాల్యములు
కనకపుష్పంబుల ఘనధూపదీప
నైవేద్యతాంబూలనవ్యోపచార
భావార్చనలు సేసి ప్రణుతించి మ్రొక్కి, 180
" అంబిక ! గౌరి ! లోకాంబ ! కల్యాణి !
అంబుజాసనవంద్య ! ఆత్మసంచారి !
శంకరుమేనిలో సాబాలుఁగొన్న
శంకరి ! పావకశశిభానునయన !
ఈలగ్నమెడరుగానీక శ్రీవిభుని
వాలాయమున నాకు వరునిఁగావింపు "
మని ప్రదక్షిణపూర్వమై భక్తివిప్ర
వనితలకును బెక్కువాయనాలిచ్చి
కంకణఝుణఝుణత్కారంబు లెసఁగ

నంకించి వెసఁబాడియాడి కీర్తించి
కన్నుల మెఱుఁగు లక్కజముగా నిగుడఁ
గ్రన్ననఁ జండికాగారంబు వెడలి

—: చండికాగారము వదలి వచ్చుచు కృష్ణునిఁగానక రుక్మిణీ కలఁగుట :—

జలజాక్షురామికిఁ జంచలంబందుఁ.
దలపోయు, మార్గంబుఁ దప్పక చూచు
“ నావల శుభలగ్న మాసన్నమాయె
నావిష్ణుఁడేలకో యరుదేరఁడాయె !
ఆవిప్రవరునితో నాడినమాట
నేవిధంబున దప్పఁడేలకో ! ఇంక
నింతట హరిరాక యెడసేసేనేని
కంతుని పూనిక కడ జేరకున్నె !” 140
అనివిచారింపుచో నాసీరితోనఁ
జనుదెంచి విమలభీషణవృత్తిఁదోఁప
గరుడకేతనకాంతి గగనంబుగప్ప
నరదంబుపైఁ గృష్ణుఁడడ్డంబు వచ్చి
కనియెఁగోమలి నీలకచఁ గంబుకంఠిఁ
దనుమధ్య నుత్ఫుల్ల తామరసాక్షి
నారూఢయవ్వన నమృతాంశుముఖిని
హారకంకణనూపురాలంకృతాంగి
నాదిమలక్ష్మిఁ గన్యాశిరోమణిని
వైదర్భిఁగని యదువరుఁడుత్సహించె.

—: శ్రీకృష్ణుఁడు రుక్మిణిని దనరథముపై నెక్కించు
కొని చనుట :—

ఆకన్యయును బ్రేమ నంబుజోదరుని
రాకాశశాంకవిరాజితవదను
మకరకుండలకర్ణమాణిక్యరుచిర
వికచగండస్థలు విభవేంద్రవంద్యుఁ
నారూఢయవ్వను నతులసౌభాగ్యు
నారాయణుని హరిన్నళినాక్షిఁగాంచి
సిగ్గును భయమును జిడిముడిపాటు
నగ్గలింపఁగ నిల్చె నంబుజనయన :
ఆలోనఁగృష్ణుఁడు నవ్వాలుగంటి
నాలింగనముసేసి యర్మిలినెత్తి 150
కొనిపోయి రథముపైఁ గూర్చుండఁ బెట్టి
యనునయోక్తులఁ దేర్చి యంగంబు నిమిరి
దారకుఁ జూచి "రథము వేగ పఱవు
ద్వారకాపురికి" నిద్దైత్యారి కదలె.

—: పౌండ్రకాదులు శ్రీకృష్ణునిఁ దాఁకుట :—

ఆసమయంబున హరి భీష్మతనయ
నాసురంబునఁ గొంచు నరుగుటనెల్ల
వినిచైద్యమాగధవిభులాగ్రహమునఁ
జనిరంతఁ బౌండ్రకసాల్వవైదర్భ
"ఎక్కడికృష్ణుఁడు ? ఎక్కడిరాముఁ
డుక్కడంచెదము"ని యుఱువడిఁగదలి

చటులఘోటకకరిస్యందనవీర
భటపాదహతుల భూభాగంబు వగులఁ
బేర్చినయలుకలఁ బృథులరావముల
నార్చుచు దాఁటిరా యాదవోత్తములఁ
గవిసియుఁగార్చిచ్చుగతిఁ బెచ్చుపెరిగి
యవిరళంబుగ వెంటనంటఁ దాఁకటయు
నాయడ బలభద్రుఁడను జన్మఁజూచి
"యీయింతియును నీవు యిందుండ నేల?
కొని వేగమరుగుమీకూటవ మూఁక
నణఁచి యేనునుఁగూడ నరుదెంతు" ననుచుఁ 160

—: బలరాముఁడు యుద్ధము చేయుట :—

గమలాక్షు ననిచి యక్కామపాలుండు
సమరసన్నద్ధుఁడై చతురత నిలిచి
యాదవనికరంబు యత్యుగ్రసింహ
నాదంబులోఁ దూర్యనాద బులొలియఁ
దలకొని యొండొంటిఁదార్కొని మంట
లొలుక కైదువల సముద్ధతిఁ జూపి
యరదంబునరదంబు నశ్వమశ్వంబు
కరిఁగరి కాల్వురుఁ గాల్వురుఁ దొడరి
యారనంబునముట్టి యిరువాఁగుగిట్టి
పోరాడ సురులకద్భుతముగా నిగుడి
విలుకాండ్లు గవిసి దోర్వీర్యయంబు మెఱసి
పలునారసములు నిర్భరముగా నేయ
నలువుర నేవుర నలినుచ్చిపారఁ

దలలొక్కపెట్టు భూతలముల రాల్చి
రథములఁ జెక్కి సారథుల నుక్కడఁచి
రథరథ్యనివహంబు రణభూమిఁగూల్చి
కరులఁజెండాడి పుష్కరములఁదునిమి
హరుల విదారించి యాశ్వికోత్తములఁ 170
బ్రాణంబు లెడలించి బాణాసనములఁ
దూణీరములఁద్రుంచి దొరలగీటణఁచి,
వారువీరనకెల్ల వారికాయములఁ
దోరంపురుధిరంబుఁ దోఁగించిరంత ;
దొంకెనపోటులు దూరఁగానాటి
బింకంబులెడలక బెరయు వీరులును
గోరి పెక్కండ్రను గుదులుగాఁగ్రుచ్చి
పేరువారెడునట్టి బిరుదులువారు ;
తలద్రెవ్విపడియు ముండఱఁ దమ్ముఁబొడుచు
బలియులనొప్పించి పడియెడువారు ;
శిరములు వగిలినఁ జిందెలఁగట్టి
సరకుసేయకఁబోరుసల్పు లావరులు ;
దాటసిన వేటాడితునుకలుగాఁగ
యటిముటిఁదెగవ్రేసి యార్చురాహుతులు ;
సామజంబులనడుము సరిగ్రుచ్చిపారఁ
దోమరంబులవ్రేసి త్రుళ్లు మావుతులు ;
లవణిసారించి పల్లమును గుఱ్ఱమును
రవుతును జదియ భోరన ద్రోచువారు ;
ఱోలుచు నెత్తురుటొంపిలో మునిఁగి
కాలార్ప నేరని కరితురంగములు ; 180

దారగండులు వడి ధరణిపై వ్రాలు
తేరులు వెసనోళ్లఁ దెఱచు పీనుగలుఁ
జదిసిన కుండలు జదుపంబులైన
మెదడు మిడమిడమని మిడుకు బొమ్మలును
నవ్వెడి మోములు నలినంగకములు
విఱిగినవిండ్లును విటతాటమైన
వుఱియలతోనొప్పు బొమిడికంబులును ;
కరవాలకంకణకలితమై పడిన
కరములుఁ దుమురైన కాండకుంతములు ;
పఱియలై కూలిన పలకలు నాజఁ
దఱచుగాఁ దెగిపడ్డ ధవళచామరలు ;
నాడాడకుఁజింపులై దూరమెడలి
చూడనక్కజమైన జోడుపక్కెరలు ;
నెత్తురు నెఱచియు నెరి బొట్టకోలఁ
గుత్తుకబంటిగాఁ గ్రోలు భూతములుఁ ;
గొడపంపుఁ గంకాళి ఘోరనాదముల
వెడయాట లాడెడు వేతాళములును ;
వలనొప్పు భూతేశువక్షంబు వోలె
లలితకపాలమాలాయుక్తమగుచు 190
సమధికదానధ్య సరసంబె వోలె
కమనీయమార్గణఘనఘోషమగుచుఁ
గలగొన వైశాఖకాలంబె వోలె
నలినొప్పు బాణాసనధ్వస్తమగుచు
విహితమహారణ్యవిభవంబె వోలె
బహుఖగనాగసంప్రస్థితంబగుచు

సరభసనైదాఘసమయంబె పోలె
సురుచిరవాహినీశోణితంబగుచు
మహనీయవారాసిమధ్యంబె పోలె
సహజబాడబఘోషసారభ్యమగుచు
వలమి బీభత్సభయానకరౌద్ర
కలితమై యొప్పారి కలనొప్పెఁజూడ;
దట్టించెనంత యాదవసేనఁదఱుచు
నెట్టన నాచైద్యనృపుసేన విఱిగె.
మగధసేనలుఁగూలె మఱిసైపదర్భ
జగతీశుసైన్యంబు సాల్వుఁడు విఱిగె

—: శిశుపాలుఁడు క్రోధముతో వార్పైఁగవయుట :—

అంత నాశిశుపాలుఁడంతయుఁ జూచి
యెంతయు దర్పించి యెలుఁగెత్తిపలికె.
"కడుఁగ్రొవ్వి గొల్లలుఁగానక నన్నుఁ
దొడరి నేనున్నచోఁ దొయ్యలినెత్తి
కొనిపోయిరిద్దఱు కూల్చెద నొండె
చనియాజి వారిచేఁ జచ్చెద నొండె
యిట్టిజీవమునొంది యింటికిఁబోవ
నెట్లోర్తు? నాశౌర్యమెన్నటికింక!"
అనిపల్కి పేర్చి తానటు సేనఁదాఁకి
వనసమూహము నేర్చు వహ్నిచందమున
దరమిడి పటురథదంతియశ్వములఁ
బొరిమార్పఁ దత్బలంబులు పెల్లగిల్లె.
బలము వీఁగుటఁ జూచి బలభద్రుఁడంత 200

హలముసలోగ్రబాహార్గళుఁడగుచు
యరదంబు డిగివచ్చి యాసాల్వతేయు
నరదంబు నుగ్గుగా నడిచిన నతఁడు
గదవుచ్చుకొని సీరిఁ గదియ నాలోన
నదలించి మాగధుఁ డడ్డంబు దాఁకి
శరపరంపరలేయ, జడిసి మాగధుని
హరులను సారథి నవలీలఁ గూల్చె.
తేరిపై నురికి యుద్వృత్తిఁ గంఠమున
సిరంబుఁ దగిలించి చెచ్చెరఁ దిగిచి
రోఁకట నడఁపఁగ రుధిరంబుఁ గ్రక్క
వీఁకరి మాగధవిభుఁడు మూర్ఛిల్లె ; 210
నక్కజంబుగ వాని నరదంబు మీఁద
నెక్కించుకొని సాల్వుఁ డేఁగె నాలోన
నతనితోడనే యఖిలసైన్యములు
నాతురఁబడి గుండెలవియంగ బఱచె.

—: రుక్మి కృష్ణుని తూలనాడుచుఁ గవియుట :—

అంతకుమును విదర్భాధీశతనయుఁ
డంతకసముఁడు క్రోధాత్ముఁడై రుక్మి
తనసేనతోడ ముందఱ నేఁగి కృష్ణుఁ
గనుఁగొని భీషణోగ్రస్ఫూర్తిఁ బలికె.
" ఓరి! గోపాధమ! ఓడక నన్నుఁ
జీరికిఁగొనక నాచెలియలిఁ బట్టి
కొనిపోయెదికఁ నెందుఁ గొనిపోయెదీవు?
నిను నాశరంబుల నీరుఁ గావింతు ;"

నని గుణధ్వనిసేసి యాఱుబాణములుఁ
దనుప్రోఁ గీలింప దానవాంతకుఁడు
నల్లన నవ్వుచు నతని కేతనము
విల్లును ద్రుంచిన వేరొక్క ధనువుఁ
గొని బాణవర్షంబుఁ గురియఁగ శౌరి
కినిసి తేజుల సూతుఁ గీటణఁగించి
ధనువుఁ ద్రుంచుటయు, నాతఁడు వమ్ము వోక
ఘనమైన ఖేటకఖడ్గంబుఁ గొనుచు 220
హరితేరిపైకి రయంబునఁ గదిసి
కరవాలమున ద్రేయఁ గమలాక్షుఁడతని
పలుకయు వాలును బాణాష్టకమునఁ
దృణమాత్రముగఁ ద్రుంచి ధృతిమూర్ఛ వుచ్చి

—: శ్రీకృష్ణుఁడు రుక్మిని ధ్వజస్తంభమునకుఁగట్టి తల గొరుఁగుట :—

తనపాగఁగొని ధ్వజస్తంభంబుతోడ
మెలివట్టి మెడగట్టి మిడమిడఁ జూడ
నలుకమైఁ బేర్చి పెద్దమ్మున శిరముఁ
బలుపున జుట్టును బాఱఁగ గొఱిగి
యునిచిన ఖేదంబు నుమ్మలికంబుఁ
బెనుపాటు గదుర నిర్విణ్ణుఁడై యున్న
యన్నను గనుగొని యడలు దీపింపఁ
గన్నుల నీరొల్క గద్గద మగుచు
మొగము వెల్వెలబార ముదమున సిగ్గు
వగయుఁ దోఁపఁగ నిల్చి వైదర్భి పలికె.

—: రుక్మిణి తనయన్నను విడిచిపుచ్చుమని శ్రీకృష్ణునిఁ బ్రార్థించుట .—

" అక్కటా! ఈతఁడు నీయంతరం బెఱుఁగ
కిక్కడ నీచేత నిటుగట్టు వడియె
వెరగొప్ప నన్నుఁ దావిడిపింతు ననుచు
నరుదెంచినాఁడు నాయగ్రజుఁ డితఁడు
కలనిలోఁ బడువారిఁ గావక యిట్లు
పాలువ సేతలు సేయఁ బోలునే యకట! 230
నన్ను మన్నించి క్రన్నఁ బ్రాణమొత్తు
మిన్ని తప్పులుఁ గాచి యతనిఁ బోవిడువు; "
మనిపల్క నంతలో నడరి సీరియును
జనుదెంచి వైదర్భి సైన్యంబు బఱచి.
హరిఁగూడుకొని సీరి యరదంబు మీఁదఁ
దురపిల్లు రుక్మి నుదురుఁ జూచి పలికె.

—: బలరాముఁడు రుక్మిని విడిపించుట :—

" తగువాఁడు వియ్యము ధరణీశసుతుఁడు
తగదిటు సేయ నితని వేగ విడువు
మనిపల్కి బోధించి యతని విడిపించి
మనసు క్లేశము మాన్పి మరి రుక్మి ననిపి
యారామఁ దోడ్కొని యనుజుండు దాను
ద్వారవతికి నేఁగెఁ దాలకేతనుఁడు
పౌరులెదుర్కొని పట్టణం బెల్లఁ
గోరి సింగారింప గురుమూహూర్తమున
రాముఁడు హరియుఁ బురప్రవేశంబుఁ

గావించి సేసిరి కడుసంతసమున.
గురులచేతన ననుజ్ఞఁ గొని శుభలగ్న
మరయించి పెండ్లికి నఖిల వస్తువులు
సమకూర్చి బాంధవసమితి రప్పించి

—: శ్రీరుక్మిణీదేవి వివాహము :—

విమలమణిస్తంభవివిధశిల్పముల 240
వెరవుగాఁ బెండ్లికి వేది దీర్పించి
పరవుగా ముత్యాలపందిలిఁ బెట్టి
ఘంటామృదంగమంగళతూర్యరవము
లింటింట మ్రోయఁగ నెల్ల వీథులను
గనకతోరణములుఁ గలువడంబులును
గనకకుంభంబులుఁ గరమొప్ప నెత్తి
కస్తూరిచందనగంధసారాది
వస్తువిస్తారధూపవాసనలొలయ
నంతలంబులును నందందఁ బంపించి
నందాదిగోపబాంధవుల రప్పించి
దేవతాతిథిగృహదేవతార్చనలు
గావించి రేవతీకాంతయుఁ దాను
తరమిడి యయ్యశోదయును రోహిణియు
హరిపరిణయంబున కాత్మల నలర
శతకోటికందర్పసన్నిభమూర్తి
యతులితశృంగార మంగీకరించె.
కంతుబాణంబునఁ గడిగినభంగి
కాంతమైనార్చి సింగారించి తెచ్చి

తనరారు గృహదేవతలయొద్ద నిలిపి
యనుపమంబగులగ్న మాసన్నమైన 250
సాందీపనియమిత ద్విజోత్తములుఁ
జెంది పుణ్యాహంబు సేయించి రంత.
ఆనకదుందుభి హలపాణియుఁగ
సేన నందాదులుఁ జెలులుఁ జుట్టములు
వలనొప్ప విప్రభూవరవైశ్యశూద్రు
లెలమి మహోత్సవం బేపారుచుండఁ
గొమరారు నప్పసిఁడికుడుక నక్షతలు
నమరఁగఁ దలఁబ్రాలు నఖిలవస్తువులుఁ
బసిఁడిపళ్లెరముల బహుభంగిఁ బూనిఁ
రసికత మీరి పేరంటాండ్రు పాడ
నాలోన రుక్మిణి నంబుజోదరునిఁ
బ్రాలపోంగుల మీఁదఁ బరగంగ నుంచి
తెరవట్టి సౌభాగ్య దివ్యవస్తువులుఁ
గరముల నునిచి మంగళరావమెలయ
నాయెడ ఘడియారమరసి దైవజ్ఞు
లాయతమాయతమని ప్రీతిఁ బలుక
శుభలగ్నమరుదేర సుముహూర్తమనుచు
నభినుతులొనరించె నమరసంఘంబు;
తెరయెత్త ముఖచంద్రదీప్తులు వొలయ
యిరువురు నొండొరులీక్షించి రంత; 260
హరిచూడ్కి సతిచెక్కుటద్దంబులందుఁ
గరమొప్పు పత్రరేఖలభంగి నమరె;
వనితచూపులు హరివక్షంబు మీఁదఁ

బెనుపార నీలాలపేరులట్లుండె;
సుగభూరుహము మీఁద సురవల్లి నిగుడి,
విరులు రాల్చినభంగి వెలఁదొప్ప నెక్కు
పరువడిచేఁ దలఁబ్రాలొప్ప బోసె;
కరమర్థి హరి కరగ్రహణంబు సేయఁ
గలితమా వందిమాగధరావములును
జెలువారు సద్విజాశీర్వాదములును
మంగళపాఠకమహితవాక్యములుఁ
నింగి ముట్టగను ఘూర్ణిల్లె నంబుధులు.
అంతహోమాదికృత్యములెల్లఁ దీర్చి
సంతోషచిత్తుఁడై శౌరి పెంపొందె.
అనుపమ భక్ష్యభోజ్యాన్నపానములఁ
దనిపి యందఱికిని దగకట్ట నిచ్చి
నందయశోదల నయవాక్యవస్తు
సందోహములఁ బ్రీతి సలిపి వీడ్కొలిపె;
శోభనదినములు సొంపార దీర్చి
యాభామినియుఁ దాను నంబుజోదరుఁడు 270
కేళిహర్మ్యములందుఁ గృతకాద్రులందు
శైలసానువులందు సరసులయందు
వైదగ్ధ్యతో రతివల్లభకేళి
నాడట సుఖలీలలందె మురారి.

—: ప్రద్యుమ్నుని జననము :—

అటనొక్క యేడాది కబల రుక్మిణికిఁ
బటుతరంబైన గర్భశ్రీవహింప

మగువకు ఘృతకళీమంతోత్సవంబు
నెగడింపఁ దొమ్మిదినెలలు నిండుటయు ;
హరఫాలనయనాగ్ని నడఁగిన మరుఁడు
హరికిని రుక్మిణియందు ప్రద్యుమ్నుఁ
డనుపేర హరి యవతారభేదమున
జనియించెనో యన! జన్మించె తనయుఁ
డాపుత్రుఁ గనుగొని యతిగౌరవమున
నేపార సంతోషమెసఁగి వర్తిల్ల ;

—: పురిటింటిలోనుండి ప్రద్యుమ్నుని శంబరుఁడపహరించుట :—

" మువ్వంటుదినమయ్యె! ముద్దులపట్టి
నెవ్వఁడో కొనిపోయె నింటిలోనుండ !"
అని మహారోదన మటుసేయ శౌరి
విని సంభ్రమించి యవ్విధమెల్ల మున్నె
యెఱిఁగిన హాఁడయ్యు నెఱుఁగనియట్లు.
వెఱఁ గంది నలుగడ వెదకంగఁ బనిచె. 280
వదలకఁ దన పూర్వవైరంబుఁ దలఁచి
యతఁడయ్యె శంబరుండను దైత్యవరుఁడు
కొనిపోయి జలధి నక్కుమరుని వైచి
చనియె, నాశిశువు మత్స్యముమ్రింగె నంత.

— సముద్రములో వేయఁబడిన బాలకుని
మత్స్యమొకటి మ్రింగుట :—

ఆనావికులు వల నమ్మీను దిగిచి
కానుక యిచ్చినఁ గని శంబరుండు

యడబాల కొప్పింపుమని పంచె, వాఁడు
తడయక యబ్జాను దర్శనంబు సేయఁ
గడుఘులోనున్న చక్కని కుమారకునిఁ
గడువేడ్క నాదైత్యకాంతకొప్పించె ;

—:మాయావతి ప్రద్యుమ్నకుమారుని మక్కువతోఁ బెంచుట:—

నంతమాయావతి యాపుత్రుఁ గాంచి
సంతసంబునఁదేలి సౌమనస్యముః
నాపుత్రు శుభరేఖలంతరంగమున
నాపోకఁ గనుఁగొను నందంద పొక్కు
నక్కున నిడు ముద్దులాడుఁ న్నిచ్చు
జిక్కకౌఁగిటఁ జేర్చు చేష్టలు మఱచు
నీరీతిఁ బెంచగా నెలమి కందర్పుఁ
డారూఢయవ్వనుఁడై చూడ నొప్పె ;
ఆలోలమదనుని యాకారసరసి
నాలోలనయన మాయావతి మునిఁగి 290

— మాయావతి ఆరూఢయౌవనుఁడగు ప్రద్యుమ్నుని గాంచి మోహించుట :—

రతిశాససేసి గౌరవము వోనాడి
చతురత గతులను సరసభావమున
నాపడఁతి యొకనాఁడతిరహస్యమున
పైపడి పట్టిన భావజుండలిగి
"కటకటా ! ఈపని గర్హణంబనక
నిటు సేయఁదగునమ్మ ! ఇందీవరాక్షి !
తల్లివి నీవు నీతనయుఁడ నేను

చెల్లునే పాపంబు సేయంగ నీకు?
ఎక్కడ వినఁజూడమిట్టి దుర్నీతి
నెక్కడగలిగె! నీవెవ్వతవు" నుండు;
హరికిరుక్మిణికిని యవతరించుటయు
నెఱిఁగి శంబరుఁడు తానిందుఁ దెచ్చుటయు
జేరిన చందంబుఁ జెప్పి, వెండియును
నారామ భావజు నల్లన పలికె.
" రతినేను నావుప్పరతుఁడవు నీవు
ప్రతిలే | యాదిదంపతులము గాన
పీండో[illegible] గతిగాదు వీని [illegible]ర్జించి
దండిమై మనము వోదము ద్వారవతికి.
ఇతఁడు మా[illegible] విధంబెఱుఁగు నీతనికిఁ
బ్రతిలేని విద్యలభ్యాసంబు సేయు;" 800
మనుచు మాయావతి యమ్మ[illegible]విద్య
మనసిజునకు నిచ్చె మంత్రయుక్తముగ
ప్రద్యుమ్నుఁడంత నాపడఁతిచేఁ బెక్కు
విద్యలునేర్చి యావెలఁదియుఁ దాను
ధృతిఁబూని వర్తింపఁ దెలిసి శంబరుఁడు

—: శంబరప్రద్యుమ్నుల యుద్ధము :—

నతివేగముసను మహోగ్రప[illegible]ంబొదవ
మదను[illegible] దె[illegible]టార్చ మద[illegible]చారించి
గతఁగొని లయకాలకాలుఁడో[illegible] యనఁగఁ
బఱతెంచి వైచిన భావజుండలిగి
యుఱక యాతని వక్షమురుముష్టిఁ బొడిచె;

వాఁడు మహాశక్తి వైచిన మరుఁడు
వాడిగాఁగ నదిత్రుంచెఁ బుడకచందమున.
అప్పుడయ్యసుర మహాబలంబొదవ
నుప్పరంబెగసి పైనురగమై పడిన
గరుడుఁడై యాపాము ఖండించెమరుఁడు;
తిరుగక దనుజుఁడు ధీరుఁడై పేర్చి
వనదమైఁ బాషాణవరుషంబుఁ గురియ
ననిలుఁడై విరియించె, నద్రియై పడిన
కులిశమై దునుమాడె, కొంకక వాఁడు
కలుషించి కేల ఖడ్గము నెత్తుకొనుచు 810
బలువిడిఁ గవిసిన భావసంభవుఁడు
తలఁ ద్రెవ్వవేసె నుద్ధతకోపుఁడగుచు.
దేవసంఘములార్చె దివిఁ బుష్పవర్ష
మావిష్ణుతనయుపై నందంద కురిసె.

—: ప్రద్యుమ్నుఁడు సతితోఁగూడ ద్వారవతికి వచ్చుట :—

అసుర నీగతిఁ దెగటార్చి, వానింటి
వసురత్నభూషణావళులెల్లఁ గొనుచు
నంతరిక్షంబున నాద్వారవతికిఁ
గాంతాసమేతుఁడై కంతుఁడేతెంచె.
అంతట బురజనులందఱుఁ జూడ
నతంత శౌరి గృహాంగణ నిలువ
వైదర్భి దగ్గఱవచ్చి యీక్షించి
యాదవాన్వయజాతు నాజానుబాహు
నీలనీలాంగు నున్నిద్రాంబుజాక్షు

బాలభానుప్రభాప్రతిమానవస్త్ర
హారకుండలకిరీటాకల్పకలితు
నారాయణాత్మజు నారీసమేతుఁ
గనుఁగొని కృష్ణుగానోవు ననుచు
ననుమానమునుఁబొంది యాకాంత పలికె.
"సుందరాంగుండేరి సుతుఁడొకో! ఈతఁ
డెందుండి వచ్చెనో! ఎవ్వఁడో! ఇతని 320
నేయమ కనియెనో! ఈ కుమారకుని
యేయింతినోచెనో! ఇతని కౌఁగిటికి!"
అనిపల్కి తనకన్న యర్భకుఁ దలఁచి
స్తనములుఁ జేప బాష్పములుబ్బి నేలఁ
జింద "నేఁ గాంచిన శిశువు ప్రాణంబు
లిందాక నుండిన నింతె కాకున్నె!"
హరియెడ నాతని యంగంబు సొబగు
మెరమెరఁదోఁప నగ్గలిపేర్మిమాన
కన వసుదేవుఁడు హరియును బలుఁడు
జనుదేర దేవకీసతులును దాను
మారుని యాకార మహిమ వీక్షింప;
నారదుండేతెంచి నలినాక్షుఁ గాంచి
యెసఁగ బాలుని పురిటింటిలోనుండి
యసుర యెత్తుకఁబోయినది యాదిగాఁగ
చెప్పి నీపుత్రుఁడు చిత్తజుండీతఁ
డిప్పొలంతుక కోడలిది రతి దేవి
యనిచెప్పి నారదుండరుగ నందఱును
మనముల సంతోషమగ్నులై రంత.

కడు వేడ్క రుక్మిణి కదియంగ వచ్చి
కొడుకుఁ గోడలి నెత్తుకొని కౌఁగిలించి 330
వసుదేవ దేవకీవనజాక్షహలుల
కెసలార మ్రొక్కించి యింపులఁ బొదలె.
పురిఁటిం(ట)ఁ జెయిదప్పి పోయిన కొడుకు
మరలి యున్నేండ్లకు మగువయుఁ దాను
నేతెంచె హరిభాగ్య మెట్టిదో! అనఁగఁ
జాతుర్య సుఖలీల సలిపె మురారి.

—: సత్రాజిత్తుని వృత్తాంతము :—

అంత సత్రాజిత్తుఁడను రాజవృషభుఁ
డెంతయు భయమంది యిందిరా విభుని
కాస్యమంతకముతో నమ్రతాం(గ)శుమండ
లాస్యక నిచ్చెదమ(ని) చెప్పుటయును
వెఱఁగొంది యారాజు వెన్నుని కేల
వెఱచి యమ్మణితోన వెలఁది నెట్లిచ్చె
నాకథఁ జెప్పవేయని వేఁడ శుకుండు
ప్రాకటంబుగఁ గురుప్రవరుతో ననియె.
అనఘ! సత్రాజిత్తుఁడను ధరాధీశుఁ
డినుగూర్చి తపమాచరింప నాతనికి
మెచ్చి వరంబిచ్చె మిహిరుండు వేఁడ
నిచ్చె స్యమంతాఖ్య నెసఁగు రత్నంబు
నామణి వక్షంబునం బొప్పఁ దాల్చి
తామరసాప్తుఁడితండకో! యనఁగ 340
ధరణి యేలుచునుండి ద్వారకాపురికి

నరుదెంచి యొకనాఁడు హరిఁజూచు వేడ్క
సరసిజసఖుఁ గేల చనుదెంచె! ననుచుఁ
బురము వారెల్ల నద్భుతమ ది చూడ
శౌరిగేహమునకుఁ జనుదేర, కృష్ణుఁ
డా రాజు మన్నించి యర్థిఁ బూజించి
యొక కొన్ని నెలలుండి యొక్కనాఁడతని

—: శ్రీకృష్ణుఁడు సత్రాజిత్తుని స్యమంతకమణిని యాచించుట :—

నకుటిలచిత్తుఁడై యబ్జాక్షుఁడనియె;
"ఈ రత్నమిమ్ము నీ కేవస్తువైనఁ
గోర నీ కిచ్చెదఁ గొనుమన్న" నృపతి
"కనకంపుమాడలుఁ గడఁగి నిచ్చలును
ననిమిది బారువులిచ్చు నీరత్న
మెవ్వరిచే నున్న నీతిబాధలును,[1]
జివ్వయు దురితముల్[2] చెందవు నరుల
నినద త్తమీరత్న మీనోప" ననుచు
ధనలోభమున బట్టెఁ దగువాఁడు దన్ను
నడిగిన వస్తువు లడఁచి యీనేర
కడలిన దుఃఖార్తులగుటెందు నరుదె!

—: సత్రాజిత్తు ప్రసేనునకు మణినిచ్చుటయు, వాఁడు వేటకుఁ బోవుటయు: —

వనజాక్షునకు నీక వంచించి రత్న
మనుజునికిచ్చిన నాప్రసేనుండు 350

---

[1] ఈతిబాధలందును [2] దురితంబు

నామణి ధరియించి యశ్వంబు నెక్కి
కామించి యడవి కొక్కఁడు వేఁట వెడలి
మృగముల నొంప నమ్మేదినీవరుని
మృగరాజు చంపి యామిషశంక నతని
మెడనున్న రత్నమర్మిలిఁ గొంచు కొండ
పడలోని కరుగంగ భల్లూకవిభుఁడు
యా కేసరినిఁ ద్రుంచి యామణిఁ గొంచుఁ
బ్రాకటంబుగ మహాభవనంబు సొచ్చె.
అంత సత్రాజిత్తుఁ డనుజుఁడు రామి
కెంతయుఁ జింతించి యిచ్చలో వగచె.

—: సత్రాజిత్తు శ్రీకృష్ణుడు మణి నపహరించెనని సందేహించుట :—

" కటకటా! అడవి కొక్కరుఁడునుఁ బోయెఁ
గుటిలత నెవ్వరు కూల్చిరోగాక!
తనకు నమ్మణి యీని తప్పన శౌరి
మనప్రసేనుఁ బట్టి మడియింపఁబోలు!
అతఁడేల లోబడు నన్యులచేత!
ఇతరులీసాహసం బేల కావింత్రు?
అడిగిన యీనేరక నుజన్మఁ గోలు
పడితినక్కట!" అని పలవింపుచుండ
విని పౌరులెల్లను విష్ణుని దలఁచి
యనుమానపడుచుండ నామాట లెఱిఁగి 360
యపరిమితజ్ఞాని యగు శౌరి యట్టి
యపకీర్తి నెబ్బంగి నడఁగింతు ననుచు

నడవికిఁ దను బోరులందఱుఁ గొలువఁ

—: శ్రీకృష్ణుడపవాదమును సహింపక మణిని వెతుకుటకై యడవికిఁ బోవుట :—

గడు వేగ నరిగి సింగముచేతఁ బడిన
హయముఁ బ్రసేనుని యచ్చోటఁ గాంచి
రయమున సింహనిర్గమనమార్గమునఁ
జని ఋక్షవిభుచేతఁ జచ్చినసింహ
మునుగాంచి పురజనంబుల కెల్లఁ జూపి
యాగుహావాకిట నందంఱ నునిచి
వేగమే కృష్ణుఁ డా వివరంబు సొచ్చి

—: శ్రీకృష్ణజాంబవంతుల సమావేశము :—

చనె; జాంబవంతుని సదనంబు నందుఁ
దనరారు సఖి నునుతల్పంబు మీఁదఁ
దనయ నందిడి దాది దానికి రత్న
మనునయంబునఁ జూపి యాడింప, కృష్ణుఁ
డరుదేరఁ బొడగాంచి యదరి యేడ్చుటయుఁ
బరుషత భల్లూకపతి యేఁగుదెంచి

—: శ్రీకృష్ణజాంబవంతుల యుద్ధము :—

యట్టహాసము సేసి హరిఁగిట్టి ముష్టి
ఘట్టనంబులఁ బాదఘాతల నొంపఁ
గడఁగి మాధవుఁడు నిర్ఘాతంబు వోని
పిడికిటఁ బొడిచిన బెదరక జాంబ 370

వంతుఁడు మురపై వక్షంబుఁ బొడువ
నంతకాకారుఁడై హరివానిఁ దాఁకె.
ఇరువురు నీరీతి నిరువదిదినము
లురువడిఁ బోరాడి యొగి కైటభారి
భల్లూకపతిగుండెఁ బగులంగఁ బొడువ
నొల్ల నొల్లన నోయి యురుమూర్ఛఁ దెలిసి
యేయుగంబులయందు నీరీతిఁ దొడరి
యకిర్వదినాళ్లు బవరంబు సేయ
నెవ్వరునకుఁ జెల్లు తనంత సేసె
నెవ్వరౌరా! అని యిచ్చలోఁ దలఁచి
యంబుజోదరు నట నాత్మలోఁ దెలిసి
జాంబవంతుఁడు భక్తి సాష్టాంగ మెఱఁగి
చేతులు మొగిడించి శిరసునఁ దాల్చి
యాతతప్రీతి నిట్లని సన్నుతించె.
" దేవ! జగన్నాథ! దేవేంద్రవంద్య!
గోవింద! కృష్ణ! ముకుంద! సర్వేశ!
నీవాదిమూర్తివి నిగమార్థవిదులు
భావించి కనియెడి పరమాత్మవీవ!
పారిపారి బ్రహ్మవై పుట్టింతు జగము!
హరిమూర్తివై నీవె యనిశంబు బ్రోతు! 380
హరుఁడవై యడఁగింతు వఖిలభూతములఁ
బరమాత్మ! నీలీలఁ బ్రణుతింప వశమె!
దశరథాత్మజుఁడవై ధరణిఁ బాలించి
దశకంఠు గెలిచి సీతాదేవిఁ దెచ్చు
శ్రీరాముఁడవు నిన్నుఁ జింతింప మఱచి

వైరంబు గొని పోరి వంచితు నైతి
నాతప్పు సైరించి నన్ను మన్నించు
నీ తత్వ మెఱుఁగంగ నేర్తునే'' యనిన
"నాతోడ నిరువది నాళ్లు పోరాడి
భూతేశునకు నైనఁ బోలునే యందుఁ
బెద్దవు నీవు నాపిడికిళ్లు దాఁకి

—: శ్రీకృష్ణుఁడు జాంబవతీకన్యను బరిగ్రహించుట :—

తద్దయు నొచ్చె నీ తనువంచుఁ'' బలుకఁ
[1]సరసిజోదరుఁడు ఋక్షపునకిట్లనియె.
"ధరణిపై నీస్యమంతక నిమిత్తమునఁ
బరపైన యపకీర్తి పాటిల్లె నాకు;
నేపార నీరత్నమిచ్చి సంప్రీతి
వేపంపు'' మనుటయు విని భల్లుకేఁడు
నామణి నర్పించి యాత్మసంజాత
వామలోచన జాంబవతినిచ్చి హరికిఁ 390
బ్రణమిల్లి "ఈకన్యఁ బత్నిగా నేలు
ప్రణవాత్మ!'' అనిపల్క పద్మాక్షుఁడతని
మన్నించి కన్యకామణితోడ మణిఁ
గ్రన్ననఁ గైకొని కదలి యేతెంచె.

—: బిలద్వారమందుండిన పౌరులు పురమును జేరి
శ్రీకృష్ణుఁడు మడిసెనని చెప్పుట :—

చెన్నార వెన్నుని సేవించి వచ్చి

[1] ఒకేపాఠ మున్నది.

మున్ను బిలద్వారమున నున్న పౌరు
లాకంజలోచనుఁడాపెద్ద నడఁగి
రాకున్న బెగడి పురంబున కరిగి
యావార్త నెఱిఁగింప నఖిలబాంధవులు
దేవకియును వసుదేవుఁడుఁ గలఁగి
దేవతాగణముల ద్విజలోకతృప్తిఁ
గావించిరంత; నాకమలలోచనుఁడు
ద్వారకాపురి సొచ్చి తగ నుగ్రసేను
నారూఢగతిఁ గాంచి యుంకువుఁ జూడఁ
బ్రీతి సత్రాజిత్తుఁ బిలిచి ప్రసేనుఁ
డాతల వని మృతుఁడైన చందంబు
మరి జాంబవంతుఁడు మణి హరించుటయు
నరయ నాతఁడు కయ్యమాడిన తెఱఁగు
నచ్చుగా నెఱిఁగించి యతనికారత్న
మిచ్చి మనోవ్యథ నెడలె మురారి. 400
ఉత్తములగు వారికొక నింద వొడమ
నుత్తలపడి తీర్పకోర్తురే నిలువ!
అంత సత్రాజిత్తుఁ డమ్మణి దాన
వాంతకుచేఁ గొని యంతరంగమున
సిగ్గును దుఃఖంబుఁ జిడిముడిపాటు
నగ్గలంబొదవ నిట్లని విచారించె.
"అక్కటా! శ్రీనాథు నఖిలలోకేశు
నెక్కటి నిందించి నృపకోటిలోనఁ
బాపంబు సేసితిఁ బద్మాక్షుచిత్త
మేపాటి నొచ్చెనో యేమిగాఁగలదో!

హరిమానసము రోషమడఁగెడు నట్టి
వెరవేదియో యని విన్నఁబాటు నొంది

—. సత్రాజిత్తు సత్యభామను శ్రీకృష్ణునకు భార్యగా
నర్పించుట :—

తనకూఁతు సత్య నుత్తమగుణాభరణఁ
దనరార గైసేసి తనవారుఁ దాను
మణితోడఁ గామినీమణి నొప్ప నిచ్చి
యణిమాదిగుణపూర్ణుఁడగు హరి కనియె.
" పరమేశ! నాకూర్మిపట్టి యీకన్యఁ
బరిణయంబై రవిప్రభ నొప్పుమణియు
ధరియింపు" మన్న మాధవుఁడా నరేంద్రుఁ
గరుణించి సమ్మోదముఁ గనుఁగొని పలికె. 410
" అరులు మిత్రులు నాకు నరయంగ లేరు
పరమాప్తుఁడవు మాకుఁ బావనచరిత!
ఈనాతి నిమ్ము నాకిమ్మహారత్న
మేగొల్ల నేనీకు నిచ్చితి" ననుచు
నాతని కర్పించి యాసత్యభామఁ
బ్రీతిని బెండ్లాడె పీతాంబరుండు.
సత్యభామయుఁ దాను సంప్రీతితోడ
నత్యుదాత్తసుఖంబు లందె మురారి.

—: శ్రీకృష్ణబలభద్రులు కరిపురంబునకు వెడలుట .—

ఆలోనఁ బాండవులట లక్కయింటఁ
గాలి చచ్చుట విని కాలక నుంట

దెలిసిన వాఁడయ్యుఁ దెలియని యట్లు
బలభద్రుఁడును దాను బయనమై కదలి
కరిపురంబున కేఁగి గాంగేయ విదుర
కురుపుంగవులఁ గనుగొని పాండుసుతులఁ
దలఁచి దుఃఖించి బాంధవులును దాను
కలిసి వర్తింప; నక్కడ నొంటియైన

—: శతధన్వుఁడు సత్రాజిత్తుని వధించి మణిని హరించుట :—

యక్రూరకృతవర్మలా కృష్ణుతోడ
నక్రూరుడా శతధన్వు వడిఁ జూచి పలికి
"రడరుచు సత్రాజితను వాఁడు నీకుఁ
గడఁగుచు యీనున్న కన్యయు హరికి 420
నిచ్చె నాతని రత్న మేవెంటనైన
పుచ్చుకొమ్ము" నుటయుఁ బోరి నొక్కరాత్రి
తనయింట నున్న సత్రాజిత్తు నిద్ర
దనిసి యుండఁగ మెడఁ దఱిగి వధించె.
తరుణులందఱు నేడ్వఁ దనరి యామణిని
హరియించె శతధన్వుఁ డట యింతలేక
సత్యభామయుఁ దండ్రి చావున కడలి
యత్యంతశోకాన నతని కాయంబుఁ
దైలపక్వముఁ జేసి తగుచోట నునిచి
యాలేమ కరిపురి కరుదెంచె నంత.

—: శ్రీకృష్ణుఁడు శతధన్వునిఁ జంపుట :—

ఆమాట విని కృష్ణుఁ డబల నూరార్చి

రాముఁడుఁ దానును రథ మెక్కి కదలి
తరలాక్షిఁ దోడ్కొని ద్వారకాపురికి
నరుదేర శతధన్వుఁ డాస్యమంతకము
నక్రూరునకు నిచ్చి యతిజవాశ్వంబు
విక్రమంబున నెక్కి, హలియును దాను
పటురయంబున వానిపజ్జఁ దాఁకుటయుఁ
జటులత వాని యశ్వము జవంబెడలి
భరమోర్వకను బడి ప్రాణముల్ విడిచె.
తురగంబు కూలిన ( దోరంపు భీతి 430
నాతఁడు కాల్నడ నరుగుటఁ జూచి
యాతతరయమున నరదంబు ద్రోలి
ఘనచక్రధారచేఁ గంఠంబు నఱికి
తనువెల్ల నరసి రత్నముఁ గాన లేక
"శతధన్వు నూరకే చంపితి నకట!
ఇతఁడు మహామణి నెందుంచినాఁడొ?
అరసికొందము గాక" యనిరథంబెక్కి
యరుదేర హలపాణి హరికిట్లలనియె.

—: బలరాముఁడు మిథిలానగరమునకు వెళ్లుట ;
అచ్చట దుర్యోధనుఁడతని పద్ద గదాయుద్ధ మభ్యసించుట :—

"ఈ మిథిలాధీశుఁడితఁడు నాసఖుఁడు
కామించి యారాజుఁ గాంచి వచ్చెదను
నీవు పొమ్మని" పల్కి నీలాంబరుండుఁ
వేవేగ మిథిలకు విచ్చేయ నతఁడు
యెదుతేఁగి సీరికి నెంతయు వేడ్కఁ

జదురొప్ప దేవోపచారసత్క్రియలు
నతిభక్తిఁ బూజింప నతని గేహమునఁ
జతురత నొకకొన్ని సంవత్సరములు
కలసి వర్తింప నక్కడ సుయోధనుఁడు
హలిచేతఁ బటుగదాభ్యాసంబు సేసె.

—: అక్రూరుని వృత్తాంతము :—

వనజాక్షుఁడును ద్వారవతికి నేతెంచి
తనరారు మణి శతధన్వుని వద్దఁ 440
గానక యుండుటఁ గాంతకుఁ జెప్పి
పూని సత్రాజిత్తు భూమివర్యునకుఁ
బరలౌకికంబులు భక్తిఁ జేయించె.
అరయ నారత్నంబు యక్రూరుఁడెత్తి
కొని పోయి వనభూమి కుశలియై యుండె.
అనఘమానసుఁడైన యక్రూరుఁ డరుగ
నాపట్టణంబున నఖిలమంత్రులకు
దూపిల్లె భయకష్టదుష్టరోగములు.
అని చెప్పుటయు విని యక్రూరుఁడెట్లు
ఘనపుణ్యుఁడయ్యె నక్కథఁ జెప్పుమనుఁడు ;
మున్న శ్వఫాలుఁడు మొగి ననావృష్టి
ఖిన్నుఁడై కాశి కేఁగినఁ గాశిరాజు
హరువరంబునఁ గనె యమృతాంశువదనఁ
దరలాక్షి గాందిని తన కూర్మిపుత్రి ;
ఈకన్నచే నన్ని (యీతి) బాధలును
శోకరోగాదులు సోఁకక యడఁగు ;

ఆకన్యఁ బ్రీతినై యశ్వపాలునకుఁ
జేకొని వడిఁ బెండ్లి సేసి పంపుటయు
నానాతి వరియించి యఖిలదుఃఖములు
మాని సుఖించె నమ్మనుజవల్లభుఁడు. 450
ఆయింతి సుతుఁడైన యక్రూరుఁ డలిగి
పోయినకతమునఁ బుట్టె నీపాప

—: అక్రూరుని శ్రీకృష్ణుఁడు పిలిపించి బుద్ధులు చెప్పి మరల వానికే మణిని ప్రసాదించుట :—

మనిచూచి శౌరి యా నక్రూరుఁ బ్రేమఁ
బనివడి మాతలఁ బంచి రప్పించి
యతనితో నొక్కనాఁడు తిరహస్యమున
శతదళనేత్రుఁడు చతురుఁడై పలికె.
" అడరి సత్రాజిత్తు నడఁచి మాణిక్య
మురవడిఁ గొంపోవ నొగి వెంటఁ దగిలి
శతధన్వ నూరకె చంపితి గాని
యతులితంబగు రత్నము నీచేఁ గాన
మక్కటా! శ్రీధనంబది పాడిగాదు
యిక్కువ జ్ఞాతులకిది యహితంబు
నీయింట నతని మానికముండ గాన
యీయధ్వరములు నీకిటు సేయఁగలై
నిది నాకుఁ బ్రియమన్న " నిందిరావిభుని
పదపంకజములకుఁ బ్రణమిల్లి యతఁడు
" గోవింద! కృష్ణ! ముకుంద! మురారి!
పావనగుణపూర్ణ! పద్మాయతాక్ష!

సర్వాత్మలందును జరియించు నిన్ను
సర్వేశ! ఎఱుఁగంగఁ జనునయ్య నాకు" 460
అని పల్కి హరిచేతి కక్రూరుఁ డెలమి
తనరార నాస్యమంతక మిచ్చి మ్రొక్కె.
శౌరి సంతసమంది జ్ఞాతులు చూడఁ
గోరి యారత్న మక్రూరున కిచ్చె!
"ఈకథవిన్న మీఁకీప్సితార్థములు
ప్రాకటంబుగ నిచ్చు భవబాధలుడుగు
నపకీర్తులడగించు నఘములఁ జెఱచుఁ
గపటంబులెడలు మంగళములు నిచ్చు"
నని చెప్పి మరియును నంబుజోదరుఁడు

—: శ్రీకృష్ణుఁడు ఇంద్రప్రస్థపురమునకు వెడలుట :—

తనరంగ నింద్రప్రస్థంబున కరిగె.
అఖిలలోకారాధ్యుఁడగు విశ్వగురుఁడు
సుఖతరంబుగఁ బాండుసుతుల నీక్షించి
సుదతి గొంతికి ధర్మసుతునకు మ్రొక్కి
కదియంగ భీమునిఁ గౌఁగిటఁ జేర్చి
నవ్వుచుఁ దనమ్రోల నమ్రులై యున్న
కవ్వడికవల నొక్కట నెత్తి ప్రేమ
నందఱి సేమంబులడుగంగ వార
లందఱుఁ బూజింప నానందమంది
గొంతియుఁ గృష్ణు నక్కునఁ జేర్చి దుఃఖ
మంతకంతకుఁ బేర్చి యార్తియై నేడ్వఁ 470
గరపల్లవంబునఁ గన్నీరుఁ దుడిచి
నరుఁడండఁ దన మేనయత్త నూరార్చి

ధర్మనందను గేలు తన కేలఁ బట్టి
యర్మిలి నిగుడ నిట్లనియె నాశౌరి.

—: శ్రీకృష్ణుఁడు పాండవుల క్షేమవార్తల నరయుట :—

“ అక్కటా! దుర్మదులగు శత్రునులు
పెక్కుపాటుల మిమ్ముఁ బెట్టంగ వినుచు
నొప్పగించిన యట్టులుంటిమి గాని
యప్పటప్పటికి మిమ్మరయంగ లేక
దైవంబుకతన నింతటి బాధలుడిగె
నేవిధంబునఁ బుణ్యలోకములను ;”
అనవుడు ధర్మరాజా కృష్ణుఁ జూచి
వినయబాంధవములు వెలయ నిట్లనియె.
“ అనఘాత్మ! నీ మర్మమరయకయున్న
మనవేర్తు మే మేము మర్త్యలలోన?
తల్లియుఁ దండ్రియుఁ దైవంబు గురుఁడు
నెల్ల బాంధవులును నీవ మాకు!
ఈలోద్ది వాక్కుల నిహపరంబులకు
మాకెవ్వరున్నారు? మధుకైటభారి!”
అనుచు మజ్జనభోజనాది సత్కార
వినయోపచారాది విధులఁ బూజింప 480
హరియుఁ బాండవులును నన్యోన్యమైత్రి
నురుతరంబుగ నుండ నొకరోఁడు చనియె.

—: శ్రీకృష్ణుఁడును పార్థుఁడును వేఁటకై వెడలుట :—

అత్తరి నొకనాఁడు హరియుఁ బార్థుఁడును

జిత్వాబ్జముల వేడ్కఁ జిగురులు వాఁడమ
వాయువేగము లైన వాజులఁ బూని
యాయుధపరిపూర్ణమగు రథం బెక్కి
యగణితసార మేయావళితోడ
మృగయులాయుధపాణు లై యరిగి తోనడువఁ
గాకోలభీకరకాకోదరంబుఁ
గాకఝిల్లికము ఘోరరావకులము
నపరిమితాభీలహర్యక్షకులము
కుపితకోలాంగూలకోలాహలంబు
కరితుండఖండితఘనపిప్పలంబు
వరతపఃపరికీర్ణపల్లవస్థలము
ప్రకటితకుంజరవ్రాతకంటకము
వికృతభల్లవ్యాఘ్రవృకసమూహంబు
నగు మహారణ్యంబు నందంద చొచ్చి
మృగయానురక్తులై మెలఁగి యాలోన
వలలొగ్గి తెరలొత్తి వరభటోత్తములు
బలిసి కొమ్ములనుండి పదిలమై నూఁద 490
పరఁగఁ గిటివ్యాఘ్రభల్లసారంగ
కరిసింహశరభఖడ్గకలులాయములు
గండభేరుండాది ఘనమృగాదులును
దండిమై వెరవర్వఁ, దగిలి తోయుచును
గుక్కలవిడుచుచుఁ గోరి పెన్వలలు
నెక్కనఁ జుట్టియు నిబిడాస్త్రసమితిఁ
బొలియించియును మృగంబులఁ గీటణంచి
యలసికృష్ణాజ్జును లరకన్యకకుఁ

జనుదెంచి శీతలజలమాని తీర
మునఁ దరుచ్ఛాయ నిమ్ముల విశ్రమింప;

—: కాళిందీపరిణయము :—

రక్తాబ్జపదతలరాజీవవదన
మౌక్తికమణిదంత ఘనమానసనయన
పులిననితంబ కంబుసమానకంఠ
యావర్తనాభి రథాంగవక్షోజ
శైవాలరోమసంచయ బిసపాణి
యనఁనొప్పు కాళిందియను వరారోహ
చనుదెంచి కృష్ణుని సన్నిధి నిలువ;
వనితసౌభాగ్యలావణ్యచాతుర్య
మమితనేత్రుండై హరిచూచెనంత, 500
నరుఁడింతిఁ గనుఁగొని "వనజాక్షి! ఏఁటి
కరుదెంచితీ వెవ్వాని పల్కుటయును,
మురిపెంపు సిగ్గును మోమున బెరయఁ
దరలాక్షరోచులు దనర నిట్లనియె.
"కాలాత్ముఁడగు సూర్యకన్యక నేను
కాళిందియనుదానఁ గమలాక్షుఁ గూర్చి
తపమాచరింతు నీతటమున, వేఁట
నెపమున(నేతెంచు) నీరజోదరుని
కామించి వచ్చిన కార్యమంచనిన;
ఆమాట మన్నించి హరి తోడుకొనుచు
తరిపురి కేతెంచి కాళిందికన్యఁ
బరిణయంబై రెయిప్పెఁ బద్మలోచనుఁడు.

అర్జును రథసూతుఁడై తోడువచ్చి
నిర్జరాధిపునాజ్ఞ నెదరి ఖాండవము
హుతవాహునునికి నాహుతిగా నొనర్చి
యతనిచే గాండీవమనుపేరి ధనువుఁ
దఱుగని యమ్ములుఁ దరుచరధ్వజము
వఱలెడు రథమును వాజులుఁ దెచ్చి
నరునకు నిచ్చె; నానరుచేత మయుఁడు
దరికొను ఖాండవదహనంబుఁ బాసి 50
బ్రదికి సభామంటపంబును గట్టి
గదయు శంఖమునిచ్చి కడుభక్తి నరిగె.
హరియును రథమెక్కి యతివయుఁ దాను
దరమిడి చనుదెంచె ద్వారకాపురికి;
సాత్యకి నరుతోడ శస్త్రాస్త్రవిద్య
నత్యుదాత్తత నేర్చి హరిఁ గొల్చివచ్చె;
హరియుఁ గాళిందియు నసమాస్త్రకేళి
సరససౌఖ్యక్రీడ సలిపిరింపొంద.

—: మిత్రవిందాపరిణయము :—

వారక నాలో నవంతిభూపతులు
వీరులు విందానువిందులు ప్రేమఁ
దమ ముద్దుచెలియలి ధవళాయతాక్షి
విమలేందువదన సంప్రీడనిదాన
నారూఢలీల స్వయంవరోత్సవము
గారవంబునఁ జేయగాఁ గృష్ణుఁ డెఱిఁగి
చని భూపతులనెల్ల జడిసిపోఁద్రోలి

వనితఁ దోడ్కొని వచ్చె ద్వారకాపురికి

—: సత్యాపరిణయము :—

అగ్నిజిత్తుండను నారాజుతనయ
నగ్నిజిత్తాఖ్య నాయబ్జలోచనుఁడు
కడువేడ్కతోఁ బెండ్లిగానిచ్చఁ గోరి
కడఁకఁ గోసలపతికడ కేఁగె నతఁడు. 520
కొనకొని హరి నెదుర్కొని తోడుకొనుచుఁ
జని యిష్టపూజల సంప్రీతుఁ జేసి
"కారుణ్యగుణపూర్ణ! కల్యాణశీల!
వారిజోదర! లోకవంద్య! శ్రీకృష్ణ!
నాయింటి కరుదెంచి నన్నుమన్నించి
తే. యుగంబులయందు నేఁ గృతార్థుండ
నేమివిచ్చేసితి రెరిగింపు" మనినఁ
దామరసాక్షుఁడాతనికిట్లు జెప్పె.
"నీకూఁతు సత్య నున్నిద్రాంబుజాక్షి
మాకు నిమ్మ"నిన నమ్మనుజేంద్రుఁ డనియె.
"శౌరి! నీవు మాయింటి యల్లుండవౌట
పరమకౌతుకము మాబంధులకెల్ల
నీపట్టణంబున నేడు శాశ్వతము
ఏపారు నురు వృషభేంద్రంబు లిట్లు
శాతశృంగోత్తుంగ చటులసత్వమున
భూతలాధీశులఁ బొలియించుచుండు
వాని నేడింటిని వసుధపైఁ గూల్చు
వానికిఁ గాని యీవనిత నీననుచు

నాక వెఱ్ఱితనమున నున్నాఁడ గాక
యకలంక ! నీకంటె నధికులు గలరె ? 530
ఈకొని యుంకువ యిద్ది యొండొల్ల
నీకసాధ్యంబేది ? నీరజోదరుఁడ !
అనిలోన నాఁబోతు లన్నింటి నడఁచి
పెనుపార కన్యఁ బెండ్లిఁగమ్ము''నిన ;
హరి యేడురూపుల నాఁబోతుఁ గమిసి
పగువడి లేఁద్రాటఁ బట్టి బంధించి
ధరఁ గూల్చి పేర్చిన దైత్యారిఁ జూచి
పురజనులద్భుతంబును బొంది చూడ
నాపౌర ... నులంబుజోదరుని
... సొరిదిఁ బూజి ...
నీకృష్ణుఁ డిట దాన యేతెంచి పొందు
నీకిన్యసౌభాగ్య మెట్టిదో యనఁగ !
శుభలగ్న ... సుందరీతిలక
నభినవంబుగఁ బెండ్లియయ్యె మురారి.
అతిసంభ్రమంబున నాగ్నసలేంద్రుఁ
డతిశయంబుగఁ గన్యకరణంబుగాఁగఁ
బదివేలు గోవులఁ బదివేలు కరుల
విదితంబుగా మూఁడువేల యింతులను
జటులవాహముల వింశతిసహస్రముల
పటుశతాంగంబులు పదివేలనిచ్చి 540
యనిచి పుత్తేరంగ నంబుజోదరుఁడు
వనితఁ దోడ్కొని ద్వారవతికేఁగుదెంచి
సత్యయుఁ దానును సౌభాగ్యలీల

సత్యాదా త్తత సుఖంబందె మురారి

—: శ్రీకృష్ణుఁడు భద్రనులక్షణను వివాహమాడుట :—

ఘాని కేకయరాజపుత్రిని భద్ర
మేనత్తకూఁతు నర్మిలిఁ బెండ్లియయ్యె.
మరి స్వయంవరమున మద్రదేశతనయ
నరమి లక్షణఁ బెండ్లియయ్యె మురారి.
వఱలు రుక్మిణి జాంబవతి సత్యభామ
మెఱయు కాళిందియు మిత్రవిందయును
సత్యయు భద్రలక్షణయును ననఁగ
నష్యాదాత్తత భామలయ్యెనమంద్రు
పట్టపుదేవులై భాసిల్లుచుండ
నట్టన నరకుని నిర్జించి శౌరి
వెలఁతుల పదియాఱు వేలను దెచ్చి
యెలమి పెండ్లయ్యె నంచిట్లు సెప్పఁ యు ;
నరకుఁడెవ్వఁడు ? వానినలినాక్షుఁడేలఁ
బరిమార్చె ? నెక్కడి పడఁతులు వారు ?
ఈకథ నెఱుఁగింపుమని వేఁడుటయును
జేకొని శుకయోగి చెప్పంగఁ దొడఁగె. 550

—: నరకాసురుని వృత్తాంతము —

ధరణీసుతుఁడు నుద్ధత బాహుబలుఁడు
నరకాహ్వయుండు దానవకులేశ్వరుఁడు
వరశక్తిమహిమ దుర్వారసత్వమున
ధరణిపైఁ గలరాజతతి నెల్ల నోర్చి

తనశాసనంబులఁ దగనిల్పి యంతఁ
దనివోక యతిఁ లోదగ్రుఁడై నడచి
యసురాధిపతిఁగెల్చి యగ్ని నోడించి
శమనుని గెల్చి రాక్షసుఁ బారద్రోలి
వరుణుగర్వము మాన్పి వాయువుఁ బఱపి
హరి కుబేరుని ద్రోలి భూతేశుఁ గిట్టి
వనధీశుపాశంబు వజ్రివజ్రంబు
ధనదుని పెన్నిధుల్ తనసొమ్ముగాఁగ
నదితికుండలములు హరియించి యెందు
నెదురెవ్వరునులేక యేపు దీపించి
ప్రాగ్జ్యోతిషంబుగాఁ బరఁగు (దుర్గాన)
దిగ్గేయశక్తి వర్తింపుచో నంత;

—: దేవేంద్రాదులచేఁ బ్రార్థింపఁబడి శ్రీకృష్ణుఁడు నరకునిపై దండెత్తుట :—

దేవేంద్రుఁడును సర్వదిక్పాలకులును
గోవిందుతో నర్థిఁ గూడి చెప్పుటయు
విని సత్యభామతో విహగంబు నెక్కి
చనుదెంచి ప్రాగ్జ్యోతిషము మీఁద శౌరి 510
గిరిదుర్గమంబు నగ్నిపరీతమగుచు
మురమంత్రబహుపాశములఁ జుట్టివచ్చి
పరులకభేద్యమై పరగు నప్పురికి
నరుదెంచి పాంచజన్యధ్వాన మెసఁగ
నార్చిన నతిభీమణార్చులు నిగుడ
పేర్చి మిన్నందిన భేదింపరాక

హరి శార్ఙ్గమెక్కిడి యయ్యగ్నిఁ జల్లార్చి
కులిశబాణంబునఁ గోటలుఁ గూల్చి
బలువిడి మురయంత్రపాశంబులడఁచి
దానవసేనలు దఱిమి పైఁగడవ
నానాస్త్రములఁ ద్రుంచె నలినాక్షుఁడంత;

—: మురాసురసంహారము :—

అంతయుఁ గని మురుఁడతిరౌద్రమెసఁగ
నంతకాకారుఁడై యైదుమోములను
ఘనరోషవిస్ఫులింగములుప్పతిల్ల
సునిశిత కీలాగ్రశూలంబుఁ గ్రాలఁ
గలుపించి జగములొక్కట మ్రింగఁజూచు
ప్రళయకాలమునాఁటి ఫాలాక్షుఁడనఁగ
దట్టించి హుంకారధ్వని దిక్కులగల
నట్టహాసము సేసి హరిమీఁదఁ గవిసె. 570
జ్వాలాకరాళజిహ్వమగుశూలాన
వ్యాళాహీంద్రమను నైచె తాఁగదసి
కడుఁ బేర్చి నిసితమార్గణములు మూఁడు
తొడిగి శూలంబుఁ దుత్తునియలు చేసె.
నురుశరాష్టకమున నురమాడ నేయఁ
దిరుగక దైత్యుఁడు తీవ్రకోపమున
హరిపై మహాశక్తి నదరింప శౌరి
శరములు మూఁట జర్ఝరితంబు సేయ
గడఁగొని లయకాలకాలుఁడు వోలె
చదియఁ బక్షీంద్రు వక్షము వ్రేయుటయును

హరి నందకంబెత్తి యమ్మురాసురుని
కరమును గదయును ఖండించివైచె.
యాదవోత్తముఁడు చక్రాభీలధార
నైదు శిరంబుల నవలీలఁ గనుమ
బలభేదిచేఁ గూలు పర్వతంబనఁగ
నలవరి మురదైత్యుఁడవనిపైఁగూలె.

—: మురాసురుని పుత్రులు తామ్రాదుల యుద్ధము :—

ఆమురాసురపుత్రులైన తామ్రాదు
లాసుకుందుని మీఁద నందంద కవిసి
కరవాలకుంతలముద్గరభిండివాల
పరశుతోమరగదాపాశశక్తులను 580
బలములుఁ దారును బాణజాలముల
బలువిడి గురియించి పక్షీంద్రుమేను
హరిమేను నొ (ప్పింపహరియుఁగోపించి)
కరములఁ ద్రెవ్వ యంగంబులఁ దునిమి
బరులు ద్రక్కలు వాపి రథములు మురిసి
శిరములు...............వగిలి
యెమ్ములు చిద్రుపలై యెఱచులు చదిపి
యమ్ములు పొడిపొడియై జోళ్లు విఱిచి
కరుల.....................
............రవరలై ధాత్రిదొరగ
యందంద మేనులు నన్నిచందములఁ
జిందువందె హతశేషులు వఱవ

## —: నరకాసురుని యుద్ధము :—

......చ్చి నరకుండు గ్రస్యా_ర్తిదనర
మకుటకు డలదీప్తి మలయుచు నిగుడ
నగణితకటకహారాది............
...రుకేత: కాంతి దళదళ వెలుఁగ
చరమాద్రిపైఁ బొల్చు సప్తాశ్వుఁడనఁగ
యరదంబు.............. ..
..............రాక్షసు మాడ్కి
హరిఁదాకి పెల్లేసె నమరులు దలఁక 590
శౌరియాతని యంపజడి మాన్పి రెండు
నా..................
...... ........డిసోలి గొబ్బున లేచి
యార్చి మహాశూలమంకించి నైవ
నెదువంశవల్లభుఁడాజు బాణముల
న..............లుగమ్ములు జొనిపె
గరుడుని రెక్కలు కసరంద నేయ
నురగారి పటునఖోద్ధూతఘట్టనలఁ
(గదియుచు) నదియును ఖండించె; శౌరి
త్రిదశులు భీతిల్ల దిక్కులల్లాడ
ప్రళయభానుప్రభాపావకశిఖల
....................,
(దను) జాధిపుని మేను దారించి శిరము
ఘనతీవ్రధారను ఖండించుటయును
మండితమణిదీప్తి మకు.........,
.......................,

(క్రూ)రాత్ముఁడగు నరకుఁడు గూలుటయును
బోరన మందారపుష్పవర్షములు
దివిజులు...................,
...............వినువీధిఁ బొలిచె. 600

—: భూదేవి తనకుమారుఁడు నరకుని చావునకై దుః
ఖించుట :—

తనయుఁడు గూలిన ధారుణి దుఃఖ
వనరాశిలో మున్గి వనమాలి (బ్రోల
కటక తాటంక కంకణచారుహార
పటురత్నభూషణప్రభలు శోభిల్ల
వరుణాతపత్రంబు వాసవజనని
యురుతరకుండలయుగళంబుఁ దెచ్చి
హరికి సమర్పించి............,
పరమానురక్తిమైఁ బ్రార్థింపఁ దొడఁగె

—: భూదేవి శ్రీకృష్ణుని ప్రార్థించుట :—

శ్రీనాథ! గోవింద! శ్రీవత్సచిహ్న!
భానువత్సంకాశ! భక్తలోకేశ!
కంబుచక్రగదాశిఘనశార్ఙ్గహస్త!
అంబుజనాభ! పీతాంబరాభరణ!
విశ్వవిశ్వంభర! విశ్వైకజనక!
శాశ్వత! సర్వజ్ఞ! సర్వలోకేశ!
[1]నీలామనోనాథ! నిఖిలాండనాథ!

---
[1] ఒకపాదమున్నది.

ఉరురజోరూపుఁడవై పుట్టింతు జగముఁ
బరమ! సత్త్వస్థితిఁ బాలింతు నీవ
తామసరూపుఁడవై దండింతు నీవ
నీమేన జనియించు నిఖిలభూతములు 610
నవని యప్పులునభమగ్ని వాయువులు
రవిసుధాకరులాత్మ జీవభవులు
సకలేంద్రియంబులు సకలశక్తులును
సకలంబు నీరూపు చర్చింపఁ జూడ!
పూర్ణాత్మ! శ్రీకృష్ణ! పురుహూతవంద్య!
నీతత్త్వ మెఱుఁగంగ నేనెంతదాన?
నరకుండు నీదయ నాకుద్భవించు
వరపుత్రుఁడీతఁడు వరశక్తిపేర్మి
దేవతాద్రోహియై తెగియె నీచేత
దైవీక మెవ్వంరికిఁ దప్పింపరాదు!
కావున నితనికి గలిగె నీలోక
మేవిధంబున ధన్యుఁడిది లెస్సయయ్యె!
దురితారి! వానిపుత్రుఁడు భగదత్తుఁ
గరుణించి నీవ యిక్కడ ప్రతిష్ఠింపు''.
మని మ్రొక్కి ధరణి జయాంకమై బఱఁగు
వనమాల మురవైరి వక్షంబునందు
పూజించి వీడ్కొని భూదేవి చనియె.

—: పదియాఱువేల గోపికలను శ్రీకృష్ణుఁడు పెండ్లియాడుట :—

రాజీవనేత్రుఁడు రమణీయమూర్తి

నరకునింటికి నేఁగి నరసిద్ధసాధ్య
సురయక్షగంధర్వసుదతులఁ దెచ్చి 620
యతఁడేకపరి పెండ్లియాడెడు వేడ్క
జతనంబు సేసిన జలజాతముఖుల
వెలఁదులఁ బదియాఱువేలనూఱ్వురను
జలజోదరుఁడు జూచి సంతసంబందె.
ఆకన్యకలమూపు లక్షాక్షుమీఁన
దాఁకెం జెంగల్వదండలై యొప్పె;
జలజాక్షురూప మాజలజాతముఖులు
తలలెత్తి యందంద తమకించి చూడ
దినకరోదయబింబదీప్తమౌ కంజ
వనము చందంబున వదనంబులొప్పె;
పొలఁతుల నందలంబులఁ బెట్టి శౌరి
పొలుపార ద్వారకాపురికిఁ బుత్తెంచె.
వరుణుని ఛత్రంబు వరుణునికిచ్చె;
సురదంతి హయమును సురపతికిచ్చె;
ధనపతి నిధుల నాతనికిచ్చి వుచ్చె;
వనజోదరుఁడు భక్తవత్సలుఁ డంత
నగణితప్రీతిమై నభయంబు లిచ్చి
భగదత్తు నప్పురి పట్టంబుగట్టి

—: శ్రీకృష్ణుని యమరావతీప్రవేశము :—

ప్రమదంబుతో సత్యభామయుఁ దాను
నమరావతికి వచ్చె నమరారివైరి. 630
హరిఁజూచు వేడుక నా పట్టణంపు

తఱుణు లొందురులకుఁ దమకంబు లొదవ
పలకారిచూపు నీవాళ్లుగాఁ జేసి
యాలోకగురుఁజూచి రందంద వచ్చి;
పొలఁతుల చూపు లప్సరవీథులందుఁ
గలువతోరణములు గట్టినట్లొప్పె;
భామల కన్నులపండువై సత్య
భామయుఁ దానును బక్షీంద్రు నెక్కి
నాఁ తేర నింద్రుఁడు యెదురేఁగి శౌరిఁ
దోతెంచి పూజలఁ దృప్తిగావించె;
హరి కుండలంబులయ్యదితికి నిచ్చి
పరమానురక్తి సంభావించి మ్రొక్కె;
నా దేవమాతయు నంబుజోదరుని
నాదట దీవించి యక్కునఁ జేర్చి
శచియు నింద్రుఁడు పరిచర్యలు సేయ
నచలితసౌఖ్యాత్ముఁడై యుండె నంత.

—ః పారిజాతాపహరణము ః—

సత్యభామయుఁ బారిజాతంబుఁ జూచి
నత్యుదాత్తతఁ బ్రీతి హరి వేఁడుటయును ;
వేగంబె శౌరి యావృక్షంబుఁ బెఱికి
నాగారిపై నిడి నాతియుఁ దాను 640
ద్వారకాపురికేఁగ వాసవుఁ డెఱిఁగి
యైరావతారూఢుఁడై దేవకోటి
కొలువంగ వలచేతఁ గులిశంబుఁ దాల్చి
బలువిడి నార్చుచుఁ బద్మాక్షుఁ డాఁకె.

—: ఇంద్రుఁడు శ్రీకృష్ణునితో యుద్ధముఁ జేయుట :—

అనలకృతాంతనైరృత్యాధీశ వరుణ
యనిలకుబేరభూతాధీశవరులు
తమవాహనముల నుద్ధతి నెక్కి పేర్చి
కమలాక్షుఁ దాఁకిరి కరముగ్రవృత్తి;
నార్పుల బొబ్బల నట్టహాసముల
దర్పించి కవిసి రాదనుజారి మీఁద
వ్రేసియుఁ బొడిచియు వివిధబాణముల
నేసియు నొప్పింప నిందిరావిభుఁడు
పారిజాతముతోడఁ బక్షీంద్రుతోడ
వారిజాననతోడ వరశక్తి దిరిగి
పటుశార్ఙ్గనిర్ముక్తబాణజాలముల
చటులతఁ జూపి నిర్జరసేనఁ బఱపి
యమరాధిపతి నొంచి యనలుఁ జల్లార్చి
సమవర్తి గెలిచి రాక్షసుని నిర్జించి
వరుణుబీరము మాన్పి వాయువుఁ బఱపి
నరవాహు గెలిచి పినాకి స్రుక్కించి 650
బృందారకశ్రేణిఁ బెఱికి యందంద
యందఱి గెలిచి తా నేఁగె ద్వారకకు.
పారిజాతము సత్యభామ గేహమున
నారూఢగతి నిల్పి యతిసౌఖ్యమైన
శుభముహూర్తమున భూసురులు దీవింప
నభినుతులొనరింప నంబుజోదరుఁడు
పదియాఱు వేవురు పంకజాననల
వదలని వేడ్క వివాహమై పేర్చి

కరిదంతముల నవకంబైన తలుపు
సగడంపు గడపలు పసిండికోడెలును
నిగిడిన వజ్రాల నెగడిన గడియ
మేలైన కెంబట్టు మేల్కట్టు మెఱుంగు
నాణవట్టంబును నడపసంబెళయుఁ
కస్తూరిగంధమంగళధూపమును
శస్తమై తగు నుల్లసాలలు నొప్పె.

—: శ్రీకృష్ణునికి రుక్మిణి రాజోపచారములు గావించుట :—

సంసారసౌఖ్యరసాయనంబైన
హంసతూలికపాన్పునందున్నయట్టి
శౌరికి రాజోపచారకృత్యములు
వారకఁ గావించి పైదర్భి వేడ్క. 670
కర్పూరమిశ్రితక్రముకభాగముల
నేర్పార వాసించి నిండారు వేడ్కఁ
కంకణస్వనములు గలయంగఁ గులికి
యంకించి చేచాఁచి యఱచేతికిచ్చి
ధవళతాంబూలపత్రముఁ గొనగోర
నవరించి చూర్ణమిశ్రము సేసి మడిచి
చిటపాట మేళఁబు నేసి యొప్పుచును
జటికవెట్టినమాత్రఁ [illegible]తికందించు;
స్తనకుంభములను మాధవు పాదతలముఁ
దనకారనొత్తు మొత్తని కేల లీలఁ
గరకంకణంబులు ఘల్లుఘల్లనఁగఁ

గరమూలరుచులు దగద్ధగ మెఱయ
గుఱుకుచములురాయఁ గురులు ఫాలమున
నొరయ హారావలులుయ్యాలలూఁగ
పయ్యెద వడిజారఁ బాలిండ్లు తళుకు
లెయ్యెడఁ దా మెఱ్ఱై యిరువంకఁబొడమ
కన్నులమెఱుఁగు లక్కజముగాఁ బొలయ
చిన్నిచెక్కులచెంతఁ జెమటలు వొడమ
దంతమరీచులఁ దఱమిల్లు నవ్వు
వింతయై మోమున వెన్నెలఁగాయ 680
లీలఁ దాటంకపాళికి వెల్లఁకదియ
తాలవృంతంబు మోత్తని కేల బూని
యల్లల్లఁజూచుచు హరిమూపుగముల

—: శ్రీకృష్ణుఁడు రుక్మిణిచిత్తమును శోధించుట :—

కెల్ల నింపొదవించు నింతి నెమ్మనముఁ
గనుఁగొను వేడుకఁ గలుషించినట్లు
వనజాతనేత్రుఁ డవ్వనిత కిట్లనియె.
" రాజన్యుని విదర్భరాజు కూఁతురవు!
భూజనులెల్లర పొగడొందునట్టి
లావణ్యభాగ్యవిలాసచాతుర్య
వీ వసుంధర నీకు నీడు లేదెందు!
పరగు మాగధచైద్యపౌండ్రాదినృపులు
వరరూపభాగ్యలావణ్యసంపన్ను
లారూఢసామ్రాజ్యలతులవిక్రములు
వారలు నినుఁగోరి వచ్చిన చోట

నందఱు నొల్లక యతిహీనకులుని
మందలోఁ బెఱిగిన మలినాంగు భీరు
నాచారదూరుని నన్నృతవర్తనుని
యేచూపుఁ జూచి నన్నేల కామించి
తాదిగర్భేశ్వరి వక్కటా! పుట్టు
బీదను! ననునీవు పెండ్లిగాఁ దగునె? 690
మీాయన్న రుక్మి మామీాఁది క్రౌర్యంబుఁ
బాయఁడు; మీ తండ్రి పగవాఁడు నాకు;
నీవును నామీాఁద నెయ్యంబు లేవు
కావున నీయింటి కడకు నీ వరిగి
వలనొప్పఁ గన్నిచ్చు వచ్చినవారిఁ
గలసి భోగించుము కమలాస్య!'' అనిన
నామాఁట తనకు నమ్మె తాఁకటయును
భామినీమణి డిల్లపడి మూర్ఛ మునిఁగె!
నుడివడి చేనున్న సురటల్ల జాఱఁ
దొడిగిన సొమ్ములు తొడుసాడి పడఁగఁ
దన్ను దానెఱుఁగక ధరఁ వ్రాలియున్న

—: మూర్ఛపోయిన రుక్మిణిని శ్రీకృష్ణుఁడోదార్చుట :—

యన్నాతిఁగనుఁగొని యంబుజోదరుఁడు
సరభసంబున లేచి సతినల్ల నెత్తి
కరముఁ గౌఁగిటఁ జేర్చి కన్నీరుఁ దుడిచి
చెక్కిలి నొక్కి చికురముల్ దుఱిమి
యక్కటికముతో నక్కాంత కనియె.
''నవ్వులాలకు నన్న నామాట కిఁత

నివ్వెఁగపడి వ్రాల నీకేల యింతి?
ఎలనాఁగ! నీచిత్త మెఱిఁగెడి కొఱకు
పలికితిఁగాని నాప్రాణంబు నీవ! 700
పరమసాధ్వివి నీవు భయభక్తులందు
నెరసులేకున్కి నే (నెంతొ భాగ్యశాలి)
ఇమ్ముల ననుఁబాయ కేప్రొద్దు నుండు
నమ్మహాలక్ష్మి నీవంభోజనయన!
అని పర్యంకశయ్యపై నల్లనఁ జేర్చి.
యనునయంబున దేర్చి యబలకుఁ దార్చి
సరసరతిక్రీడ సంతుష్టఁ జేసి
పరమపావనమూర్తి పంకజోదరుఁడు
కందర్పకోటి సంకాశలావణ్యుఁ
డిందిరావిభుఁడు లోకైకశరణ్యుఁ
డారసి యందఱి కన్నిరూపముల
సారతిక్రీడల సతతంబుఁ దేల్చె.

— ప్రద్యుమ్నాదికుమారజననవృత్తాంతము :—

హరికి రుక్మిణికిని నగ్రనందనుఁడు
పరమానురక్తుఁడై ప్రద్యుమ్నుఁ డట్టి
వీరుఁడు మొదలుగా వినుస మేష్ణుఁడును
జారువేష్టుండును జారుదేహుండు
జారుగుప్తుండును జారుచంద్రుండు
జారుహాస్తుండును జారువీర్యుండు
[1]జారుధీమణి విచారుఁడు బదురు; 710

---

[1] ఒకేపాదమున్నది

జాంబవతీకాంత చతురతఁ గాంచె
సాంబాది దశకంబు సత్పుత్రవరుల;
భానుమంతాదులఁ బదురు కుమాళ్ల
మానుగా సత్యభామకుఁ బుట్టిరెలమి;
భానుచంద్రాదులు పదురు కుమాళ్లు
శ్రీనిత్యయగు నాగ్నజితి కుద్భవిలిరి;
మిత్రవిందకు ప్రభామిత్రులు సుతులు
గాత్రవంతాదులు గలిగిరి పదురు;
కాళి దకామిని కనియెఁ బెంపొంద
బాలశ్రుతాదులఁ బుత్రులఁ బదుర;
భద్రకుఁ బుట్టిరి భద్రాదిసుతులు
భద్రమూర్తులు [illegible] గులు పదురు;
సత్యభాషిణి గాంచె సంతతిఁ బదుర
సాత్యకి మొదలైన సత్పుత్ర వరుల;
వెలఁదులు పదియారువేలునూర్వురును
తలతలఁ బదిరేసి తనయులఁ గనిరి.
వినుతింపఁ బదియారువేలును నూట
యెనమండ్రుభార్యల కేపారుపుత్రు
లాయెడ లక్షయు నలువదియెనిమి
దేయును నెనమండ్రు విష్ణుని సుతులు. 720
కన్యలు నండఱు కల్యాణమతులు
ధన్యమై కృష్ణు సంతానంబు నిగుడ
వారలసుతపౌత్రవర్గంబు సంఖ్య
వారిజాసనుఁడైన వర్ణింపనేర
డట రుక్మపుత్రిక యగు రుక్మవతికిఁ

బటుతరంబగు వేడ్క ప్రద్యుమ్ను వలన
ననిరుద్ధుఁడుదయించె నని చెప్పుటయును
మునినాథ! ఈరుక్మి మురవైరితోడ
వైరంబు మానఁడు వరపుత్రి నెట్లు
శౌరిపుత్రునకిచ్చి సాజన్యుఁడయ్యె?
నీ వెఱుఁగని దేమి? నిఖిల లోకముల
లే వెఱింగింపు లాలితపుణ్య యనుఁడు ;
శుకుఁడు పరీక్షిత్తుఁజూచి [illegible]
మకలంకగతి వినుమని చెప్పఁదొడఁగె.
ఆకృష్ణుతో వైరమయ్యును రుక్మి
తూఁగొని చెలియలితోడి నెయ్యమున

—: అనిరుద్ధుని వివాహము - కలహము :—

మేనల్లుఁడనుచు నర్మిలి కూఁతు నిచ్చె
గాని నెమ్మనములు గలయవెన్నఁడు ;
ఆరామన దను కనిరుద్ధునకును
నారూఢిఁ దన పౌత్రి నగు లోలనేత్రి 780
లోచన యను కన్య రుక్మి యిచ్చుటయు;
ఆచెలి పెండ్లికై విదర్భకును
యానకదుందుభిహలికృష్ణమదన
సైనేయకృతవర్మసాంబాదులైన
బంధులతో వచ్చి బహువైభవమున
బంధురప్రీతి శోభన మొప్పఁజేసె.
కుడిచి కూర్చుండి పెక్కులు వినోదములు
గడువేడ్కఁ జూచుచోఁ గాళిందివిభుఁడు

నారుక్మియును గూడ హలపాణితోడఁ
గోరి జూజము సమకొలిపి యాడించి
భాగంబు దానయ్యె పణముగా నొడ్డి
వేగంబె మాడలు వేయేసి గెలిచి
కై లాటములు జేసి కల్లంబు వెనచి
తాలాంకుఁ గెలిచిరందఱుఁ దచ్చు సేసి.
ఓడియు బలభద్రుఁడుడుగక లక్ష
మాడలు పణమొడ్డి మరిగెల్చుటయును;
ఆవిధర్ముఁడు గెల్చె ననుచు నొండొరులు
చేవేసి నవ్వుచు సీరి నీక్షింపఁ
దాలాంకుఁ డదరి యుత్తాలరోషమునఁ
గాళిందిపతి మోముఁ గనుఁగొని పలికె 740
"పాపాత్ములార! ఈపలుక నాగెలుపౌ?
ఏపార వైదుర్యుఁ డిటు గెల్చినాఁడో?
ఉన్న రూపెఱుఁగింపుఁడొక పక్షమేల?"
అన్న బ్రలంభారి కనియె నారుక్మి.
"గోపాలకులు మీరు! గొల్ల జూదములు
నేపార నొండురు లెగ్గులాడుటయుఁ
గాక! ఈరాచ యోగ్యంబైన యాట
మీ కేల? వడి లేచి మిన్నక పొమ్ము!
మాడలోడితి మని మాటిమాటికిని
గాడఁ నాడిన నీకుఁ గలదయ్య గెలుపు?
కడపి యాడుటగాదు కాక యేమేని
నడుగరాదే మమ్ము నక్కఱయేని?"

—: బలరాముఁడు రుక్మిని జూదవుఫలక నెత్తి కొట్టి చంపుట :—

అనిపల్కి ప్రహసించి యార్చువైదర్భుఁ
గని సీరి మిడుగులు కన్నులఁదొలుఁగఁ
బటుకోపమున నెత్తి పలక వేత్రిప్పి
నిటలంబు వ్రేయఁ బెన్నెత్తురు దొఱఁగి
వెడవెడ మిడిగ్రుడ్లు వెడలి రోఁజుచును
పడితన్నుకొని రుక్మి ప్రాణంబు విడిచె!
కాళింగుఁ జంపి యక్కడి ధూర్తసమితిఁ
ద్రోలిన నందఱుఁ దుప్పలఁ దూలి 750
పులిగన్న పసులను బోలి వైదర్భు
బలము భీతిల్ల సంభ్రమమేచఁ బఱచె;
హరివచ్చి దేమి దేమని చూచుచుండ
నరదంబు వెసనెక్కి హలధరుఁడంత
లోచనతో ననిరుద్ధు నెక్కించి
వేచని యాపురి వెలవెల నున్న
నారుక్మి మడియుట నెంతయు నెఱిఁగి
శౌరి సీరినిగూడి చనియె ద్వారకకు;
అరసి దుఃఖాక్రాంతయైన రుక్మిణిని
గరమర్థిఁ గుందార్చెఁ గమలలోచనుఁడు.

—: బాణాసురవృత్తాంతము :—

ఆలోన బలిదానవాధీశసుతుఁడు
వ్యాళేంద్రసదృశుఁడు వేచేతివాఁడు
నారూఢజయశాలి యరిశైలవజ్రి

భూరిప్రతాపుఁడద్భుత బలోన్నతుఁడు
బాణాసురుఁడు తపోబలముల పేర్మి
స్థాణుని మెప్పించి తనపురంబునకుఁ
దననివాసమున కాతని రక్షసేసి
యనుపమజయకీర్తులంది పెంపొందె.

—: బాణాసురుఁడు శ్రీశంకరునికిఁ దనయుద్ధకాంక్షఁ దెలిపి ప్రార్థించుట :—

అతఁడు గర్వాంధుఁడై యొక్కనాఁడు
భూతేశుపాదాబ్జముల మీఁద వ్రాలి 760
వినతుఁడై చేతులు వేయును మొగిచి
యనుకంపఁ దోఁప నిట్లని విన్నవించె.
"దేవ! మహాదేవ! దేవతారాధ్య!
భావజసంహార! భక్తమందార!
నీవు ప్రసాదింప నిఖిలరాజ్యములు
నీ వేయిచేతులు నివినాకుఁగలిగె!
అవనిలో నాకంటె నధికుఁడు లేమి
నివి వృథాకథలయ్యె నిభచర్మవసన!
తురగఖురోద్ధూతధూళి పెల్లగయు
దురములోఁ దురగంబుఁ ద్రోలంగ లేదు;
మండితదోర్దండమండలాగ్రమునఁ
జెండాడి పగతులఁ జిక్కింప లేదు;
చటులకార్ముకముక్తశరపరంపరలఁ
బటుమాంస మూర్వికి బలిసేయ లేదు;
తంతికోతండ! గదాతాటనముల

దంతికుంభముల విదారింపలేదు ;
వీరరక్తంబుల వేతాళసమితి
నారూఢగతి నోలలాడింపలేదు ;
ఱొఱపైన నృపలోకముదుశరీరముల
మెఱసి ఢాకినులకు మేపఁగలేదు ; 770
నీయాన ! రణకేళి నెరపంగలేదు !
వేయిచేతులు మోవ విసమయ్యెనాకు
కలన మీరెదుశక్తి కలిగియు లేని
ఫలమయ్యె ముచ్చటబాపవే తండ్రి !"
అని గబ్బుమైనాడ నసురమాటలకుఁ
గినిసి యల్లననవ్వి గిరిజేశుఁడనియె.
"నీవేమి సేయుదు నీపాలిదైవ
మీవిధిఁ బ్రేరింప నిట్లంటిగాక !
దురములోపల 'నిన్నుఁదొడరి నీవేయి
కరముల ద్రేఁగు నొక్కట మాన్పనోపు
అలఘువిక్రమశాలి యే శేరగలఁడు ;
తలఁచిన నీకోర్కి తలకూడగలదు.
తప్పక నీకేతుదండంబు విఱిగి
యెప్పుడు ధరఁగూలు నెఱుఁగు మద్దినము
నను మోచు సట్టి రణంబుగాగలదు.
మనములో నెఱిఁగి యేమరక వర్తింపు"
మని వీడుకొలిపిన హరునకు మ్రొక్కి
చని సంగరోద్యోగచతురుఁడై యుండె.

—: బాణాసురపుత్రి ఉషాకన్య స్వప్నములో
నని రుద్ధునిఁ గూడుట :—

ఆబాణనందన యతిరూప హరిణ
శాబాక్షి కలకంఠి సమదేభగమన 780
కమలకోమలనేత్రి కరివైరిమధ్య
భ్రమరసన్నిభవేణి పంకేరుహాస్య
కంబుకంధర మౌక్తికాకుందదంత
బింబఫలాధరి బిసలతాపాణి
యననొప్పి కందర్పునసిపుత్రివోలె
తనరు యుషాకన్య దానొక్కనాఁడు
పొలుపారు మేడపై పువ్వుపానుపున
నలవడి నిద్రితయై యున్నచోట ;
కలలోన నొక్కచక్కని రాచకొడుకు
జలజాతనేత్రుఁడు సౌభాగ్యమూర్తి
తను డాయవచ్చి మెత్తని కేలుఁగేల
ననువొప్పఁ గీలించి యంగంబు నిమిరి
యల్లనఁ గౌఁగిట నందంద చేర్చి
యుల్లాసరసవార్ధి నోలలాడింప
నంతట మేల్కాంచి యబలచిత్తమున
సంతోషమును సిగ్గు జళుకును బొడమ ;

—: ఉషాకన్య విరహము :—

కలలోని సేఁత నిక్కముగాఁగ దలఁచి
కళవళపడు మేను గరుపార నిలుచు ;

దిక్కులుపరికింపుఁ దెసలియారూప
మెక్కడఁబొడఁగాన కెంతయు వగచి ; 790
కోలఁదినై ప్రహ్లాదకులపయోరాశి
కలఁపఁగాఁబుట్టిన కట్టడినైతి ;
ఏమని యెఱిఁగింతు నీమాటలోరుల
కేమిగాఁగలదకో · ఇటమీఁద'' ననుచుఁ
గలఁగుఁ జేట్పాటున కడు చిన్నబోవు ;
పలుకనేరక డిల్లపడు ; మారుమాటఁ
బొరిపొరి నాలించుఁ బువ్వుపాన్పునను
బొరలు గ్రమ్మఱ నిద్రవోచూచు లేచు ;
ఎలుఁగెత్తి యిందురావే యని పిలుచు ;
తలపులోనున్న యాతని రమ్యమూర్తిఁ
దలపోయుఁ దలయూఁచుఁ దన్నుఁదా మఱచు ;
వలరాజు చెలిమికి వంతలోఁగుందుఁ
జెక్కునఁ జెయిఁజేర్చి చింతించునంత
నెక్కొన్నఁదగ వేఁడి నిట్టూర్పు పుచ్చు ;
నొగలు ; హాయనుచుఁ గన్నుల నీరునించు ;
మొగమెత్తకంగుటంబున నేలవ్రాయు ;
పులకించు ; చమరించుఁ బొరిమూర్ఛఁబోవు ;
అలుగు ; నాతని యొప్పు నంతంత పొగడు ;
పొరి కాముఁడాడించు బొమ్మచందమునఁ
బరవశయై పంచబాణాగ్నిశిఖల 800
కగ్గమై యందంద యాఱడిపొందు ;
దిగ్గనలేచి భీతిల్లి శయ్యవ్రాలు ;
గోరికెలాంతనిఁ గోరి రేకెత్తఁ

గూరుకుఁ గానక కొండలమందు.
ఈభంగి మదనాగ్ని నెరియుచు నున్న
నాభామ చెలియ కుంభాండునిపుత్రి
చిత్రరేఖనుపేరఁ జెన్నారు లేమ
మైత్రివాటించి యమ్మగువకిట్లనియె.

—: చిత్రరేఖ ఉషాకన్యను నూరార్చుట :—

" ఇదియేమి నీచంద మెలదీగబోఁడి?
మదిలోన నీకింత మఱఁగ నేమిటికి?
ఏల చింతించెద వేల మూర్ఛిల్లి
యేలనారటఁ బొందెదిభరాజగమన?
పురుషుఁడు నీతోడ భోగించినట్టి
మురిపంబుదోఁచె నీమోముదామెరను
బారిఁ బోతుటీఁగకుఁ బొలియంగ రాని
వరహర్మ్యమునకు నెవ్వఁడు వచ్చెనబల?
పడుచుకూఁతుర! ఇట్టిపని యెట్లుపుట్టె?
ఎడసేసి నాకేల యెఱిఁగింపవైతి?
ఎవ్వనిఁగనుఁగొంటి వెవ్వనిఁబొంది
తెవ్వఁడు సేసె నేఁడీసాహసంబు? 810
వనిత! నీమదిలోని వగపెల్లఁదీర్తు
నను వింతసేయక నాకెఱిఁగింపు
మనిన నెచ్చెలిఁజూచి హరుషంబు సిగ్గు
ననుకంపయును దోప నయ్యింతిపలికె.

—: ఉషాకన్య చిత్రరేఖతోఁ దనస్వప్న
వృత్తాంతముఁ జెప్పుట :—

"ఈమేడపై నుండి యేనిద్రవోవ
యేమి చెప్పుదు నీకు నిగురాకుఁబోఁడి!
నీలవర్ణమువాఁడు నిడుకేలువాఁడు
వాలారు చూపుల వలనొప్పువాఁడు
రతినాయకునకు నౌరసపుత్రుఁడోకో!
ఇతఁడు నాసౌభాగ్య మేపారుఁవాఁడు
కలలోన నేతెంచి కౌఁగిటఁ జేర్చి
చెలఁగి చిత్తజుకేళిఁ జిక్కించె నన్ను!
ఇతనితోఁ గలసి పేరడిగి మాటాడు
తఱి పాపి నాసిగ్గు దాఁపురంబయ్యె
నంత మేల్కాంటిని యతఁడంతఁ బోక
నంతరంగములోన నడఁగి యున్నాఁడు;
కూడిపాయుట సమకొనెగాని వానిఁ
గూడియుండెడు వేడ్క కొనసాగదయ్యె;
నతనిఁ దోతెకున్న నంగజాస్త్రముల
ధృతిదూలి ప్రాణంబు తెగిపోవఁ గలదు 820
యేమిసేయుదు" నని యిలవ్రాలి యున్న
యామెలంతమగని యానాతి పలికె.

—: చిత్రరేఖ చిత్రపటము వ్రాసి ఉషాకన్యకకుఁ జూపుట :—

కటకటా! కలలోనగన్న రాకొమరు
నెటుపట్టి తేవచ్చునే ముద్దరాల!

ఏతరుణులయందు నిట్టివంటి తలఁపు
యేతెఱంగునఁజూచి యెఱుఁగము వినము,
నీకేల ముచ్చట? నీకేల బెగడ?
నీకేల వెనుఁబడ నీరజవదన?
మూఁడు లోకంబుల మోదితయేఁ దొల్లి
వాడిగా నెఱుఁగని పురుషులు లేరు;
నాకౌసలంబున నరవరోత్తముల
నీకుఁ జూపెదఁ జూడు నిఖిలలోకాన!
వచ్చి పొందిన భూపవరుని నీమ్రోలఁ
దెచ్చి పెట్టెద నింత ధృతిఁ జిక్కఁ బట్టు"
మనిపల్కి నవ్వుచు నాచిత్రరేఖ
పనుపడ నొక చిత్రపటము సంధించి
సకలలోకంబుల జననాథసుతుల
సకలంకమతి వ్రాసి సఖులతో ననియె.
నీతలఁపుననున్న నృపకులోత్తంసుఁ
డే తెఱంగో వ్రాసితిఁ జూడు మనుచు; 830
పాతాళవాసులఁ బన్నగాధిపులఁ
జాతుర్యగుణుల రాక్షసకుమారకుల
నలకూబరాది యున్నతయక్షవరుల
నల జయంతాదుల నమరాధిపుల
గరుడఖేచరసిద్ధగంధర్వవరుల
వరుసతో వేర్వేర వనితకుఁ జూపి;
భూలోకమున రాజపుత్రులఁ జూపి;
ఆలోనఁ గురుపాండవాదులఁ జూపి;
యాదవవీరుల నందఱఁ జూపి;

ఆదినారాయణుఁడగు కృష్ణుఁ జూపి;
అనుమానపడి చూడ నంత ప్రద్యుమ్నుఁ
గని యాతఁ డాతఁడే కాఁబోలు ననుచు
మనములో శంకించి మరియనిరుద్ధుఁ
దనుకాంతి రూపంబుఁ దప్పకఁ జూచి
తలఁపులోపలి కూర్మి తట్టుముట్టాడఁ
బులకించి తిలకించి పూఁబోఁడి పలికె.
"కలలోనఁ గన్న చక్కని వాఁడె వీఁడు!
కలయల్ల నా నిక్కవమయ్యె నేఁడు!
నీ కౌశలంబును నీ దక్షగుణము
నీ కూర్మి పెంపును నీ వచోరతియు 840
నాకంజసూతికి నలవియే పొగడ?
నాకెవ్వరిక దిక్కు నలినాయతాక్షి!"
అని పల్కి యంతంత యతిశయంబైన
మనసిజానలము ప్రేమలసి ముట్టాడఁ
దన్ను దా నెఱుఁగ ధర ద్రాలియున్న
యన్నాతి బోధించి యల్లన నెత్తి
కన్నీరు దుడిచి యంగంబెల్ల నిమిరి
చెన్నార నెయ్యంబుఁ జిలుక నిట్లనియె.

—: చిత్రరేఖ తనమాయచే ననిరుద్ధుని యుపహరించుట :—

"పైదలి! నీదైన భాగ్యంబు కతన
యాదవోత్తముఁడైన హరిపౌత్రుఁడబ్బె!
ఆ సుందరాకారు నర్మిలిఁ దెచ్చి
నీ సమ్ముఖము వేసి నెమ్మి వాటింతు·

వెఱవాయు''మనిపల్కి వెలఁది బోధించి
తెఱవ మాయాగతి దివమున కెగసి
రాజీవనేత్రి సురక్షితంబగుచు
రాజితంబైన ద్వారకకేఁగి యందు
యువిదలతోఁగూడి యుద్యానభూమిఁ
దవిలి రతిక్రీడఁ దనిసి నిద్రించు
యనిరుద్ధుఁ గాంచి మాయలుఁ గొల్పి యెత్తు
కొని వియద్గతి వచ్చి కోర్కులు బొదల 850
బాణతనూజ మంచముక్రేవఁ బంచ

—: అనిరుద్ధుఁడు ఉషాకన్యతోఁ గ్రీడించుట :—

బాణునందను నుంచి ప[illegible]క చనియె.
అనిరుద్ధుఁ డంత మాయానిద్రఁ దెలిసి
కనువిచ్చి పరికించి కనకతల్పమునఁ
దనకు బాహులతఁ దలయాపు సేసి
కనుమోడ్చి ముఖచంద్రకాంతులు వొలయ
జక్కవ కవఁగప్పు జలజమో యనఁగ
నొక్కకేలున నురోజంబు లదిమి
కలయఁ గంకణమణిగణమరీచికల
మలయుచు దనద్యుతి మాయంగఁ జేయఁ
దనబోఁటి మాటలఁ దాపంబుఁ దీరి
మనమూరడిలి యాదమఱచి నిద్రించు
నయ్యుషాసతిఁ గాంచి యంతరంగమున
నెయ్యంపురసముబ్బి నీటులు వొడమ
నంతంత కనుఁగొని యంగజాస్త్రములఁ

గంది నెమ్మదిఁ దమకంబగ్గలింపఁ
గదసి కేలునుగేలుఁ గదియించుటయును;
అదరి మేల్కని లేచి యంగంబు వణఁకఁ
గుచభార మెడలంగఁ గొనసియాడఁ
గుచకుంభములఁ జేల గొంగున నదిమి 860
లక్ష్మీసుతుని రాజ్యలక్ష్మియో యనఁగ
పక్ష్మలలోచన ప్రభలుప్పతిలఁగ
శయ్యపై డిగి నిల్చి జలజాతనేత్రు
నయార్యదవో త్తము నర్థి నీక్షించె.
ఇరువుర చూపులే యేపారఁ దనకు
శరములు గాఁ బంచశరుఁడేయఁ జొచ్చె!
ఆలోన ననిరుద్ధుఁడా లోలనయనఁ
గేలఁగేలునఁ బట్టి గిలిగింత వుచ్చి
చెక్కులు బుడుకుచు సిగ్గుఁ బోగొట్టి
గ్రక్కున నందంద కౌఁగిటఁ జేర్చి
మాటల మఱిగించి మక్కువఁ బెంచి
కూటంబుఁ జవిఁ జూపి కోర్కులు నించి
యిదిరాత్రి యిదిపగలివి సంధ్యప్రొద్దు
లిది వింతతావని యెఱుఁగంగ రాక
యకుటిలక్రీడల నఖలభోగముల
నొకనాల్గు నెలలుండ నొక్కనాఁ డెఱిఁగి

—: అంతఃపురవాసులు బాణాసురునకు ననిరుద్ధుని గుఱించి తెలియపర్చుట :—

యంతఃపురజనాళి యరిగి బాణునకు

నంతయు నెటిఁగింప నతఁడు గోపించి
చనుదెంచుచో లీల సౌధంబు మీఁదఁ
దనకూఁతుతోడ నాదట జూడ మాడు 870
వనజాతనేత్రుని వనమాలిపౌత్రు
ననిరుద్ధు విక్రమయనిరుద్రు గాంచి;
తన కెలంకుల నున్న దనుజులఁ జూచి
"చని యాదురాత్మునిఁ జంపి రండనిన"
వారలు చనుదెంచి వనజాతనేత్రు
నీరసంబునఁ బట్టు నెంతయు నలిగి
పరిఘంబుఁ ద్రిప్పి యప్పగతుల నెల్ల
ధరణిఁ గూల్చుటయు నుద్ధత బాణుఁడలిగి

—: అనిరుద్ధుని నాగపాశములచే బాణాసురుఁడు బంధించుట :—

యనిరుద్ధు నాగపాశావళిఁ గట్టి
పెనుపరి చెఱసాలఁ బెట్టంగఁ బనిచె.
అనిరుద్ధుఁ డని రుద్ధుఁడై యున్న భంగిఁ
గని యుషాకన్యక కడుఁ జిన్నబోయి
యతిదుఃఖపరవశయై రేయుఁబగలు
నతనితోడిదె లోకమై యుండె నంత.

—, నారదునిచే నని రుద్ధుని యునికిఁ దెలిసి శ్రీకృష్ణుఁడు సైన్యముతో శోణితపురిని చుట్టుముట్టుట :—

అక్కడ ననిరుద్ధు నాతోఁటలోన
నెక్కడ పోకయు నెఱుఁగంగ లేక
బలభద్రమురహరిప్రద్యుమ్నముఖ్యు

లలిమి దిక్కులనెల్ల నందంద వెదకి
కానక యెంతయుఁ గళవళంబంది
మానసంబుల దుఃఖమగ్నులై యుండ; 880
కోరి కైలాటంబుఁ గూడుగా మెలఁగు
సూరివంద్యుఁడు బ్రహ్మసుతుఁడు నారదుఁడు
హరి సన్నిధికి వచ్చి యనిరుద్ధు వార్తఁ
గరతలామలకంబుగాఁ జెప్ప శౌరిఁ
విని వృష్టిభోజాంధవీరులతోడ
ఘనయోధరథవాజికరులతోడుతను
బలభద్రసాత్యకిప్రద్యుమ్నసాంబ
జలసత్యకృతవర్మసారణులాది
ద్వాదశాక్షోహిణీ దళసంఖ్యతోడ
యాదవరత్నంబు హరి దండువెడలె.
దళములు నడువంగ ధారుణి వడఁకె!
జలధులు కలఁగె నాశాచక్రమగలె!
హరియును నిట్లు నిత్యప్రయాణముల
నరుదెంచి రజతాద్రి యుత్తరభూమి
స్థాణునిచే రక్షితంబై వెలుంగు
శోణితపురము ముచ్చటు విడియించి
యుపవనంబులు రాల్చి యూళ్ళను గాల్చి
చపలత బహుజలాశయములఁ జెఱచి
పెరయీఁగ నందంద పేర్చినపగిది
పురికోటలగ్గలద్భుతముగాఁ బట్టి 890

---

1 "జలసత్య" అర్థము విచార్యము. పేరై యుండు నేమో?

వీరును వారును వెసఁబోరఁజూచి
పౌరులందఱు భయభ్రాంతులై నిలువ

—: ద్వంద్వయుద్ధము :—

పనిగొని రుద్రుడు "బాణుని వీడు
గొనగొని నేఁగాచికొనియుండ నిట్లు
పగతురచే బాధపడుటెట్లు జూతు
నిగిడి సైన్యంబుల నీరుగావింతు"
ననిపల్కి పటహామహారావ మొలయ
వినుతలీలల మహావృషభంబు నెక్కి
శూలపినాకాదిసునిసితాయుధము
లాలోన భయదసలార్చులుఁ బర్వ
జ్వాలకరాళవిశాలరావముల
ఫాలనేత్రుఁడు మహాప్రమథులుఁ గొలువ
బహుభూతభేతాళపైశాచకోట్లు
నహితభీకరలీల నలమిఁతోనడువ
గినిసి ముందఱఁ గార్తికేయుఁడేతేరఁ
జనుదెంచి యాదవసైన్యంబుఁ దాకె.
సాత్యకి బాణుతో సమరంబు నేసె ;
నత్యుదగ్రత వీరులందఱు దొరసి
వారువీరన కెల్లవారునుఁ బేర్చి
పోరాడిరమరులద్భుతమంది చూడ 900
నప్పుడు బహ్మాదులంతరిక్షమునఁ
దప్పక నిల్చి యుద్ధముఁ జూచుచుండ
పరశుతో మరగదాపట్టిసముసల

పరిఘముద్గరశరప్రాశఖడ్గముల
ఘనరోషములతోడ గదిలి శాత్రవులఁ
దునిమియు నలిచియు దూరనేయుచును
బటురౌద్రరోషనిర్భరలీల మెఱయఁ
జటులత నిరువాగు సరియ కాఁబోర
సడలెను హయములు సామజంబులును
పడియె తేరులు వీరభటకోటి గడసె.
కాలువలైన రక్తప్రవాహములఁ
గీలాలములఁ గన్నుఁగిలుఁపుచు నవ్వ
తలలు తామరలు ; నుద్ధతమాంసమదును ;
తలమెదళ్లు పులినతటప్రదేశములు ;
పెనుపారఁ బేవులు బిససమూహములు ;
తనరారు కేశసంతతి శైవలంబు ;
[illegible]లినమణికోటి రక్తోత్పలంబు ;
నీలాబ్జసరములు నెలకొన్న శేంట్లు ;
ఘనరథాంగంబులు కమఠసంఘములు ;
ఒనరు వింజామరలొగి మరాళములు ; 910
తలకొన్న భూతభేతాళవర్గంబు
జలపక్షినివహమై జలకేళిఁ దేలి
కొలను చందంబునఁ గొమరగ్గలించి
కలను జూడగ భయంకరమయ్యె నవుడు !
ప్రమథబలంబులు పటుశక్తి మెఱసి
కమలనాభుని సేనఁ గారింపఁదొడఁగె

---

[1]తల మెదడు పెండెలు గట్టుపులిన దేశములు

విద్యుత్ప్రభాభాస వివిధబాణములు

—: ప్రద్యుమ్నగుహుల ద్వంద్వయుద్ధము :—

ప్రద్యుమ్నుఁడాగుహుపై నాటనేసె ;
అతఁడు కోపించి హరితనూభవుని
కేతుదండము విల్లు గృత్తము సేయ
వేఱొక్క విలుగొని విష్ణునందనుఁడు
నూఱుబాణంబులు నొప్పింప గుహుఁడు
ఘనశక్తినైన నిర్ఘాతశతంబు
చనుదెంచుగతి వచ్చు నటులతఁ జూచి
యరదంబు దిగినిల్వ నాతని శక్తి
హరుల సూతుని తేరు నడగించి చనియె ;
రతిపతి యొండొక్క రథమెక్కి గుహుని
శితశరంబున నేయ శిరమును నురముఁ
బగిలి నెత్తురు గ్రమ్మఁ బ్రబలగాత్రంబు
చిగురొత్తు కింశుకచెల్వు వహించె ; 920
సేనాని పఱచుండఁ జేరి యాప్రమథ
సేన బ్రద్యుమ్నుడు చెండాడఁదొడఁగె ;

—: హాలిపుష్పదత్తుల ద్వంద్వయుద్ధము :—

హాలి పుష్పదత్తుని నాఱుబాణముల
చెలఁగి యేయఁగ వాఁడు చేయార్చి యార్చి
యిరువది బాణంబులేసి నొప్పింప
పరుమతకోర్చి యాబలభద్రుఁ డలిగి

[1]మేటితూపులు నూఱు మేన గ్రుచ్చుటయు
నాతఁడు గడఁగొని యవనికి దాఁటి
సూతాశ్వరథమును జూర్ణంబు సేసి
తలవ్రేయ నడువను ధాత్రిపై వ్రాలె
కులిశంబుఁ దాఁకిన కొండ చందమున ;

—: బాణపుత్రుఁడు సాంబునిపైఁ గదియుట :—

బాణపుత్రుఁడు సాంబుపై నార్చి యేడు
బాణంబు లేసిన బద్మాక్షుసూనుఁ
డాతనిమీఁదఁ బదాఱు బాణంబు
లాతతంబుగ నేయ నతఁడు కోపించి ;
హరుల నాల్గిటిఁ జంపి యాఱు బాణముల
నరదంబు సూతుని యవలీలఁ గూల్చె.
విలుద్రుంచుటయుఁ బెంపు విడువక వ్రాలుఁ
బలుకయుఁ గొని మీఁదఁ బారుతెంచుటయుఁ 930
గని బాణసూనుఁడు కంపించి తేరి
వెనకకు జాఱియుద్వేగుఁడై పఱచె ;
బాణుఁడు సాత్యకిపై నార్చి వేయి
బాణంబులడరింపఁ బటుశక్తి నతఁడు
కినిసి తచ్ఛరములఁ గృంతముఁ జేసి
ఘనశరంబుల మోము గాడంగనేయ
నూనిన ఖిన్నమై యొకసాయకమున
సైనేయు స్రుక్కించి శౌరిపై నడచె ;

---

[1] ఒకేపాదము కన్పడుచున్నది.

—: శ్రీకృష్ణబాణాసురల ద్వంద్వయుద్ధము :—

చండాంశుదశకరచటులంబులగుచు
మండితదోర్దండమహిమ దీపింప
శ్రీరమ్యతర మేరుశిఖరమో యనఁగ
చారుకిరీటనిశ్చలకాంతి నిగుడ
లలితాంబుధరతటిల్లతికలో యనఁగ
బలిసి యుగ్రాయుధప్రభలుప్పతిలఁగఁ
డాఁకునఁబూర్ణ సుధాంశుచే నైన
ప్రాకటముక్తాతపత్రంబు వెలుఁగఁ
బ్రథమాద్రిఁ దోతెంచు భానుఁడో యనఁగ
రథమెక్కి గర్వదుర్వార వేగమున
హరిమీఁద జనుదేర నానికేతనము
మురిసి కూలుటయును ముదమంది(మదిని) 940
"కలిగెఁ గదా! నాకుఁ గదనరంగమునఁ
గలుషంబుతోఁ జేతిగమి తీఁటమాన్ప"
నని మురారాతిపై నంబకాష్టకముఁ
జొనుపుటయును శౌరిచూచి కోపించి
పటుశార్ఙ్గనిర్ముక్తబాణజాలముల
వికటాటముగ దైత్యవిభు నేయ నతఁడు;
యేనూఱు చేతుల నేనూఱు విండ్లు
బూని నానాస్త్రముల్ పొరినేర్చి నారిఁ
దొడిగి పల్లేసినఁ దొలఁగక వాని
నడుమనే తునుమాడె నలినలోచనుఁడు
తొడిబడ విండ్లన్ని దునిమి రథములఁ
బొడిసేసి సారథిఁ బొడపడగించి

యరదంబుఁ దునుమాడి యార్చియా శౌరి
శరముల మేను జర్ఝరితము చేసె;
కడుఁదుర్లు గుట్టినకరణి మేనెరియ
నొడలు పెన్నెత్తురు లొలుక నయ్యసుర
మరలిచూడక పార మదనారి యంత

—: పినాకి కృష్ణునితోఁ బోరాడుట :—

హరుఁ దాఁకె బహుపిశాచావళితోడ
యాదవవీరులు నసురవీరులును
నాదటఁ బోరాడ నతిభీషణముగఁ 950
గమలాక్షుసేనలగ్గలికమై తరుమఁ
బ్రమథసేనలు భూతబలమును దిరిగి
జడలు వీడఁగ మేను జళుకంద కాళ్లు
వడవడ వణఁకంగ వాతెరలెండఁ
బెదవులు దడవుచు భీతిఁ బెల్లుఱికి
యదవద కఱచె నాహరుఁడున్న కడకు;
పఱతెంచు సేనల భర్గుఁడు జూచి
వెఱవకుండని నిల్పి వృషభంబు నెక్కె;
గరుడవాహన యక్షగణముల కంత
సరభసంబున మహాసంగ్రామ మయ్యె!
దిక్కులొక్కట మ్రోసె దిగిభంబు లొరలె;
చుక్క లెల్లడరాలె సురకోటి వెఱచె;
బ్రహ్మాదిసంయమిప్రతతి భీతిల్లె;
బ్రహ్మాండభాండంబు పగిలినట్లయ్యె!
హరుఁడు పినాకమునందేసి శరము

లురుముష్టి సంధించి యురవూడ నేయ
హరిశార్ఙ్గ నిర్ముక్తమగు శరాష్టకము
హరుమీఁద నెసనేసి యార్చిన గినిసి
పాశుపతాస్త్రంబుఁ బశుపతి ప్రేయ
నాశౌరి యేసె నారాయణాస్త్రంబు. 960
ఇరువుర శరములు నెలమి నొండొండఁ
బరుషమై రవికోటి పడిన చందమున
డాయచుఁ బేర్చి మంటలు మింట నంట
ప్రోయుచు రెండస్త్రములు శాంతమయ్యె.
బ్రహ్మాస్త్రమడరింపఁ బంకజోదరుఁడు.
బ్రహ్మాస్త్రమున శాంతపఱచె నాహరుఁడు.
ఆరూఢగతి హరుఁడనలాస్త్రమేయ
వారుణాస్త్రంబున వారించె శౌరి.
జలద బాణమునఁ బాషాణవర్షంబు
గలగొని యడరింపగాఁ గృష్ణుఁ, డలిగి
యురగ బాణంబేయ నురక మురారి
గరుడాస్త్రమున దానిఖండించివైచె.
వారక జ్వాలబాణవహ్నసత్వమున
నారుద్రుఁడడరింప నద్రులఁ బగిది
దారుణంబుగ మత్తదంతులు గవియ
నారసింహాస్త్ర మున్నతిఁ బ్రయోగించి
ఘోరకంఠీరవ కోటులచేతఁ
గోరి యాకరికోటిఁ గూల్చె నాశౌరి.
అంతట హరుఁడు కాలాంతకమూర్తి
యంతయు హరిఁజూచి యెసఁగు రోషమున 970

దాపజ్వరంబు నుద్ధతిఁ గూర్చి యేయ
నేపార నదిసేన నెరియింపఁ జొచ్చె.
ఉష్ణజ్వరమువచ్చు నురువడిఁ జూచి
వైష్ణవాస్త్రముఁదొడ్గి వారిజోదరుఁడు

—: శీతజ్వరపీడితమై తాపజ్వరము శ్రీకృష్ణుని శరణు వేఁడుట :—

శీతజ్వరంబుఁ జెచ్చెర నేయుటయును
భూతకోటులు భయభ్రాంతిఁ గంపింప
తాపజ్వరంబు మేనుఁదప్పక కదియ
వాపోవుచును వచ్చి వారిజోదరుని
బదములపైఁ బ్రాలి ప్రణుతింపఁ దొడఁగె.
"యదువంశవల్లభ! అఖిలలోకేశ!
కారుణ్యమూర్తివి కంజాతనేత్ర!
వారిజోదర! భక్తవత్సల! కృష్ణ!
నెట్టన నీశక్తి నిఖిలజంతువులఁ
బుట్టింతు రక్షింతు పొలియింతు వీవ!
ప్రకృతియుఁ బరుషుఁడు పరమశాంతియును
వికృతులనానీవ విశ్వలోకేశ!"
అని సన్నుతించెడు నమ్మహాజ్వరముఁ
గనుఁగొని పలికె నాకమలనాభుండు.
"నీవేల వెఱచెదు? నీ వున్న యెడల
సేవ నపథ్యంబు సేసిన వారిఁ 980
గారింపు మర్థి నీకథ విన్నయట్టి
వారిఁ బొందక నీవు వర్తింపుచుండు."
శీతజ్వరంబంత శివు మేను సోఁకి

యాతతజాడ్యంబు నావలింతయును
ఘనమైన యాతన గంపంబుఁ గదిసి
కనుమోడ్చి నిద్రించుగతి నుండె నంత;

—: అంబిక శ్రీకృష్ణునిఁ బ్రార్థించుట :—

అంబరకేశాంగమర్థంబుఁ గొన్న
యంబరాంబర జగదంబ యేతెంచి
కరకరిఁ బోరు శంకరశార్ఙ్గధరుల
నిరువురకడఁజొచ్చి యేపార నిలిచి
హరిమోముఁజూచి యిట్లని నుతియించె.
“వరద! జగన్నాథ! వసుదేవపుత్ర!
దేవదేవారాధ్య! దివ్యస్వరూప!
గోవింద! మధువైరి! గోపాలవంద్య!
నీవు మేల్కని చూడ నిఖిలంబుఁ బుట్టు
నీవు నిద్రించిన నిఖిలంబు నడఁగు!
మాయచే నఖిలంబు మాయగావించు
మాయస్వరూప! చిన్మయ! హృషీకేశ!
మూఁడుమూర్తులు నీవ యొగివానిమీఁద
పోఁడిగాఁ బెరిగెడి పొడవవు నీవ 990
బాణుఁడు తఁకు సద్భక్తుఁడుగాన
స్థాణుఁడాతనికినై సమరంబు సేసె;
భక్తవత్సలుఁడగు పరమాత్మ నీకు
భక్తుఁడుగాని నీపగవాఁడు గాఁడు.
ఇతనికి నీకును నేమి భేదంబు?
హితమతిఁ దలపోయ నేకరూపంబు!

నీనామమంత్రోద్ధు నిష్ఠతో జపము
పూని యనుష్ఠింతుఁ బుండరీకాక్ష!
నను జూచి యైనను నా కింకరుని
ననుకంప వీక్షింపు" మని సన్నుతింప
నాతతజయశాలి యైన కృష్ణుండు
శీతజ్వరము మాన్పెఁ జెచ్చెర నంత.

—: బాణుని రెండవ యుద్ధము :—

అంతయుఁ గని బాణుఁడట రథంబెక్కి
యంతకాకారుఁడై హరిమీఁదఁ గవిసి
యురుతరకనకపుంఖోజ్జ్వలంబైన
శరపరంపరలు భీషణముగాఁ జొనుప
హరి వాని బాణంబులవలీలఁ దునిమి
యురుబాణ మొక్కట నురమేయుటయును;
క్రమ్మర మూర్ఛిల్లి క్రన్నన దెలిసి
యమ్మురారాతిఁ బెక్కమ్ముల నొంచి 1000
భల్ల మొక్కట వామభాగంబు నొంప
విల్లూడి పడుటయు విష్ణుఁడు కనలి
ధారుణి వడఁక పాతాళంబు బదర
వారాసి కలఁగ దిగ్వలయంబు పగులఁ
దారలు డుల్ల నుత్తానచక్రంబు
దారుణశక్తిఁ జే దనుజుని వైచె!
అరమంట ల దంద యెగసి మిన్నంద
నురుముచందంబున నురుఘోష మెసఁగ
గుఱి మానికొమ్మలు తుప్పలై పడఁగ

సతికిసత్క్రియ భీషణ స్ఫూర్తి మెఱయఁ
గటక కేయూరకంకణ హేతిరుచులఁ
బటుతరంబుగ బాణుబాహులు నఱుకఁ
గని నీలకంఠుఁడు కమలాక్షు కడకుఁ
జనుదెంచి భక్తవాత్సల్యతఁ బలికె
"విశ్వజగన్నాథ! విశ్వరూపాఖ్య!
విశ్వవిశ్వంభర! విశ్వసంహార!
వేదాంగవాహన! వేదాంతవేద్య!
వేదగోచర! సర్వవేదాంతకృష్ణ!
అవని భారముమాన్ప నసురాళిఁ దునుమ
నవతరించినవాఁడ వంభోజనయన! 1010
నీవాదిమూర్తివి నిఖిలమూర్తులును
నీ వేరుకొండక నెఱిఁజూప గలఁడె?
బాణాసురుఁడు నాకు భక్తుఁడు వీని
బాహులన్నియుఁ ద్రుంపఁ బంతంబుగాదు.
ననుగృపఁ జూచి మన్నన నాల్గుచేతు
లునుపవే యనుటయు నుగ్రాక్షుఁ జూచి
గరుడుని డిగి వచ్చి కరకంఠుకేలుఁ
గరములఁ గీలించి కమలాక్షుఁ డనియె.
"నీ భక్తుఁడన నేల? నిగిడీవె ప్రొద్దు
మాభక్తుఁ డీతఁడు మాప్రాఁతవాఁడు
మాన్యుఁడు ప్రహ్లాదు మనుమని కొడుకు
ధన్యాత్ముఁడగు బలితనయుఁడు గాన
నీతని కరుణించి యిచ్చితినాల్గు
చేతులు, నినుపూజ సేసెడికొఱకు

నీ భక్తులగు వారు నెఱి మాకుఁ బ్రియులు
మా భక్తులగువారు మరి నీకు బ్రియులు
గాక నెందును వేరు గలదయ్య మనకు?
శ్రీకంఠ!" అని పల్కి శివుని వీడ్కొలిపి
చెలువార నాలుగు చేతులుఁ దక్క
బలితనూభవు వేయి బాహువుల్ ద్రుంచి 1020
వేఁచి నెత్తురుఁ గ్రమ్మ నేపార మేను
పూచిన మోదుగుఁ బోలుపారు నతఁడు
హరిపాదాంబుజముల కండంద మ్రొక్కి
పరమసదానందభరితుఁడై పలికె
"ఆదినారాయణ! అఖిలసన్మునులు
వేదాంత విదులును వెదకంగ లేని
భవదీయ శ్రీపాదపద్మయుగ్మంబుఁ
దవిలి కొలువఁగఁ గంటి ధన్యుఁడ నైతి!
అన్ని చేతులు నేల యీశానుపూజ
కున్న చేతు లెచాలు నురగేంద్రశయన!"
అని పల్క విని బాణు హరి డాయఁబిలిచి
తను వెల్ల నిమిరి ఖేదంబెల్ల మాన్పి
యమరత్వమును బ్రమథాధిపత్యమును
గమలాక్షుఁ డిచ్చిన గడుసంతసిల్లె.

## —: ఉషాకల్యాణము :—

బలిపుత్రుఁడును నాత్మభవనంబునకును
బలకృష్ణ సాత్యకి ప్రద్యుమ్నముఖులఁ
గొనిపోయి పూజించి కొమరారు వేడ్క

ననుపమ మణి భూషణాదు లర్పించి
యయ్యుషాంగనతోడ ననిరుద్ధుఁ దెచ్చి
యయ్యాదవాధ్యుల కర్థి మ్రొక్కించి 1030
సకలవస్తువులును సమకూర్చి తెచ్చి
ప్రకట మంగళమైన బలుమూహూర్తమున
ననిరుద్ధయుషలకల్యాణవైభవముఁ
బెనుపారఁ జేయించి పెండ్లింటిలోన
నందఱ భక్ష్యభోజ్యాది వస్తువుల
నందంద తనిపి యాయసురాధిపుండు
వేయురథంబులు వేయుయేనుఁగులు
వేయువాజులఁ బదివేలు ధేనువుల
బహురత్నభూషణప్రముఖాంబరముల
బహుళదాసీజనప్రముఖసంపదల
నల్లుని కింపార నరణంబు లిచ్చి
యుల్లముల్ చిగురొత్తి యొప్పారువేళ
ననిపిపుత్తేర నాయాదవోత్తముఁడు;
అనుకంపబాణుఁ గృతార్థునిఁ జేసి
మన్నించి వీడ్కొల్పి మహితసంపదల
నన్నయుఁ దానును నరిగె ద్వారకకు.
అనిరుద్ధుఁడునుషయు నిత్యానందలీల
మనసిజక్రీడ నెమ్మది నోలలాడి
రీపుణ్యకథవిన్న నిష్టసౌఖ్యములుఁ
బ్రాపించు భవరోగబాధలు మాను 1040
ధనధాన్యబహుపుత్రదారాభివృద్ధిఁ
దనరారకృష్ణుఁడు దనలోకమిచ్చు

నని చెప్పుటయు విని యభిమన్యుసుతుఁడు
వినుతుఁడై శుకయోగివిభునకిట్లనియె.
"ఘనపుణ్యుఁడగు హరికల్యాణకథలు
విని కృతార్థుఁడనైతి విష్ణుఁడు మరియు
ధారుణి పాలించి ధర్మవర్తనల
నేరీతి విహరించె? నెఱిఁగింపుఁడ"నిన
మధువైరికథలవాఙ్మనసగోచరము
లధిప! యేర్పడ వినుమని చెప్పఁదొడఁగె.
అని యిట్లు నిత్యధర్మారంభుపేర
జనలోకనవపారిజాతంబుపేరఁ
జతురకళాపూర్ణచంద్రునిపేర
నతులవైభవనిర్జరాధీశుపేర
శోభితనవరూపసౌందర్యమూర్తిపేర
నౌభళమంత్రికందామాత్యుపేరఁ
గోరి భరద్వాజ గోత్రసంజాతు
డారూఢమతి నయ్యలార్యనందనుఁడు
శృంగారరసకళాశ్రితవచోధనుఁడు
సింగనామాత్యుఁడు చెలువగ్గలింప 1050
సలలితరసభావశబ్దగుంభనల
వలనొప్ప శ్రీభాగవతపురాణమున
మహనీయమగు దశమస్కంధసరణి
విహితలీలలనొప్పు విష్ణుచారిత్ర
మారూఢభక్తి కల్యాణకాండంబు
నారవితారార్కమై యుండఁజెప్పె. 1058

కల్యాణకాండము సమాప్తము.

శ్రీరస్తు.

శుభమస్తు.

# ద్విపదభాగవతము.



## జగదభిరక్షకాండము.



శ్రీరమ్యుఁడగు పుండరీకలోచనుఁడు
ద్వారకాపురినున్న తఱినొక్కనాఁడు

### —: నృగుని శాపవృత్తాంతము :—

సాంబుఁడులోనుగా సకలకుమారు
నంబుధితీరవిహారణ్యభూమి
మృగయానురక్తులై మెలఁగుచుఁ దప్పి
తగ నిట్టికందువఁ దడయక వెదకి
యొకనూతిలో నొక్కయూసరవల్లి
వికలమైపడియుండ వెఱఁగంది చూచి
" యెన్నడుపొడగానమిట్టిగాత్రంబు
నిన్ని వన్నెలుగల యూసరటంబు
కటకటా! ఈ కూపగతమైనదనుచుఁ
బటుశక్తి నందఱుబట్టి యీడ్వఁగను
వెడలకయుండిన వెన్నునితోడ

కడువేగఁ జెప్ప నక్కడికేఁగుదెంచి
కూపగతంబైన కృకలాసకంబు
శ్రీపతి వీక్షించి చేతను దివియ
నది దివ్యపురుషుఁడై నంబుజోదరుని
పదపంకజములకు భక్తి మ్రొక్కుటయు
హరిజూచిపలికె "పుణ్యాత్మ నీకిట్టి
నరటజన్మంబేల సమకూరె"? అనుఁడు
'అనఘాత్మ! నృగుఁడ నిక్ష్వాకువంశజుఁడ
జెనుపడ సంపదఁ బేర్చినవాఁడఁ
దారకఁబులు వృష్టిధారలు నిసుక
వారాసితరగలు వడినెన్న వచ్చు
గాని నే విప్రసంఘములకు నిచ్చు
ధేనుసంఖ్యలు గణింపఁగఁజాల
నొకపుణ్యదినమున నొకవిప్రవరున
కొకగోవునిచ్చిన యురక యాకుట్టి
క్రమ్మర నామంద గలసిన నెఱుఁగ
కమ్మిత వొక బ్రాహ్మణాధ్యుని కొసఁగ
మును ధారకొన్న యామునలి బ్రాహ్మణుఁడు
తనకుట్టి తప్పినఁ దడవుచు వచ్చి
యా విప్రునింటిలో నేపారుచున్న
గోవును గొనిపట్టుకొనిపోవ నాపి
'యేమి కాఱులు చెప్పెదీ కుట్టినాకు
భూమీశ్వరుఁడు ధారపోసినవాఁడు
రాజుచే మును పరిగ్రహముఁగన్నాఁడ
యీజగంబెఱుఁగు నాయిది కుట్టియగుట

10

ధరణీశుకడకుఁ బోదము రమ్మటంచు ;"
"నిరుపురు నాకడకే తెంచి నన్ను 20
దీవించి యిద్దఱుఁ దెలిగెల్లఁ జెప్ప
భావించి రెండవ బ్రహ్మణుఁజూచి
వేవిరపఁ మీకు వివరింపనేల
యీవిప్రునకు మున్న యిచ్చిన కుఱ్ఱి
తొలఁగంది వచ్చినా దొడ్డిలోనున్న
యెఱుఁగక నిచ్చితి యీ ప్పసైచి
వెలయ నీకుఱ్ఱి యీ విప్రునకిమ్ము
నులియకఁ గొనిపొమ్ము నూఱు ధేనువుల"
ననవుఁడు నవ్విప్రుఁడనలంబుఁబోలెఁ
గనలచుఁ బరుషవాక్యముల నిట్లనియె
"ద్విజునకిచ్చిన సొమ్ము వీడ్పడ నిచ్చు
కుజనుండు దుర్గతిఁ గూలు పెక్కేండ్లు
దరఁ బ్రతిగ్రహధనత్యాగి దుర్ఘటము ;
పరగంగ ధనమీని పతి జంబుకంబు
నగుదురిట్లెఱిఁగియు నన్యాయమాడఁ
దగదయ్య నాకిచ్చి ధర్మచారిత్ర !"
ఎన్ని చెప్పిన కుఱ్ఱి నీనంచు నతఁడు
గ్రన్నన దనయింటికడకుఁ గొంపోవ
యీవిప్రవరుఁజూచి యిట్లంటి "నీకు
యీవట్టి మొదవేల ? ఇదె నీకు లక్ష 30
గోవుల నిచ్చెదఁగొని నీవుకరుణ
గావవే నన్ను దుర్గతిఁద్రోయ" కనుఁడు
"ధారుణీశ్వర ! నాకుఁ దగ దొంగటాలు

[1]ధారవోసెద వేట దానంబు నీవు
కుఱుమట్టు పొడవును కొమ్ములుగలిగి
నెఱగు చన్నులు తీరైన తోఁక
చక్కదనము నొక్కచక్క మేయుటయుఁ
నెక్కడ విడిచిన నిల్లుచేరుటయుఁ
గ్రేపులు బిలుచునర్మిని మాళిసువు
తేప్రొద్దు నేడిన నీడనిచ్చుటయు
కడుసాదునై లక్ష్మిగతి నింటిలోన
నుడుగక నీధేనువుండిన జాలు ;
యిదిదప్పిపోయిన నింటివారెల్ల
మదిలోన మలమల మఱుఁగుచున్నారు ;
యీకుత్తినాకు నీ పీవోవలేని
రేకాఱులుషు జెప్ప కిట్లొందు మాట
నాడితి కృకలాసనైయుండు ” మనుచు
శాడీ బ్రాహ్మణుఁడు శాపంబిచ్చె నంత.
వడవడ వణకుచు వసినేఁగి యతని
యడుగులపైఁబడి యతనితో నంటి 40
“ నీకష్టజన్మంబు నేనోర్వజాలఁ
జేకొని నన్ను రక్షింపవే” యనిన
“ హరి లోకరక్షార్థమై కృష్ణుఁడనఁగఁ
బరగు నాతని కరస్పర్శమాత్రమున
నీకష్ట శాపంబు నీఁగి నీపుణ్య
లోకంబు నొందు సుశ్లోక ! పొమ్మనిన ”

---

[1] ధారవోసెదవు+ఏట. ఏట=పశుపాతము.

తడయక యాకష్టతను బొంది యిందుఁ
బడనిపాటులఁబడి పద్మాయతాక్ష !
వేదాంతవేద్యులు వెదుకంగలేని
నీదివ్యచరణ సన్నిధిగంటి మంటి
పనివినియెదనో కృపారసపూర్ణ !
అని చెప్పి కృష్ణున కండంద ప్రొక్కి
కనకవిమాన సంకలితుఁడై నృగుఁడు
చనియె దివ్యులుకొల్వ జంభారిపురికి
అతఁడు వోయినఁజూచి యద్భుతంబంది
శతదళనేత్రుఁడచ్చటివారి కనియె.
" హాలాహలాభీలమగు వహ్నికంటెఁ
గ్రాలును విప్రవర్గపుకోపవహ్ని
వారల సొమ్మెవ్వరు హరించినను,
దారుణలీల బాధలఁ బెద్దగాల 50
మలమటఁబొంది కీటాదులై పుట్టి
ఁ పొలిసిపోదురు కులంబునుఁ గూలు
నదిగాన విప్రుల యర్థమీభంగి
మదిఁ జూడవలయు నెమ్మదిఁ గోరువారు"
అనుచు పుత్రులు దాను నరిగి మురారి
తనమందిరమున సంతసలీల నుండె.

—: వసంతఋతువర్ణనము :—

అంతట సకలలోకానందమగుచుఁ
గంతుని సామ్రాజ్యఘనలక్ష్మి యనఁగ
పరమానురాగసంపన్నకారణము

విరహిమానసమహావిద్వేషణంబు
శుకకోకిలాలాపసుస్వరప్రదము
ప్రకటితదంపతిప్రాణవల్లభము
మధుపకుటుంబికామందిరాంగణము
మధురసౌరభశైత్యమాంద్యకారణము
[1]ప్రాలేయకులవార్ధిబడబానలంబు
నానొప్పి వనముల నవకంబు లెక్క
మానుగా నేతెంచె మధుమాసలక్ష్మి.
తరులతావలులకుఁ దమకంబు లెక్క
పరిమళంబై మందపవనుఁడు వీచె; 60
గుమురెక్క తరులెల్లఁ గొనచిగురాకు
గములు క్రొన్నన నవకపు మొగ్గ క్రొమొగ్గ
వలిమొగ్గ క్రొవ్విరి వలపులు గులుక
వెలిపూవు నూనూఁగు పిందెలు గాయ
కసుగాయ వులికాయ కడునొప్పు దోర
పసనుపండులు వనిపండులు గలిగి
తరువు లెల్లను గల్పతరువుల భంగి
పరువమై చూపట్టు పరిమళశ్రీల!
వాసంతి వనములు వాసనగలిగి
వాసికి నెక్కె చామంతులు పూచె;
గొజ్జంగలలరుల గొమరారు మరుని
సజ్జపట్టులభంగి సౌరభంబొలసె;
కందర్పుటమ్ముల కరణిఁ వెడలి

---

ఒకపాదము కన్పట్టుచున్నది.

సింధువారంబులు చెన్నారఁ బూచె;
మగువలగండూష మధుకేళిఁ దేలి
పొగడలామని వేళఁ బొగడొందఁ బూచె;
తన్నాసపడి చూడఁ దరుణీజనంబు
తన్నాసపడి పూచె దగనశోకంబు;
తన్నిన నలరుచే తగవంచు సతుల
కన్నుసన్నలఁ దిలకంబు చూపట్టె; 70
సుదతుల కౌఁగిళ్లఁ జొక్కులఁ జొక్కి
ముదమంది కురవకంబులు ప్రమానుపడియె;
పాటలు చెవివిని పాటలీతరులు
పాటిల్లె సతుల యాటల నలరి;
సంపంగిపూదేనె చవిఁజొక్కి క్రింద
గుంపులై యలరెడు గొదమతుమ్మెదల
పానాభిరతిఁ జొక్కి పతులును సతులు
గానంబు లొనరించు గతిని జూపట్టె;
కాయజుఁడదె దండు గదలి యేతెంచె
రాయడి యడలి జోరన గూడుఁ డనుచుఁ
గోయని యెలమావి కొమ్మల మీఁదఁ
గోయిల లెలిగించె కొమరగ్గలింప;
భావజు త్రైలోక్యపట్టంబు గట్ట
దీవించఁ జనుదెంచు ద్విజులచందమునఁ
జెలరేఁగి యెల్లెడఁ జిలుకలు మ్రోసె;
వెలుఁగొందు చంద్రుఁడు వెన్నెలతేట
పరువంపు చిన్నిపూపాటన నమర
మురిపెంపు నవ్వు కెమ్మోవులఁ దనరఁ

దిలకించు చందన తిలకంబు లలర
కలికేలు మేన నత్కలికలై తనర 80
వనములు నిత్యయౌవనలక్ష్మిఁ జెంది
వనితలచందమై వలనొప్పఁ జూడ
నీభంగి నామని యేపార సీరి
యాభీరుకాంతల నాత్మలోఁ దలఁచి ;

—: బలరాముఁడు వ్రేపల్లెకు నరుదెంచుట :—

హరికి నెఱిఁగించి యట రథంబెక్కి
యరుదెంచె వ్రేపల్లె కాప్రొద్దె కదలి.
ఏపారఁ జనుదేర నెదురేఁగి యంత
గోపయశోదలక్కునఁ జక్కఁ జేర్చి
'నాతండ్రి! నాయన! నాముద్దుకూన!
ఏతెంచితే మమ్ము నిందఱుఁ జూడ
దేవకియును వసుదేవుఁడు హరియు
నీవు రోహిణి నెమ్మి నెల్లలు సుఖులె!''
అని ప్రేమ నడుగుచు నర్మిలి పుత్రుఁ
గనుఁగొని హర్షాశ్రుకణములు దొరఁగ
సంతసింపుచునుండ సకలగోపికలు
నంతలో నరుదెంచి హలపాణిఁ గాంచి
క్షేమంబుఁ జెప్పి తత్క్షేమంబు లడిగి
యామోహరసవార్ధి నందంద తేలి
హలియు మజ్జనఁ భోజనాది కృత్యములు
సలిపి వారునుఁ దాను సంతోషలీలఁ 90
గలసి వినోదించి కాళిందితీర

ములను బృందావనంబునఁ గ్రీడసలిపె.

—: బలరాముఁడు వ్రేతలతో యమునాతీరమందుఁ గ్రీడించుట :—

తాను గోపికలును దనపిన్నవాఁడు
పూని క్రీడించుచాడ్పునఁ గ్రీడసలిపి;
పసిఁడి కోరల నుంచి పడతులు సీధు
వసలారఁ దనియంగ నందఱుఁ గ్రోలి;
తనివోక కాళిందితటతరుశ్రేణి
తనరారు నీడలఁ దగ విశ్రమించి;
వరుణసంభవమైన వారుణిఁదేలి
తరమిడి బలభద్రుఁ డల్లపిల్ల నెఱిఁగి
పరిమళమాధుర్యఁ భరితమై నిండఁ
తరుకోటరమున నుద్భవమొంది నిగుడఁ
గని ప్రలంబారి యక్కాంతలుఁదాను
దనుపారియున్న కాదంబరిఁగ్రోలి
మానినిగండూషమదిరారసంబు
లాని మన్మథ కేళి నందంద తేలి
మదమెత్తి తన్ను దామఱచి గోపాల
సుదతులింపు నడిమి నూరెల నిలువ
ఘనకరిణులలోని గజము చందమున
ననువార నందవిహారంబు సలుపఁ 100
జెన్నారు మోవులజిగి జేగుఱింపఁ
జన్నుల కొంగులు జాఱి పడుచుంట
వెన్నులపై నీలవేణులు నెఱయఁ
గన్నులందును సోయగములు మాన్పడఁగఁ

గానులు నలియంగఁ గరతాళగతుల
సానురాగంబుల శౌరిఁ బాడుచును
సన్నులచాయలఁ జతురులాడుచును
నన్నులన్నుల వెడ యాటలాడుచును
సీరితోఁ బలుమారు చెనకి నవ్వుచును
మేరలు మీఱి సమేళంబు లాడి
కలసి వినోదింపగా సీరపాణి
యలసి యంగము సోల నందంద సొక్క
వెలసిన నెరివేణి వ్రేలాడ చమట
క్రలసి కస్తూరి యెక్క వలువ లెల్ల
గటకాంగుళీయకగ్రైవేయహార
పటుకిరీటప్రభాపటలి శోభిల్ల
మదియించు దివిజసామజము చందమున
నెదుతెవ్వరును లేక యేవు దీపింప
తరుణులఁ దనుగొల్వఁ దరులతావలులఁ
బరికించి చిత్తవిభ్రాంతిమై పలుకు; 110
"ఏలకో! ననుఁజూచి యీరాజశుకము
కేలించి మొగమెత్తి సేయుచున్నదియు!
నాయంబరంబుల నలుపెల్లఁ గొన్న
దీయలి!" అని కన్ను లెఱ్ఱజేయుచును
దరువులెల్లను నేడుఁ దనుజూచి నవ్వ;
"నరుణించె కింశుకంబది గేమి!" అనుచు
వటనంబు వఱువట్లు వట్టి మైదప్పి
గదిమి దిగ్గనలేచి కాళిందిఁ జూచి

—: బలరాముఁడు యమునను నాగలిచే నెత్తుట :—

"ఓ సూర్యకన్యక! ఓ లోకమాత!
ఓసారసల్లాప! ఓసారసాక్షి
నీరువెట్టుము లేక నిలువంగజాల
బోరన నుదకంబుఁ బోయవే!" అనుచుఁ
బలుమారు పిలిచినఁ బలుకక యున్నఁ
గలుషించి పరుషవాక్యముల నిట్లనియె.
"పిలిచిన నామాట పెడచెవిఁ బెట్టి
పలుకవు మదిలోన భయమంది రావు!
మలినాంగి! నీమేని మదమెల్ల నడఁచి
దళనంబు సేసి యుద్ధతమాన్తు" ననుచు
నదలించి హలమున నమ్మహాతటము
విదళించి తివిసిన వెఱఁగొంది యమున 120

—: యమున బలరామునిఁ బ్రార్థించుట :—

వడవడ వడఁకుచు వచ్చి తాలాంకు
నడగులపై వ్రాలి యరుదొందఁ బలికె.
"ఓ సర్వలోకేశ! ఓ సుప్రకాశ!
ఓ సౌమ్యవ్యాగ్రదేయ! ఓరోహిణేయ!
ధరణిభారముఁ బాప దనుజుల నడఁపఁ
గరమర్థి దేవకీగర్భంబునందుఁ
జెలువారఁ బుట్టిన చెలువుఁడ వీవ!
బలభద్ర! బలప్రలంభధ్వంసరామ!
జడసంగతి బలచంచలచిత్తమలినఁ

దడయక నీ మహాత్త్వముఁగానఁ గలనె?
నెలఁతలు సేసిన నేర్పు నేరములుఁ
దలఁకక లోఁగొండ్రు ధన్యులే ప్రొద్దు"
అని వేడుకొనుచున్న యమున మన్నించి
ఘనదయామతి హలకర్షంబు విడిచె.
ప్రీతిఁ గాళింది విభేదనుండనుచు
నాతని దీవించి రమరసంఘములు!
బలుఁడు నాఁగట గొల్వ వాపినచోటు
బలతీర్థ మన ధాత్రిఁ బ్రఖ్యాతమయ్యె.
అచట కృతస్నాతులైన మానవుల
కచలిత విష్ణులోకానంద మొదవు! 180
ఈభంగి బలభద్రుఁ డెంతయు వేడ్క
యాభీరు సతులతో నేమునఁ గ్రీడించి
యేపారు నిబ్బంగి నీయాఱు నెలలు
వ్రేపల్లెలోపల వేడ్కలు సలిపి
హరిఁజూచు తలఁపున నట ద్వారవతికి
నరుదెంచెఁ బ్రజబాలలర్థిఁ దన్నుపవ

—: పౌండ్రక వాసుదేవుని వృత్తాంతము :—

నాలోన గర్గదేశాధినాయకుఁడు
పాలసచిత్తుఁడు పౌండ్రభూవిభుఁడు
హరితో విరోధియై యతని చిహ్నములు
తరమిడి ధరియించి తానంతఁ బోక
వాసుదేవుండను వలనొప్పఁ బేరు
భాసురంబుగఁ దాల్చి పటుశక్తి మెఱసి

యక్షౌహిణీద్వితయము తన్నుఁ గొలువ
నతులితబలశాలియై దండు వెడలె.
ఆరాజునకు మిత్రుఁడై కాశిరాజు
ధీరుఁడక్షౌహిణీ త్రితయంబుతోడఁ
బటుశక్తి నతనికి బాసట యగుచు
భటదంతిహయరథప్రతతితో నడువ
నీరసంబునఁ బౌండ్రుఁడే తెంచి పేర్మి
ద్వారకానగర ముత్థరై డాయవిడిసి                140

—: పౌండ్రుఁడు దూతను శ్రీకృష్ణుని వద్దకుఁ బనుచుట :—

హరి సన్నిధికిఁ దజ్ఞుఁడను దూతఁబనుప
నరుదెంచి తగ సుధర్మాభ్యంతరమున
వృష్టిభోజాంధక వీరులు గొలువ
నిష్టవర్తన నున్న యిందిరారమణుఁ
గని మ్రొక్కి తనవచ్చుకార్యమంతయును
వినుపించఁ జొచ్చెను వెఱపింత లేక.
"ఆ పౌండ్ర నృపతి యాహవదండపాణి
భూపాలతిలకంబు పుత్తెంచె నన్ను.
అతఁడు నీతోడ ననుమన్న మాట
లాతతంబుగ విను మంభోజనయన!
వసుధ భారము మాన్ప నైరుల నడఁప
దెసలఁ బెంపఁగ వాసుదేవుఁడ నేను
నాచిహ్నములుఁ దాల్చి నా పేరుఁ దాల్చి
యీచావుఁ దెచ్చుకో నేఁటికి నీకు?
ఘనగదాశంఖచక్రమును శార్ఙ్గమును

గనకాంబరంబును గరుడకేతనము
మకరకుండలములు మణికిరీటంబుఁ
౭ ప్రకటంబగుజలసత్త్వసవమాలికయు
నివినాకు వేవేగ నిచ్చి ప్రాణముల
సవరించుకొమ్ము నన్నుశరణంబుఁ జొరుము; 150
కాదేని నాతోడ కదనంబు సేయ
నాకటఁ జేర్చి రమ్మని చెప్పు" మనుఁడు;
విని జనులందఱు వికవిక నగఁగ
ఘనుఁడు కృష్ణుఁడు వానిఁ గనుగొని పలికె.
"కండక్రొవ్వునఁ గన్నుఁ గానకఁ బెక్కు-
డుండగంబులు ప్రేలి త్రుళ్లుగాకేమి!
భండన భూమిలోఁ బరిమార్చి వాని
కండలు భేతాళగణముల కిత్తు."
అని పల్కి దూతకు నర్ఘ్యవస్తువులఁ
దనిపి వీడ్కొలుప నాతఁడు పౌండ్రుతోడ
హరి వాక్యములు జెప్ప నతఁడు కోపించి
దురమునకేతెంచె దోర్గర్వ మెసఁగ.

—: పౌండ్రుఁడు హరినిఁ దాఁకుట :—

బహుదళంబులతోడఁ బౌండ్రుఁ డేతేర
నహిమాంశు సమతేజుఁడగు వెన్నుఁడెదిరిఁగి
పరఁగు సారథ్యదర్పంబు|మెఱయఁ |ఋ
దేరెక్కి శస్త్రాస్త్రదీప్తులు నొలయఁ
బాంచజన్యధ్వని పరిపంథి సేనఁ
జంచలించఁగ వచ్చు శౌరిపై నదరి

పరిఘతోమరగదాప్రాసచక్రములుఁ
గురిసిన, మురవైరి క్రూరబాణములు 160
నడవుల నేర్చు కాలాగ్ని చందమునఁ
దొడరి సేనలనెల్ల ద్రుంచివైచుటయుఁ
గనుఁగవ కెంపొందఁ గడఁగి పౌండ్రుండు
తనసేనఁబురికొల్పి దళముల దాకె.
కృత్రిమ చక్రంబుఁ గినిసి వైచుటయుఁ
శత్రుఁడు బెగడ నాచక్రంబు నఱకె;
గదయును విల్లును ఖండించి తేరు
చిదురుపలుగఁ జేసి సిడముఁద్రుంచుటయు
బఱిగొని వాలును బలుకయుఁ గొనుచు
నఱిముఱి నార్చుచు నరుదేరఁజూచి
హరి శార్ఙమున భల్లమరివోసి కంఠ
మరుదార లక్షించి యార్చి వైచుటయు
మకరకుండలరత్నమకుటంబు తోడఁ
బ్రకటోల్ముఖము భంగి పడియె తచ్ఛిరము.
కూలిన పౌండ్రుఁ గన్గొని సేనలెల్ల
నాలచండంబున నందంద పఱచె.

—: పౌండ్రుని మరణమునుగాంచి కాశిరాజు శ్రీకృష్ణునిపై గవిసి మడియుట :—

కని కాశిరాజు "నేఁగలుగంగ నేలఁ"
గనుకని పార" నొక్కట నిల్వుఁడనుచు
దళములఁ బురికొల్పి దైత్యారితోడఁ
దలపడి బహుబాణతతుల నొప్పింపఁ 170

గోలఁ ద్రేసిన ట్రోఁగు కోల్పులిభంగి
వాలమ్ములురమున వడిఁగీలు కొలుపఁ
[1]గాలాగ్నిసదృశభీకరచక్రనిహతి
ముడివడు బొమలతోఁ బొలుచు మస్తకముఁ
బడవైచి యార్చె; నీ భంగి శాత్రవుల
నిరువురఁ బొలియించి యిందిరాధీశుఁ
డరుదెంచె ద్వారక కమరాళి పొగడ.

—: కాశిరాజు కుమారుఁడు రుద్రుని వరమును బొంది కృత్తిని బుట్టించుట :—

కాశీశ్వరుని తల ఘనచక్రనిహతిఁ
గాశిగాఁగూలినఁ గని పౌరులెల్ల
నడరి సోద్యంబంద యాయొక్క శిరము
పడియె కుండలమణిప్రభలతో నపుడు.
అతివలు దుఃఖింప నతని నందనుఁడు
సితకీర్తియగు సుదక్షిణుఁడను వాఁడు
తన తండ్రి తల యాటఁదా నిశ్చయించి
ఘనభక్తి నగ్నిసంస్కారంబు సేసి
యతుల సమాధి నిష్ఠాత్ముఁడై ప్రమథ
పతినాత్మ నిలిపి తపంబాచరింప;
హరుఁడు ప్రత్యక్షమై "యడుగుము నీకు
వరమిత్తు" ననుటయు వాఁడు "మజ్జనకుఁ  180
జంపిన పాపాత్ము నమయించు నట్టి

---

[1] ఒకేపాదమున్నది

పెంపు ప్రసాధింపు భీమాక్ష! అనుఁడు
ఆ దేవుఁడును "దక్షిణాగ్నిగుండమున
నాదరంబున విప్రులాభిచారాఖ్య
హోమంబు సేయఁగ నొకకృత్తి పుట్టి
పోమిచ్చి నీ శత్రుఁ జఱువుచ్చు" ననుచు
హరుఁడదృశ్యుండయ్యె నంత ఋత్విజుల
నరుదార వేల్పింప నాయగ్ని వలన

—: అగ్నిలో నుండి పుట్టిన కృత్తి శ్రీకృష్ణునిపై వెడలుట :—

నాలోన భయదజిహ్వాలవక్త్రంబు
ఫాలనేత్రంబును బాహాశతంబు
శూలతోమరగదాక్షురికాదిభిండి
వాలచక్రములు దుర్వారాయుధములు
చటులకఠోరదంష్ట్రలు తాడనములు
కుటిలపు బొమ్మలు క్రూరదృష్టులును
దీర్ఘతాభీలత తీవ్రాట్టహాస
గర్ఘరస్వరములు ఘనశరీరంబు
నడర లోకములెల్ల హరుఁడొక్కవేట
మడియింపఁ బుట్టిన మాడ్కియో యనఁగఁ
బదతాడనముల భూభాగంబు వగుల
నదరి [1]లోహితవర్ణ మదరి యుండంద 190
"ఎవ్వని బరిమార్తు నిట పంపు మనుఁడు"
నవ్వాను దేవుని నడచిరమ్మ" నిన

---

[1] అర్థము చింత్యము

బహుభూతఢాకినీప్రతతితోడ వచ్చి
దహనార్చు లొలయ నాద్వారకఁ జొరఁగ
కారగ్ని దరికొన్న ఘనసత్వచయము
పారెడుగతి జనప్రతతి రేఁపఱచి
యతివలతో జూదమాడుచు నున్న
శతదళాయతనేత్రు సన్నిధి నిల్చి
"ఇదె యొక్క కృత్తి యహీనాగ్ని శిఖలఁ
గదిసి పట్టణమెల్లఁ గాల్చుచు వచ్చె
నిక్కడ దిక్కు లేదీబారిఁ గడపి
గ్రక్కున మమ్ములఁ గావవే కృష్ణ!".
అని యార్తులై పలుక నాపౌరజనులఁ
గని కేల వారించి కడకంట నగుచు
నది మహేశ్వరకృతియా కృత్తి యగుట
మదిలోన నెఱిఁగి సౌమ్యజ్ఞాన విభుఁడు;

—: శ్రీకృష్ణుఁడు సుదర్శనమును గృత్తిపై పనుచుట :—

తనుఁగొల్చియున్న సుదర్శన పురుషుఁ
గని నల్ల నవ్వుచు కనుసన్నఁ బనుప
నమ్మహాచక్రంబు హరి యాజ్ఞఁ బూని
గ్రక్కున నేతెంచి కాలాగ్ని వోలె 200
శతయోజనోత్తాల చటుల విగ్రహము
శతభుజాగ్రమదోగ్రశస్త్రాస్త్రములును
ఘనసహస్రార్కనిర్గతతీవ్రరుచులఁ
బెనుమంటలెగయ నాభీలమై పేర్చి
హరి చక్రమేతెంచు టాలించి కృత్తి

మఱలె బిట్టొఱలుచు మది విహ్వలింప
పఱగంగ నత్యుదుప్రవరసాధనము
యతిముఖి వెనుకొన నదికాశిఁ జొచ్చె.
చొచ్చిన నిట్టట్టు సురగంగ నీక
నచ్చక్ర మడరి ఘోరానలశిఖల
నాఋత్విజులతోడ నాకృత్తితోడ
నారాజుతోడ జనావళితోడ
ఘనశతాంగక వాజి గజశాలతోడ
ధనధాన్య వస్తు సంతానంబుతోడఁ
[1]బాలుపారుసౌధగోపురములతోడఁ
గాశీపురము చక్కఁగాఁ జేసి కాల్చి
యీశేషి హరి పాలికేతెంచి మ్రొక్కె.
నీకథావర్ణన మెల్ల వారలకు
ప్రాకటకృత్యముల్ బాధలు నడఁగు 210
పుత్రసంపదలును భోగసంపదలు
శత్రుక్షయంబు మోక్షము నిచ్చుచుండు.
అని చెప్పుటయువిని యభిమన్యు సుతుఁడు
వినతుఁడై శుకయోగివిభునకిట్లనియె.
" ఆ మందలో నుండి యరుదెంచి యచట
కామపాలుండే మిగతి విశ్రమించె?
ఆతని చరిత్రంబు నఖిలంబు వినఁగఁ
గౌతుకంబయ్యె నాకథఁ జెప్పు " మనిన

---

[1] ఒకే పాదము కన్పట్టు చున్నది

—: ద్వివిదుఁడను వానరుఁడు తన చెలికాఁడగు నరకుని జంపినందులకుఁ బగఁబూని చెలరేఁగుట :—

వినవయ్య కురునాథ! ద్వివిదుఁడనంగ
దనరారు మైందుని తమ్ముఁడు ఘనుఁడు
గిరిచరాధిపుఁడు సుగ్రీవుని మఱఁది
నరకుని చెలి మహోన్నత బలాధిపుఁడు
నారాయణునిచేత నరకుఁడు దెగినఁ
గ్రూరవార్తకు మదిఁ గుమిలి మర్కటుఁడు
హరి నడఁచెదనని నద్దేవుఁ డేలు
పురములు నూళ్లను బోరి చిచ్చులిడుచు
కొండలు బెటికి యుక్కున నూళ్ల మీఁద
మెండుగావైచి భూమిని పాడుసేయ
వనితలఁ బతులను వడి వెంట బెట్టి
కొనిపోయి పర్వత గుహాలలో డాఁచు 220
కీర్తి ను డగ నెటేఁగి యాశౌరి
యూరకనుండఁగ నొక్కనాడంత;
వారాసి దాఁటి దైవతకందరమున
శారూఢగతివచ్చి యగచరాధిపుఁడు
మానిసిమంజుళమధురగానముల
వీనులకింపార విని యల్లనచట
కరిగి చేరువ నొక్క యవనిజ మెక్కి
పరికింపుచున్నచోఁ బడఁతుల నడుమ
నారుణితాత్ముడై యాసవక్రీడ
నారామలును దాను నలరి పాడుచును
గోవులలోనున్న గోరాజుభంగి

దావేడ్క విహరించు తాలాంకుఁ జూచి
హరియుతాఁ దలపోసి యాకీశవరుఁడు
తరులెక్కి కిలకిల ధ్వనులు సేయుటయు
తరుణులు నవ్వుచుఁ దను చూడ మేను
వరపి ఝుంకించుచుఁ బండ్లిగిల్చుచును
బామలార్చి చూచుఁ బోరి మీఁదఁ బొలయు
భ్రమరాళిఁ గని యుల్కిపడి పట్టుకొనుచు
వెలికిలపడి యాడి వెక్కిరింపుచును
వెలఁదులఁ గని వంగి వెనుకఁ జూపుచును 230
గోడిగంబులు సేయుఁ గ్రోతి సేఁతలకుఁ
జేడియలందఱుఁ జెలరేఁగి నవ్వ ;

—: బలరామ ద్వివిదుల ద్వంద్వయుద్ధము :—

తాలాంకుఁ డాకరాత దర్పించి వైశ
నాలోనఁ గోపించి యతనిపై కుతికి
చీరలు జించి యాసీధుభాండంబు
బోరనఁ బగులంగఁ బొడిచి దాఁకుటయు ;
తామపాలుఁడు వానిఁ గడకతోఁ బట్టి
వేముష్టిఁ బొడిచిన వికవిక నవ్వి
ప్రళయకాలోత్తాలభైరవుభంగి
బలియుఁడై మైవచ్చి బలున కిట్లనియె.
"నలినాక్ష! యేరీతి నాఁడు నామిత్రుఁ
దలమీరి నరకు నుద్దండతఁ జంపి
వచ్చితి నేనేఁడు వచ్చిన వాఁడఁ
జెచ్చెర సమరంబు సేయు నాతోడ!

తనరార మైందుని తమ్ముఁడ ద్వివిదుఁ
డనువాఁడ శూరుఁడ నర్కజు మంత్రి
రామునకై పూని రావణుతోడ
భీమాహవము సేసి పేర్చినవాఁడ
నెలకొన్న రణవీథిని ద్రుంచి వైవఁ
గెలసి నాచెలికాని కెలసంబుఁ దీర్తు." 240
అని పల్కియార్చి మహాశూలమెత్తి
కొని వైచుటయు సీరి క్రుంకి మైఁదప్పి
ముసలంబుఁ గొని బెట్టు మోదిన వాఁడు
వెస మహాతరువెత్తి వేసి యార్చుటయుఁ
దప్పించుకొని సీరి తరుచరుమీఁద
గుప్పించి యుఱికి ముక్కున ముష్టిఁ బొడువ
తెరలక వానరాధిపుఁ డొక్కపెట్టు
తరుణులు బెగ్గిలఁ దరువృష్టిఁ గురిసె
లాంగూలమున వ్రేసి లలి నఖాగ్రమున
నంగంబుఁ జీరి మేనందంద కఱచి
పిడికిటఁ బొడిచినఁ బెనుమూర్ఛ నొంది
పడిలేచి యాబలభద్రుఁ డాతనిని
గళమున జిక్క నాగలి దగిలించి
యలుకమై రోఁకట నందంద పొడువ
హనువులు పగిలి మైయుదలెల్లఁ బొలిసి
కనుమూసి నెత్తురు గ్రక్కుచుఁ జూచును
బవిదాఁకి కూలిన పర్వతంబనఁగఁ
బ్లవగేంద్రుఁ డిలఁగూలి ప్రాణంబు విడిచె.
దివిజులందఱు వెఱఁగంది కీర్తింప

దివిజసంఘము రాము దీవించిరంత 250
నలిన నేత్రుండున్న నగరికేతెంచి
హలి కృష్ణుతోడ నయ్యాగచరువార్త
వినుపింప శౌరియు వివిధబాంధవులు
వినుతు లొనర్చిరి వెసరామునంత

—: సాంబుఁడు ధుర్యోధనుని కుమార్తె లక్షణ నపహరించుట :—

అంబుజోదరపుత్రుఁ డతిరథోత్తముఁడు
జాంబవతేయుండు సాంబుఁడు ఘనుఁడు
కోరి ధుర్యోధను కూఁతు లక్షణను
వారణపురి స్వయంవరమునందునను
వరియించి కొనిపోవ వారలందఱును
గురుపతి కెఱిఁగింపఁ గోపించి యతఁడు
" ఏమేమిరా! సాంబుఁడే నాతనూజ
నేమని కొనిపోయె నెట్లు జూచితిరి ?
కురువంశజులతోడఁ గూడి యాదవులు
పరిణయప్రాప్తులే పరికించి చూడ ?
పడుచువాఁడీకన్య బలిమిఁ గొంపోవఁ
దడయకఁ జూచుట తగవుగాదతని
బట్టి తెత్తమటంచు బలములతోడ
దట్టుఁడై వడి సుయోధనుఁ డుగ్రవృత్తి
వెడలి యార్చుచుఁ దాఁకి విష్ణునందనుని
దడయక శస్త్రాస్త్రతతుల నొప్పింపఁ 260
గనిపోయి తిరిగి యగ్గలికమై వేఁచి
తన రథంబఖిలవర్తనలఁ గ్రీడింపఁ

బడియార్చి విలుగుణధ్వని చేసి శరము
లడరింపఁ గురుసేన నందొక్క పెట్ట
మురిసె రథంబు లమ్ముల గీటణంగెఁ
గరులు రోఁజుచుఁగూలెఁ గాల్బలం బణఁగెఁ
దరమిడి సాంబు కోల్తల కోహటించి
తిరిగి సేనలు రాజుదిక్కున కొదుఁగ
గినిసి యాతని శల్యకేతుఁడు దాఁకఁ
గని రాజుతమ్ముఁడు గర్ణ సౌబలులు
వెనుఁబ్రాపుగా బాణవృష్టి వేల్పుటయు
ధనువుసారించి యాదైత్యారి సుతుఁడు
కాఁడగ నేడు మార్గణముల నేసి
యేడు బాణముల మహీశు నొప్పించి
యతని తమ్ముని నాల్గుటమ్ములఁ గ్రుచ్చి
శతసాయకంబులు శకునిపైఁ గప్పి
తొలఁగక శల్యకేతుని విల్లుఁ దునిమి
బలముల శరపరంపరలఁ గూల్చుటయు
నతని విక్రమకేళి కచ్చెరు వంది
యతులితంబగు యోధులందఱుఁ గూడి 270

—: కురువీరులందఱుఁ గూడి సాంబుని విరథునిగాఁ జేసి పట్టుకొనుట :—

కురుపతి విలుద్రుంచెఁ గొసరేది కర్ణుఁ
డరదంబు నుగ్గాడె హరుల గీటణఁచె;
విరథునిగాఁ జేసి వెలఁదుకతోన
యరదంబుపై నిడి యతనిఁ దోతెంచె.

నాకన్య బెగడొంద నాకుమారకునిఁ
జేకొని బంధించి చెఱఁబెట్టిరంత.

—: బలరాముఁడు యాదవుల కోపమును జల్లార్చి స్వయముగా
హస్తినాపురికి వెడలుట :—

కరిఘోటరథభటోత్కరములతోడఁ
గరిపురిపై దండుగదలుటఁ జూచి
బలభద్రుఁ డది " యెంతపని మీర లేమి
తలఁచి కౌరవులపై దండుపోయెదరు?
యాదవులందు నెన్నడు కౌరవులకు
భేదంబు లేనిచోఁ బ్రీతి నందెఱిఁగి
యేమిచేసిన వార లేమన్న వారొ!
ఆమార్గ మెల్లను నఱసి సామమునఁ
దెలిసి సాంబునిఁ దోడితెచ్చుటఁగాని
కలహంబునకుఁ బోవ కారణం బేమి? "
అని వారి వారించి యట రథం బెక్కి
చనియె నుద్ధవుఁడు తోఁ జనుదేర సీరి.
అరిగి వారణపురోద్యానంబులందు
కర మొప్ప విడిసి యక్కామపాలుండు 280
దనరాకఁ జెప్పి యుద్ధవుఁ బంపుటయును
జని యమ్మహాత్ముఁ డాస్థానంబు నందుఁ
గురురాజు సచివు శకుని దుస్ససేనుఁ
గురుభీష్మకృపబాహ్లీకులు గొలువంగఁ
గొలువున్న యతనిఁ గన్గొని పొడచూపి
బలభద్రురాక నేర్పడ జెప్పుటయును;

నతిసంభ్రమంబున నంతటుఁగూడి
యతని సన్నిధి కేఁగి యర్థిఁబూజించి
సేమంబులడిగి యాసీరి నీక్షించి
“ ఏమివిచ్చేసితి రెఱిఁగింపుఁడనిన ”
ధార్తరాష్ట్రులును బాంధవులును వినఁగ
నార్తరక్షణశీలి హలపాణి పలికె.
“ కోరి మామేనత్త కొడుకులు మీరు.
ఆరూఢి మీకు మేనల్లుఁడుగానఁ
దన మేనమఱఁదలిఁ దరళాయతాక్షిఁ
జనవునఁ గొనిపోయె సాంబుఁడు దీనఁ
గలఁగి విరోధింపుట ర్థ్వాంబుగాదు
వెలఁదితో నాతని విడిచి తెండ” నన.
అల్లన నవ్వుచు నాసుయోధనుఁడు
ప్రల్లదంబున బలభద్రుతో ననియె. 290

—: హేళనచేయు సుయోధనునిపై నాగ్రహముచే సీరి హస్తినాపురిని నాగలిమొనచే లేవనెత్తుట :—

“ అకట! గురుస్థానమని నిన్నుఁజూడ
మొకమొకపడు మందమేళముల్ తగునె!
[1]ఒకనిఁ గొల్చిన వారలుర్విలో మీరు !
ఆదిగర్భేశ్వరులగు కౌరవులకు
యాదవులకు వియ్యమందఁగఁ దగునె?
మిమ్మేలురాజును మీరును నాకు

---

[1]ఒకపాదమున్నది.

నెమ్మి యీడొనరింప నెంతటి వారు!
వారి మంచితనమున నన్నియు నొప్పె
జరగుట సల్లాపసహజభోజనము
సలిపి మన్నించినఁ జనవున మీరు
కలసి వర్తింతురుగాక యేనాట
నెక్కడి బాంధవంబిక! మాకు మీకు
ఫక్కి వోనాడఁగఁ బని లేదు వేగ
విచ్ఛేయుమను కురువిభుఁ జూచి సీరి
చిచ్చులో నెయ్యిఁబోసిన భంగి మండి!
"కాలుఁడు ప్రేరేపఁ గానక యిట్లు
ప్రేలెదవేల? నీపెంపెల్లఁ బొలియ
వరుసనెఱుఁగక వదరెదుగాక
హరికి నీకును నేది యంతర మోరి! 300
ఎవ్వరు నాకుమీ రెందఱున్నారు?
ఎవ్వరుగలరు నీకీ బారి గడప!
నీబలంబులు నిన్ను నీపట్టణంబు
నాబాలవృద్ధమై యమునలో వైతు!"
అనిపేర్చి దర్పించి హలదండమెత్తి
ఘనరౌద్రలయకాలకాలుఁడో యనఁగ
కరిపురికోట నాఁగటి వాతఁగుచ్చి
భరమున నుంకించి పటుశక్తిఁ దివియ;
నదియొడ్డగిలి పడ నఖిలమానవులు
బెదరి నిల్వఁగ లేకఁ బృథివిపై వ్రాల
భీతిల్లి సంధులు పృథివి వేచఱువ
నాతురారావంబు నందంద చెలఁగ

నాంబికేయుఁడు విని హలిచందమెఱిఁగి
సాంబుని విడిచి లక్షణసమేతముగఁ
దోకొని సకలబంధులుఁ దన్నుఁగొలువ
నాకారవేశ్యుఁ డాపగాతనయు
విదురుల మాట నిర్విణ్ణుఁడై వినుచు
బదరుచు నేతెంచి బలభద్రుఁగాంచి

—: కురుపతి బలరాముని బ్రార్థించుట :—

ముదము తత్తరపాటు మొలవంగ నతని
పదపంకజములకుఁ బ్రణమిల్లి నిల్చి 310
యాతనిదెస మొగంబై కేలుమొగిచి
యాతురఫణితి నిట్లని విన్నవించె.
"దేవదేవారాధ్య! దివ్యావతార!
భావగమ్యాకార! భక్తలోకేశ!
శ్రీధరణీధర! శేషావతార!
మాధవ! నిగమవాఙ్మయ నిర్వికార!
వెయ్యిపాదంబులు వెయ్యిచేతులను
వెయ్యితలల్ రెండువేలుజిహ్వలును
గలిగి యుండొక ఫణాగ్రమున నీజగతిఁ
గొలఁది నీలమ్ముభంగిఁగొని తాల్చునీవు
భూతాళి బుట్టింప బ్రోవ శిక్షింప
చాతుర్యుఁడవు నీవు సకలలోకేశ!
నీతత్త్వమెఱుఁగంగ నేరక క్రొవ్వి
యీతఁడాడిన మాటలెల్లను సైఁచు!
రక్షించు! మీయుపద్రవము వారించు!

అతుఁయబలరామ !" అనిసంస్తుతింప
ఘనప్రసన్నాత్ముఁడై కామపాలుండు
తనరార నంబికాతనయు మన్నించి
హాలముఖ మొడలించె నప్పరికోట
బలరాముచే బాధపడి కొంత యెత్తి 320
నేఁడును జూపట్టె నెతి ... ము మహిమ !
పోఁడిగా వినుతింపఁ బోలదెవ్వరికి
కురుపతి యల్లునిఁగూతును ననిచి
యరణంబు పదివేలు హరులును గరులు
మూఁడు వేల్రథములు మొగినాల్గువేలు
పోఁడిగా నిచ్చి యప్పుడు దోడుకొనుచు
ద్వారకకే తెంచెఁ దాలాంకుఁడంత ;
శౌరి యంతయు విని సంతోషమందె.
అని చెప్పుటయు రామునతుల విక్రమము
విని కురుప్రవరుండు విస్మయంబంది
" పరమయోగీశ్వర ! బలభద్రు మహిమ
సరసిజాసనుకైనఁ జర్చింపరాదు
హరియెట్లు విహరించె నటమీఁది కథలు
పరిపాటి నాకు నేర్పడఁ జెప్పుఁడనిన "
బాదరాయణియు నప్పద్మాక్షు మహిమ
నాదరంబున వినుమని చెప్పఁ దొడఁగె.
నరకునిద్రుంచి యానలిన...చనుల
వెరవార పదియాఱువేలనూఱ్వురను
పరిణయంబయ్యె నాపంకజోదరుఁడు
| పొ ఘరపేది యుండఁ బొందునా ! ఒకతె 330

—: నారదుఁడు శ్రీకృష్ణుని లీలలను జూడనేతెంచుట :—

మఱిగివర్తించునో! మఱి నేర్పుకొలఁది
యరసివచ్చెదఁగాక యనుచు నారదుఁడు
వరభక్తి నేతెంచె వడి ద్వారవతికి.
చనుదెంచుచో సత్య సదనంబునందుఁ
దనుపారుఁ బారిజాతమునీడ నొప్పు
విరులచప్పరములో విశదమై పొలుచు
పరువంపు పువ్వులపానుపు మీఁద
పల్లవశ్రీమించి పరగుకెంగేల
నల్లన రుక్మిణి యడుగులొత్తుచును
కాళిందిసతియు [1]లక్షణయును నిలిచి
తాలవృంతంబులు దనుపార వీవ;
తమ్ములమీయంగఁదగ మిత్రవింద ;
యమ్ముకుందునకు నానందమొదింప
శంబరాంతకు మూలశక్తియో యనఁగఁ
బంధినరాగసంభ్రమచిత్త యగుచు
జాంబవతీదేవి చందనంబలఁద ;
కంబుకంఠలు మదిఁగరము సంతసము
నలి సత్యభామయు నాగ్నజిత్తియును
సలలితంబైన వింజామర లిడఁగఁ; 340
కెంగేలఁ గేలును గీలించి భద్ర
యంగుళాగ్రములొత్తి యందంద తివియ ;
లాలితమంగళాలాపంబులొలయఁ

[1] ఒకపాదమున్నది.

గెల్చిమై నింతులు కెలఁకులఁ గొలువ ;
మండితకోటీరమణికాంతి నిగుడ
కుండలరుచులు చెక్కుల నవ్వులొలయఁ ;
చెనకికౌస్తుభమణి శ్రీవత్సరుచుల
వనమాల యురమున వాసనఁ జూప ;
ఆయత శంఖచక్రాది చిహ్నములఁ
గేయూరకంకణాంకిత బాహు లొలయ ;
హాటకరుచిరచేలాంచలద్యుతులఁ
బాటిల్లి బాలాతపస్ఫూర్తి నిగుడ ,
తెల్లదామరమీఁది తేఁటి చందమున
నల్లనిమేను నున్నతశయ్యఁ జేర్చి
[1]సుదతులతోఁగూడి సుఖగోష్ఠినున్న
యారూఢయౌవను నంభోజనయను
నారాయణుని సచ్చిదానందుఁగాంచి
మఱుఁగున నిలుచుండి మహతి మీటుటయు ;
నెఱిఁగి దిగ్గనలేచి యెదురేఁగి మ్రొక్కి- 360
యమ్మునిఁ దోతెంచి యర్ఘ్యఁ బూజించి
క్రమ్మన నెమ్మోముఁ గనుఁగొని పలికె.
" ఓమునీశ్వరచంద్ర ! యోగీంద్రవంద్య !
నేఁడు మేలీకు ? నీశిష్యులు సుఖులె ?
మామీఁదకృపఁగల్గి మమ్ము మన్నించి
యేమివిచ్చేసితి రెఱిఁగింపు " మనిన
నల్లనవ్వుచు హరి కేలువాణి
పల్లవంబులఁ బట్టి పలికె నమ్మౌని.

---

[1] ఒకేపాఠమున్నది.

"ఆదినారాయణ! అఖిలాండనిలయ!
వేదాంగవాహన! విశ్వప్రకాశ!
విశ్వంభరాంబర! విశ్వంభరాఖ్య!
విశ్వాత్మ! నిత్య! సువిజ్ఞానరూప!
నీపేరు భవదుఃఖనీరధి తేప!
నీపాదములఁ బుట్టె నిఖిలతీర్థములు
తీర్థపూతుఁడవీవ తీర్థంబు నీవ
తీర్థఫలంబిచ్చు దేవుఁడ వీవ
నీరజభవుఁడును నీతత్త్వ మెఱుఁగ
నేరఁడు ననుఁబోఁటి నేర్చునే కృష్ణ!
నిన్నుఁ జూడఁగలేని నీరసాత్మకులఁ
గన్నులు కన్నులే కమలాభిరామ! 360
జలజాక్ష! నీపాదజలజాతయుగముఁ
దలఁపనేరని దుష్టతముల నేమందు!
తప్పక నీమూర్తి దర్శించి మ్రొక్కి
యిప్పుడే పనివింటి నిందిరారమణ!
కన్నులఁ జల్లగాఁ గనుఁగొంటి మంటి
నన్నిచందంబుల నేకృతార్థుఁడను!"
అనిపల్కి కృష్ణున కందంద మ్రొక్కి
చనియె నారదుఁ డొండు సదనంబు లోని

—: శ్రీకృష్ణలీలలు :—

కక్కడ హరి యుద్ధవాచార్యుల తోడ
నక్కజంబుగ జూదమాడఁగఁ జూచి
యతనిచేఁ బూజితుఁడై వేఱె యొక్క

సతియింటి కరుగుచో శస్త్రాస్త్రలీల
లభ్యసింపుచునున్న హరిఁగాంచి క్రొక్క
యభ్యుదయంబని యటవోయి చూడఁ
జిన్నిపాపల బొమ్మపెండ్లిండ్లు సేయు
చున్న వెన్నునిఁగాంచి యుల్లంబులోన
సంతసిల్లుచునుండి మంత్రులుఁదానుఁ
దగుకార్య మూహింప ద్వైత్యారిచేత
నగణితంబుగఁ బూజలంది యాహాని
యటపోయి చూచుచో నశ్వరత్నంబుఁ
జటులత నెక్కి బజ్జళ్లఁ ద్రొక్కించు ;
మరియొక్క యింటిలో మగువలు దాను
సరమి దాఁగలి ముచ్చులాడంగఁజూచి
యాదట నొకయింట నమలధేనువులు
భూదేవులకు ధారఁబోయఁగఁ జూచి ;
యుండొక్కయింటిలో వెన్నుఁడు సతులు
కుండలీనృత్యంబుఁ గోరి యాడింపఁ
గనుఁగొనె, నాయింట కజ్జాలు వంచి
పెనుపార సతులకుఁ బెట్టంగఁజూచె ;
ఇద్దసమాధిభూయిష్ఠుఁడై యొక్క
శుద్ధాంతమున నుండఁజూచి యిబ్బంగి
పెరవార పతియాఋవేవుర యిండ్ల
పరిపరివిధములఁ బంకజోదరుఁడు
కోరి క్రీడింపఁ గన్గొని దేవమౌని
శౌరిసత్యజ్ఞానసంపదలాత్మ
నచ్చెరువందుచు హరిఁబ్రస్తుతించి 870

యిచ్చ నెంతయు మెచ్చి యిట్లని పలికె.
" సర్వభూతాత్మక! సతతంబు మెఱఁగు
సర్వజ్ఞుఁడవు నీవు సకలలోకేశ! 380
మానుషతను బొంది మహనీయ యిట్టి
జ్ఞానాధికుఁడౌట చర్చింప నరుదు!
యోగమాయారూఢి నొనరిన నిన్ను
యోగీంద్రులును గాన నోపరు కృష్ణ!
ఏయుగంబులయందు నెవ్వరు మున్ను
నాయంత నెఱుఁగరు నలినాక్ష నిన్ను!
నీతత్త్వరూపంబు నెటఁ బెక్కుగతులఁ
జేతోగతంబయ్యెఁ జెన్నార నాకు!
నొక్కఁడ వయ్యును నురుపుణ్యమూర్తి!
పెక్కురూపులుదాల్చి పెంపొందుచుండి;
గురుఁడును దండ్రియుఁ గోరి దైవంబుఁ
బరమాత్ముఁడవు పరబ్రహ్మంబు నీవ!"
అని ప్రదక్షిణపూర్వమై వచ్చి మ్రొక్కి
జననాథ! నవ్వుచుఁ జనియె నారదుఁడు
హరియుఁబదాఱువేలంగనాజనులు
మరిగి వర్తించిన మహనీయకథలు
చదివిన వ్రాసిన సద్భక్తి విన్న
మదిలోఁ దలచిన మనుజోత్తములకుఁ
గరమొప్ప ధర్మార్థకామమోక్షములు
దొరకును భవదుఃఖదోషంబుల ణఁగు 390
నని చెప్పి శుకయోగి యప్పుణ్యచరిత
లనఘ! వెండియు వినుమని చెప్పదొడఁగె.

నారదు డీడ్చ్కాల్పి నలినాక్షుఁడంత
నారులు దాను నున్నతకేళిసలుపఁ
గమలారి యామినీకన్యకఁ బ్రీతిఁ
గ్రమమొప్పఁ బెండ్లికి గాఁగోరు దేర

—: సాయంకాల వర్ణనము :—

చరమాద్రి యను కలశము నీటిలోన
గురువెట్టిన ఘుడియకుడుకయో యనఁగ!
పరపైన ద్విజవాక్యఘణతులు; చెలఁగఁ
గరమొప్పఁ గ్రుంకె భాస్కరమండలంబు;
ఎఱసంజ యడరి కెంపెక్కె నంబరము;
తఱితఱిఁ బొడఁజూపెఁ దార లందంద,
ఆలోన సకలదిశాక్రాంత మగుచు
మేలైన కృష్ణుని మేచాయఁ బోలె
నెఱినొప్పఁ గాళింది నీరంబువోలె
తఱచైన తేఁటుల దాఁటుల వోలె
పెనుపైన నీలాలపేరులు వోలె
ఘనమైన యేనుఁగ కదుపులు వోలె
తలినొప్పు నీలోత్పలంబులు వోలెఁ
బాలుపైన కస్తూరి ప్రోగులు వోలెఁ
దొలుకారుకాంతులు తుఱుములు వోలెఁ 400
డలమీరి చీఁకటి దట్టమై పేర్చి
ఘనతమోవారణగర్వంబులణపఁ
గొనకొన్న సింగంపు కొదమకో యనఁగ
రాకావధూమణి రాగిల్లి చూచు

ప్రాకట రత్నదర్పణమకో యనఁగ
శార్వరీసతిముఖజలజమో యనఁగఁ
బూర్వపర్వతముపైఁ బొడమెచందురుఁడు ;
తఱిమి దిక్పతుల దంతవుకరాటమున
నెఱయఁ గర్పూరంబె నించిన మాడ్కి
పర్వైన బ్రహ్మాండభాండంబు నిండి
కరమొప్ప విలసిల్లె కౌముదీలక్ష్మి ;
అంతట పీడితులై చకోరములు
వింతనైఁ బఱతెంచె వెన్నెలఁ గ్రోల;
వెరవార గృష్ణుఁడు వెన్నెలబైటఁ
దరుణులు దానును దగ వినోదించి
నందఱ్ యిండ్లను సమరు పాన్పులను
నందఱఁ గ్రీడించె నన్నిరూపములఁ
దెఱవలుఁ దారు మోదిలి యుండిరంతఁ
దఱనుగా నెలుగించెఁ దామ్రచూడములు. 410

—: శ్రీకృష్ణుఁడు మేల్కని ప్రాతఃకాల కృత్యములఁ దీర్చుకొనుట :—

వందిమాగధ భాగవత నినాదములఁ
గ్రందున శౌరి మేల్కని ధర్మచింతఁ
దలపోయుచును లేచి తల్పంబు డిగ్గి
కలధౌతమయపాదుకలఁ బ్రేమఁ దొడిగి
యువిదలు కైదండలొసఁగి తోనడువ
రవణించు కనకవజ్రపు బిందియలను
జలకములాడి వస్త్రములు మైఁదాల్చి

సలలితంబుగఁ దీర్చి సంధ్యకృత్యములు.
ఎసగంగ నుదయాచలేంద్రంబు మీఁది
పసిఁడి కోహళియన భానుఁడు వొడువఁ
గలగొన కర్పూరగంధ వాసనల
నలరెడి విరులచే నతిభక్తితోడ
దేవార్చనంబు భూదేవార్చనంబు
దైవపైతృకములు తెఱఁగొప్పఁ జేసి
తిలభూహిరణ్యాదిధేను దానముల
సలలితంబుగ విప్రసంఘంబుఁ దనిపి
కోరి విద్వజ్జన గోష్ఠి నాలించి
యారూఢగతిఁ దత్త్వార్థంబుఁ దెలిసి
యంబరాభరణమాల్యానులేపములు
తాంబూలములు నిచ్చి తగ వీడుకొల్పి 420
దివ్యమాల్యంబులు దివ్యగంధములు
దివ్యభూషణములు దివ్యాంబరములు
ధరియించి తగ నాజ్యదర్పణద్యుతులు
పరికించి మోసాల బయలికేతెంచి
పటహకాహళశంఖపాటకారావ
పటుతరాశీర్వాదభద్రనాదములు
తరమిడి మ్రోయ నందకశంఖచక్ర
వరగదాశార్ఙ్గదుర్వారశస్త్రములు
పురుషరూపముఁ దాల్చి పొరిఁదన్నుఁ గొలువ
కరుణాకటాక్షవీక్షణరోచు లొలయ

నల్లన నవ్వుచు నఖిలబాంధవులఁ
జల్లని చూపుల శౌరి వీక్షింపఁ
దేరాయతము సేసి తెచ్చి మ్రొక్కుటయు
దారకుఁ గని నవ్వి తగ రథంబెక్కి
పసిఁడిబ్రద్దఁ బూని పడవాళ్లు మ్రోయ
నెసఁగ సందడి జడియించి తో నడువ
నగరి సుధర్మాఖ్యయగు సభాస్థలిని
కరమొప్పు ముత్యాల గద్దియ మీఁద
వీరాసనస్థుఁడై విష్ణుఁ డొప్పారె.
చేరి రసజ్ఞులు సేవకోత్తములు 430
నగణిత నీతివిద్యావిశారదులుఁ
దగ మంత్రి సామంత దండనాయకులు
నల్లుఁడు కొడుకులు నఖిలబాంధవులు
నెల్లసంపదలతో [illegible]పారి కొలువ
అందంద కరకంకణారావ మెలయ
చందనగంధులు చామరల్ వీవఁ
గొలువెల్లఁ దామరకొలను చందమున
నలరి సేవింపఁగ నధికమోదమున
నగ్రజుఁడును దాను యమ్మురారాతి
యుగ్రసేనునిఁ గొల్చియున్న యావేళ
దౌవారికులచేతఁ దగఁ జెప్పి పనిచి
యావాసుదేవుని యనుమతిఁ బడసి
చనుదెంచె నొక్కఁ డాజలజాత నేత్రుఁ
గని మ్రొక్కి పలికె నక్కటికంబుఁ దోఁప.

—: రాజులచేఁ బంపఁబడిన దూత శ్రీకృష్ణుని యెదుట మొర వెట్టుట :—

" జగతి భారముమాన్ప శత్రుల నడప
సగణితంబగు సాధులగు వారిఁ బ్రోవ
యాదవాన్వయమున నవతార మొంది
తాదినారాయణ! అమరేంద్ర వంద్య!
మగధ భూపాలుఁడు మది నోట లేక
జగతీశ్వరులనెల్లఁ జంపుచున్నాఁడు! 440
వెఱవేది యిరువుర వేవుర నృపులఁ
జెఱఁబెట్టి మదిఁ గృపచింత వోవిడిచి
తరమిడి దినమొక్క ధరణీశవరునిఁ
బోరివుచ్చి భైరవపూజఁగావించు.
అతనికి లోఁబడ్డ యవనీశులెందుఁ
గతిలేక యున్న మీకడకుఁ బుత్తేర
నరుదెంచినాఁడ నీ వా జరాసంధుఁ
బరిమార్చి నృపకోటిప్రాణంబు లెత్తు
మేవిధంబున నైన నీకారిఁ గడవ
నీవొకాకొక్కఁడు నేర్చునే కృష్ణ!
ఇది నీకు విక్రమంబిది నీకుఁ బెంపు!
ఇది నీకు శౌర్యంబు యింది రాధీశ!
కీర్తియు సుకృతంబు గెలుపు నీకబ్బు!
ఆర్తుల రక్షింపు మంభోజనయన!"

—: నారదుని యాగమనము :—

అని దూత వినుతింప నంత నారదుఁడు

ఁ నుదెంచె దివినుండి శౌరిసన్నిధికి.
అమ్ముని కెదురేఁగి యర్ఘ్యపీఠముల
నిమ్ముల నిలిపి మోమిూతీంచి పలికె.
"మునినాథ! త్రిభువనంబుల వార్తలెల్ల
ఘనదివ్యదృష్టిని గననివి లేవు! 450
ఏమి విశేషంబు లెఱిఁగింపు" మనిన:
ఆముని నవ్వుచు హరిఁ జూచి పలికె.
"నీమహత్త్వంబున నిఖిలంబుఁగాంతు
నీమాయకడఁగాన నేరకున్నాఁడ!
కోరి నీ మేనత్తకొడుకు ధర్మజుఁడు
సూరివంద్యుఁడు రాజసూయాధ్వరంబుఁ
జేయనుద్యోగించి చెచ్చెర నిన్ను
శ్రీయుక్తి నాచార్యుఁ జేయనున్నాఁడు!
ఆమఘంబీక్షింప నఖిలదేవతలు
భూమీశ్వరులు వేడ్కఁ బోవుచున్నారు
నీరజాయతనేత్ర నీవువిచ్చేసి
బోరన రిపుకోటిఁ బొరిమార్చు వేగ
నచ్చట శిశుపాలుఁ డడరి నీచేతఁ
జచ్చు నీపయనంబు సఫలమౌ నది యు,
పోరి జరాసంధుఁ బొరిమార్ప నెట్టి
వీరుల కెందును వెరవుగాదెందు!
అతఁడు భీమునిచేత నట మల్లయుద్ధ
హతుఁడౌను యన్యుల కతఁడ జేయుండు.
భీమునిచేతను బెరపెట్టి చంపు
నే మీరు నెఱిఁగింప నే తెంచినాఁడఁ 460

—: నారదుని మాటలను విని శ్రీకృష్ణుఁడుద్ధవాచార్యుని యభిప్రాయము నడుగుట :—

బని విని యదనం''చుఁ బద్మాక్షు వీడు
కొని నారదుఁడు బోవ గోవిందు డంత
నయ్యుద్ధవునిఁ జూచి యంతరంగమున
నెయ్యంబు లియ్యంబు నెరయ నిట్లనియె.
"నీతియు ధర్మంబు నేర్పును హితవుఁ
జాతుర్యమును గల సత్యసంధుఁడవు;
కడఁకతోఁ గార్యంబుఁ గనుచోట మాకుఁ
గడునొప్పు మీరలె కన్నులు బుద్ధి"
యనుటయు నుద్ధవుఁడంబుజోదరునిఁ
గనుఁగొని నమ్రుఁడై కడునొప్పఁ బలికె.
"ఇందిరాధీశ! నీ వెఱుఁగని కృత్య
మెందును గలదె నన్నిలఁ బెద్దఁ జేసి
మన్నించి యడిగెద మార్గంబుఁ దెలియ
విన్నవించెద నర్థి విను"మని పలికె.
"పరమబంధుఁడు నీకు పాండవాగ్రజుఁడు
సురుచిరంబుగ రాజసూయంబు సేయఁ
దలఁచినయట్టి యధ్వరకృత్యమునకుఁ
గలఁకవ లేకుండఁ గాచి రక్షింపు!
ప్రాణంబుతోడ జరాసంధుఁడుండ
స్థాణునకును గావ శక్యంబు గాదు! 470
వాని నేగతినైన వధియింపకున్న
పూను జన్నంబు సంపూర్ణంబు గాదు.
ఘనబలాఢ్యుఁడు గాన కదనంబులోనఁ

జేసికి యెవ్వానికి నిర్జింపఁగా నరిది
యనిలజార్జునులతో నాపురికేఁగి
చని విప్రవటులయాచందమై వేఁడి
మల్లయుద్ధంబున మరి భీముచేత
నెల్లభంగుల వాని నేపడగింపు
మాతఁడు దీరిన నఖిలరాజులకుఁ
బ్రీతియౌ పగదీఱఁ బెంపొందు నీకుఁ
దగ జరాసంధుచేతను బద్ధులైన
జగతీశ్వరులఁ బ్రోవఁ జనుటయే లెస్స".

—: శ్రీకృష్ణుని ఇంద్రప్రస్థ ప్రయాణము :—

అని యుద్ధవుండిటు లాడువాక్యములు
విని సంతసము నొంది వెన్నుఁడా ప్రొద్దె
యానకదుందుభి హలపాణి యుగ్ర
సేనాదులనుమతి సేయంగఁ గదలి
భూతలాధీశులు పుత్తెంచినట్టి
దూతకభీష్ట వస్తువులిచ్చి యనిపి
పటుసైన్యసంఘము పుష్పక బలాకాది
చటులవాజులఁ బూని సన్నద్ధలీల 480
గరుడకేతన కాంతిఁ గడునొప్పు తేరు
గురుతరంబుగ దారకుఁడు దెచ్చి మ్రొక్క
నారోహణము సేసి యఖిలబాంధవులుఁ
దోరంపు వేడుకతోఁ గొల్చి రాఁగఁ;
జెలువారు కాంచన శిబిరంబు లెక్క
మొలమి పట్టపుదేవులెనమండ్రు నడువ;

[1]వలనొప్ప పటహాదివాద్యంబు లొలయ
వందిబృందములు [2]కైవారంబు సేయ
సందడి పడవాళ్లు జడిసి తోనడువ
నతివైభవముల నిత్యప్రయాణములఁ
జతురతఁ బెక్కు దేశములుత్తరించి
జలజాతనేత్రుఁడు సకలసంపదలఁ
బొలుచునింద్రప్రస్థపురము కేతెంచె.

—: ధర్మజాదులు శ్రీకృష్ణుని సమ్మానించుట :—

అమ్మహాత్మునిరాక యరసి ధర్మజుఁడు
తమ్ములుఁ దాను బాంధవులతో నెదురు
వచ్చి నమ్రుండైన వసుదేవతనయు
గ్రుచ్చికౌఁగిటఁ జేర్చె; గోవిందుఁ డంత
ననిలనందను బ్రేమ నక్కునఁ జేర్చి
తనకు మ్రొక్కిన మాద్రి తనయుల నరుని 490
ననువార నాలింగనము సేసి వార
లండఁ గొల్చిరా సమరేంద్రులీలఁ
జెంది యప్పురిఁ బ్రవేశించె మురారి.
పౌరుల కన్నులపండువ గాఁగ
భూరిపుణ్యుఁడు పాండవుల నగరికి
నరిగి కుంతికి మ్రొక్క నమ్మహాదేవి
కరమొప్పఁ గృష్ణుని గౌఁగిటఁ జేర్చి
యానందరసముబ్బి యులుగులుఁ బారఁ

[1]ఒకే పాదమున్నది. [2]ఒకే పాదమున్నది.

బూని యందఱుఁ బ్రేమఁబూజించి కుంతి
పాంచాలసుతయు సుభద్రయుఁ గృష్ణుఁ
గాంచి సాష్టాంగంబు కరమర్థి నెఱఁగి
హరి కాంతలును దాను నన్యోన్యప్రేమఁ
బరిరంభణముల సంభావన క్రియల
నలిపి యింపార మజ్జనభోజనములఁ
గలసి క్రీడించిరి; కమలాక్షుఁడంత
నాపాండవుల సేమమంతయు నరిగి
యాపార్థు గృహమున కరుగ నన్నరుఁడు
మజ్జనభోజన మహిత సౌఖ్యముల
నజ్జగన్నాథుని నతిభక్తిఁ దనిపి
హంస తూలిక పాన్పునందు సంప్రీతిఁ
గంసారి నునిచి కాల్గడనుండి క్రీడ
నడుగు లొత్తుచు నుచితాలాప లీలఁ
గడఁగి వినోదింపగా ధర్మసుతుఁడు
చనుదెంచుటయు శౌరి చయ్యన లేచి
తనర నాన్నృపు కరస్థలిబట్టి తివియ
నేక శయ్యను వారలిరువురు నుండఁ
జేకొని తమ్ములు సేవించియుండ
"నారగించితే కృష్ణ!" అలసితి వనుచు

—: ధర్మరాజు రాజసూయయాగ విషయమై శ్రీకృష్ణుని
యొకట ప్రస్తావించుట :—

శౌరితోడ నజాతశత్రుఁ డిట్లనియె.
లోకబాంధవ చంద్రలోచన! భక్త

500

లోకరక్షణ! సితశ్లోక! లోకేశ!
నీ వెఱుఁగని యవి నిఖిలంబు లందు
లేవెల్ల యెడల నిర్లేపుండ వీవ
విభుఁడ నీ కెఱిఁగించు విన్నప మొకటి.
అనఘాత్మ! రాజసూయము పేరి క్రతువు
సేయుదు నని మదిఁ జింతించినాఁడ
నేయుపాయంబున నిదిసిద్ధి బొందు
నానతిమ్మనుఁడు నాయమతనూభవుఁ
డాసనంబీక్షించి హరి ప్రీతిఁ బలికె. 510

—: శ్రీకృష్ణుఁడు రాజసూయయాగము నాచరింప వలసినదిగా ధర్మపుత్రుఁ బ్రోత్సహించుట :—

కౌరవవృషభ! లోకము రాజులకును
యేరీతి సిద్ధింప దీమహాక్రతువు
ధరణీశ! నీవు నీ తమ్ములు బలిమి
దొరకని కార్య మెందును గలదయ్య!
పితృదేవ సద్విజప్రీతి గావింపు
టతిశయమగుపుణ్య మయ్యధ్వరంబు!
రాజులఁ గెలిచి వారల ధనావళుల
రాజసంబునఁ దెచ్చి రాజసూయంబు
వెలయింపవలయు దిగ్విజయంబు సేయఁ
దలఁచిన వేగ నీ తమ్ములఁ బంపు"
మని చెప్పుటయు విని యమనందనుండ
నసుజుల దిగ్విజయార్థంబు వనుపఁ

—: పాండవులు దిగ్విజయ యాత్రకై వెడలుట :—

జటుల బలాఢ్యుఁడై సహదేవుఁ డెలమి
యట దక్షిణంబున కరిగె పెంపొంది,
నకులుఁ డుదగ్రసైన్యము తన్ను గొలువఁ
బ్రకటితంబుగ నేఁగెఁ బడమటి కడకు;
ఘనబలోపేతుఁడై కదలి యర్జునుఁడు
ధనదు దిక్కునకు నుద్ధతవృత్తి నడచె;
సేనంబుతోడుత సెలఁగి పూర్వదిశకు
భీమబలాఢ్యుఁడై భీముఁడుఁ గదలె; 520
సీభంగిఁ జని దిక్కులెల్ల సాధించి
యాభీలరణకేళి నహితుల నోర్చి
కరిహయమాణిక్యకనక నిష్కములును
వరరత్నభూషణావలు లొప్పఁ దెచ్చి
ధర్మనందనునకుఁ దగ వేఱువేఱ
నర్మిలి నొప్పించి యనుజు లిట్లనిరి.
"జననాథ! విను జరాసంధుఁడు దక్క
మన కిరి వెట్టని మహిపుఁడు లేడు
వాని నిర్జింప కధ్వరకృత్యమునకుఁ
బూనఁగఁ దలఁచుట బుద్ధిగా దెందు."
అని పల్క నుర్వీశుఁడగు ధర్మసుతునిఁ
గనుఁగొని బోధించి కంసారి పలికె.

—: శ్రీకృష్ణుఁడు జరాసంధు నోడించెదనని చెప్పుట :—

"జననాథ! నీ భుజశ్రీయుక్తి దలఁప
నెనయ జరాసంధుఁ డెంతటి వాఁడు?

మల్లయుద్ధంబున మారుతి చేత
నెల్లుండి చంపింతు నిటు జూడు మమ్ముఁ
బనుపుము నీకింత భయమంద నేల!''
అనిపల్కి భీముఁడు నర్జునుఁ డెలమి
తనుఁగొల్చి రాగ నుద్ధత గిరివ్రజము

—: శ్రీకృష్ణుఁడు భీమార్జునులతో బ్రాహ్మణ వేషములను ధరించి గిరివ్రజము ప్రవేశించుట :—

దనర బ్రాహ్మణ వేషధారులై చొచ్చి 580
యరులకభేద్యుఁడై యలరు మాగధుని
వర మందిరమున శరాణ నరిగి
దేవగురుద్విజ తృప్తిఁ గావించు
సావధానుని జరాసంధునిఁ గాంచి
వామనరూపమై వచ్చి యబ్బలిని
భూమి వేఁడినయట్టి బుద్ధులబ్రోచు
యనిలజార్జునులతో నర్థి దీవించి
చనవున నాజరాసంధుతో ననియె.

—: శ్రీకృష్ణుఁడు జరాసంధుని యుద్ధభిక్ష కోరుట :—

"అనఘాత్మ! యీ వంటి కథతోడ మేము
చనుదెంచినారము సకలవస్తువు
నడిగిన లేదన నర్థుల కిచ్చు
కడుపుణ్యనిధివి మాగధరాజతనయ!
ఏమిగోరిన యర్థ మిచ్చి నిచ్చలును
భూమిలోఁ బొగడొందె బొంక వెన్నఁడును!

ఘనకపోతమునకై కండలు గోసి
తనువిచ్చి శిబి ధాత్రి ధన్యుఁడు గాఁడె!
మును హరిశ్చంద్రుండు మొగి కౌశికునకుఁ
దనరార పుత్రునిఁ దగ విక్రయించి
చండాలరూపమై శౌర్యంబుఁ గ్రాఁగి
యుండి తాఁబొందఁడే యూర్ధ్వలోకంబు! 540
ఒక కపోతము తొల్లి యొక కిరాతునకుఁ
బ్రకటమై తనమేను భక్ష్యంబుఁ జేసి
యెట్టి పుణ్యులకైన నెన్నఁగ రాని
యట్టి లోకము గాంచె నని చెప్ప వినవె!
పసుచును కనకంబుఁ బ్రాయంబు నమ్మి
యడిగిన లేదని యర్థి వర్గంబు
నెడపిన పాపాత్ము లందును నందుఁ
జెడిపోవుదురనుచుఁ జెప్పి నతఁడు
వారి తేజంబులు వారి సత్వములు
వారి మేనుల రణవ్రణకిణంబులును
గని మహీనాథులుగా నిశ్చయించి
యనియె వారలతోడ నల్లన నగుచు.
“భూపాలకులు మీకుఁ బుద్ధి యేది! విప్ర
రూపంబు లొంది మా ప్రోలికి వచ్చి
యడుగుచున్నారు మీ రర్థితులుగారు!
అడుగుఁడు ప్రాణంబులైన మీ కిత్తు!
విప్రవేషముఁ దాల్చి వేఁడుట యేత
విప్రోత్తముఁడ స్వయం విష్ణుండ వీవ
యని పలుకఁగ శౌరి యతని కింపునకు

మనములోపల మెచ్చి మగధున కనియె. 550
"అనఘ! యుద్ధార్థులమై వచ్చినార
మేనయుఁ గృష్ణుండ నితఁడు వాయుజుఁడు
వాఁడు కవ్వఁడి మాకు ద్వంద యుద్ధంబు
వోఁడిగా నిమ్మన్న" బొంగి మాగధుఁడు!
"అగుఁగాక మీకోరి నట్ల యుద్ధంబుఁ
దగ నిచ్చినాఁడ యుద్ధతఁ జేర్చిరందు
గోపాల! నీవోడి కురుకుమారకుల
వైపునఁ దెచ్చితి! పడుచుల తరమె!
పసదప్పి నీవోడి పారిన నేల
కసువు మొల్వదు నేఁడు! కాన నీతోడ
సమరంబు సేయుట సమయంబు గాదు
కమలాక్ష! నాకీఁడు గాఁ డర్జునుండు
మల్లయుద్ధంబున మారుతాత్మజుని
త్రుళ్ళడంచెద! మీరు తొలఁగఁగఁ జూడఁ

—: భీమజరాసంధుల మల్లయుద్ధము :—

దనిపల్కి సన్నద్ధుఁడై యూరు వెడలి
చని యొక్కయెడ సమస్థలముఁ గావించి
మారుతాత్మజుఁడును మగధభూపతియు
నీరసంబున డాసి యేపార నంత;
నంత కాకారులై యత్యుగ్ర భద్ర
దంతావళంబులు దగ్గఱు మాడ్కి 560
పటుతర నిర్ఘాతపాతంబులట్ల
చటులతమై మల్లచఱచి యొండొరులఁ

బ[illegible]చు విడుచుచు బాహుపాశములఁ
జు[illegible] విషాణముల్ చూపి యార్చుచును
స[illegible]గు సవ్యాపసవ్య మార్గములఁ
ద[illegible]తి కదిసి మై తాఁకి వైచుచును
గ[illegible] కొమ్ముంటులు గ్రమ్మంగఁ జెట్టు
క[illegible]యుచుఁ జేత గదిమి తప్పుచును
నా[illegible]పంబుల ననువున మ్రోసి
య[illegible]గమును బోలి యుందంద వ్రేయ
ము[illegible]మున డగ్గరి ముష్టిఘాతముల
పడ[illegible]డనంబులు; పటుశక్తిఁ జూపి
భీ[illegible]ని మగధుండు పికిటఁ బొడువ
నా[illegible]రుతాత్మజుఁడ చలుఁడై నిలిచి
వా[illegible]టాలఁ గొని గుండె మోవంగఁ బొడువ
వీ[illegible] మగధభూవిభుఁడుర్వి వ్రాలె!
క్ర[illegible]న లే భీకర ముష్టి హాతుల
న[illegible]త్రుతాత్మజు నందంద నొంప
తలలక నాతఁడాతని జత్రు దేశ
మ[illegible]ముటి బొడిచిన యుంగంబు వడఁక 570
పడి[illegible]పి నిల్చి యాపవమానసుతుఁడు
న[illegible]ముఁ బీడించి విషాణంబు గొనఁగ
జా[illegible]చి యిరువురు సమసత్వ లీల
వీ[illegible]కి నొప్పింప వెన్నుఁడు గాంచి!

—: జరాసంధవధ :—

వాయుపుత్రుఁడు జూచువగ వృక్షశాఖఁ

జేయార్చి రెండుగాఁ జీరి నవ్వాటయు
నాసన్న దెలిచి మహాబలాత్మజుఁడు
ఆసన్నుఁడగు శత్రు నంటంగఁ బట్టి
పడవైచి కడకాలుఁ బరుసనఁ ద్రొక్కి
వెడవెడ నార్చుచుఁ బ్రిదిలి పోనీక
నటమున్ను జరచేత నంటగ బడిన
చటులాత్ముఁడగు జరాసంధుని మేను
తరమిడి కదళికాస్తంభంబుఁ జీరు
కరిఁబోలె నుగ్రభీకర లీలఁ జీరి
యిరువ్రక్కలుగఁ జేసి యిరువంక వైచి
పరువడి నార్చిన పవమానసుతుని
హరియును నర్జునుఁ డండండ పొగడ
సురసమూహము ప్రీతిఁ జూచి కీర్తించె.

—: శ్రీకృష్ణుఁడు జరాసంధుని కుమారుఁడగు సహదేవుని రాజ్యమందునిచి, కారాగృహవాసులగు రాజులను విడిచి పుచ్చుట :—

హరియు జరాసంధియగు సహదేవుఁ
బరగ మగధరాజ్య పట్టంబుఁ గట్టి ; 580
యటిముటిఁ జెరసాలయందున్న నృపుల
వెఱవాపి యందఱ విడిచి పుత్తెంచె.
కారాగృహంబునఁ గడుగాసి సొచ్చి
క్రూరబాధలఁ గంది కుందుచు నున్న
యిరువదివేవురు నెపమన్నాటాళ్ళు
రురుచయ భ్రాంతులై యొండొండ వెడలి
చనుదెంచి కనిరి వాసవలోకవంద్యు

ననుపసుదివ్యభూషాంబరాభరణు
భీమస్తనసమేతుఁ బ్రఘుదీర్ఘబాహు
కామితార్థప్రదుఁ గడు భక్తి మ్రొక్కి;
"శ్రీనాథ! గోవింద! శ్రీవత్సచిహ్న!
దానవాంతక! కృష్ణ! తామరసాక్ష!
ధారుణి రక్షింప ధర్మంబు నిలుపఁ
గ్రూరదైత్యులఁ ద్రుంపఁ గోరి జన్మించి
యాజనార్దనుఁడ వీవామ్నాయరూప!
ఈజరాసంధుచే నీకాఁక నొంది
మునికియు నిది మహదుపకారమయ్య!
ఘనయోగవర్యులు గానఁగ లేని
నినుఁ జూడఁ గంటిమి నిఖిలాండ నిలయ! 5?
తలఁపులుఁ దనువులు దయనిచ్చితీవు
జలజాక్ష! ఇది పునర్జన్మంబు మాకు!
ఖలు జరాసంధు నొక్కట జీవైచి
బలియుఁడై పేర్చునీ బకవైరి లావు!"
అని దీనవదనులై యర్థి కీర్తించు
జననాయకులఁ గృపాజలరాశిఁ దేల్చి
జలజాక్షుఁడంత మజ్జనభోజనముల
నలరించి భూషాంబరాదు లర్పించి
వారల నూరార్చి వలనొప్పఁ బలికె.
"క్రూరాత్ము చెరసాలఁ గుంది కందఁగంది
మఱచ్చట నున్నారు; మొగిరాజ్యలీల

---

[1] ఒకేపాదమున్నది.

లచ్చుగ భోగించుఁ డరుగుడు వేడ్క
మతమత్సరంబులు మాని నే ప్రొద్దు
మదిలోన నన్ను నేమఱకుండుఁ" డనుచు
రాజుల ననిచి జరాసంధి చేతఁ
బూజలు గొని రథంబులు వేడ్క నెక్కి
యనిలజార్జునులతో నతివైభవమున
దనుజారి వచ్చె నింద్రప్రస్థపురికి.

—: శ్రీకృష్ణుఁడు భీమార్జునులతో నింద్రప్రస్థ పురికి మఱలి వచ్చుట :—

వచ్చి యాపట్టణద్వారంబు నందు
సచ్చరిత్రుఁడు పాంచజన్యమొత్తుటయు 600
నారవమాలించి యరుదెంచి పౌరు
లారూఢమగు మహోహర్షంబుతోడఁ
గామాది రహితు నిష్కాము శ్రీకృష్ణు
రామానుజన్ముఁ బురాణ పూరుషునిఁ
గని మ్రొక్కి సంతోష కలితులై రంత ;
అనుజులు కృష్ణుఁడు నరుదెంచి మ్రొక్క
పరమసమ్మదమునఁ బాండవాగ్రజుఁడు
కరమర్థి మువ్వురఁ గౌఁగిటఁ జేర్చి
హరిమోముఁ గని ముదితాత్ముఁడై పలికె
పురుషోత్తమాచ్యుత! పుండరీకాక్ష!
వరద! వామన! భక్తవత్సల! కృష్ణ!
సరసిజాసనవంద్య! సారసనేత్ర!
నీదాసులగు మాకు నిఖిలలోకముల

వేదసాధ్యములగు నిందిరాధీశ!
మఱఁదులు నీవు నమ్మగధేశు మీఁద
యతిమతి నేఁగిన నంతనుండియును
విలసిల్లు నురిగోల వేదనఁ బొందు
పులుగు చందంబునఁ బొరలు చుండితిమి!
చెచ్చెర శత్రునిర్జించి మీరిందు
వచ్చిన ప్రాణంబు వచ్చె గోవింద!" 610
అని పల్కుటయు పాండవాగ్రజుఁ జూచి
వినయంబుఁ దోఁప నవ్విష్ణుఁ డిట్లనియె.
"నీయాజ్ఞ తలమోచి నెగడిన మాకు
నాయెడ జయలబ్ధులగు టెందు నరుదె?
మూఁడులోకములకు ముల్లైన యట్టి
వాఁడు మగధభూమి వల్లభు నట్టె
వాని నశ్రమమున వధియించె భీముఁ
డేను నాసత్వము నేమనఁ గలను!
బెడిదంపు పగదీరెఁ బెంపొంద నీవుఁ
దొడరి యజాతశత్రుఁడ వైతి గాన

—: శ్రీకృష్ణుని ప్రోత్సాహముచే ధర్మరాజు రాజసూయమునకు గడంగుట :—

రాజుల రక్షింప రాజసూయంబు
నోజముఁ దప్పక నొనరింపు మనిన
హరి వాక్యములకుబ్బి యమతనూభవుఁడు
కురుపతి ముఖ్యులఁ గోరి రప్పించి
భాగీరథీతీర పావనస్థలిని

యాగశాలలు గట్టి యఖిల వస్తువులు
సమకూర్చి వ్యాసాది సంయమీశ్వరులఁ
బ్రమ్మ మెప్ప ఋత్విజగణము రావించి
యాగోపకరణంబు లన్నియుఁ దెచ్చి
యాగమో క్తక్రియ నన్ని సంధించి 620
దక్షుల నియమించి ధర్మనందనుఁడు
దీక్షితుఁడై మహాద్విజకోటితోడ
వేలుచుచుండఁగ విష్ణుఁడంతటికిఁ
జాలి భూసురవర్యసమితితో నిలువ
తమ్ములు సకలబాంధవులును దారుఁ
బ్రమ్మర పరిచర్యఁ గావింపుచుండ
హవ్యభాగమునకు నఖిల దేవతలు
దివ్యయానములతో దివినుండి మూడ

—: యుధిష్ఠిరుఁడు శ్రీకృష్ణున కగ్రపూజ నొసంగుట :

నయ్యుధిష్ఠిరుఁడు ధౌమ్యాదులఁ గూడి
చయ్యన నగ్రపూజలు చేయఁగోరి
యంతట రాజుల నర్థి వీక్షించి
" ఇం దెవ్వరికి నర్ఘ్య మిత్తునో" యనఁగ
సహదేవుఁ డన్నకు జలజాక్షుఁ జూపి
" విహితమాయర్ఘ్యంబు విష్ణున కిమ్ము
ద్విజుఁడును గురుఁడు ఋత్విజుఁడును భూమి
భుజుఁడు దైవంబునై పొలుపారు నతఁడు!
అతనిఁ బూజించిన నఖిల దేవతలు
పితరులు ఋషులు సంప్రీతిగావింతు

ర"నవుండు ప్రియమంది యమతనూభవుఁడు
ఘనభక్తి హరికి నర్ఘ్యము సమర్పించె. 630
ఇహురత్న భూషణాంబర గంధపుష్ప
విహితభంగుల మంత్ర విధిఁ బూజ సేయ
మునులు రాజులు మనంబుల సంతసిల్ల
ననిమిషావళి వచ్చి యభినుతి సేయ
నాలోన శిశుపాలుఁ డంతయుఁ జూచి
కాలాహిగతి[మోసి కరతలం బెత్తి
యొండొండ రోషాగ్ని లోలుకుచుండఁగను
పాండవాగ్రజుఁ జూచి పలికె నుద్వృత్తి

—: శిశుపాలుఁడు శ్రీకృష్ణుని నిందించుట :—

" కటకటా! ధర్మజ! కడుచిన్నవాఁ
డిటు జెప్ప నీబుద్ధి యేల నిట్లయ్యె ?
గోపాలకుని జాలికుని సత్త్వహీను
పాపాత్ముఁ బశుకర్ముఁ బరదారగమను
నేమని పూజించి తిండఱె నడుమ ?
ఏపుటివాఁడు వీఁడీ యర్ఘ్యమునకు
బలపరాక్రముల భూపతుల సన్మనుల
దలవంపు సేయఁగఁ దగునయ్య నీకు ?
ఎఱుగక కూర్మి నీవిచ్చినదైన
తఱి లేచి యర్ఘ్యంబు తానెట్లుగొనియె ?
పూజనీయులగు నీ పురుషులలోన
నేజాతిగలవాఁడు ! ఇటు పెద్ద సేయ!" 640

—: ధర్మరాజు శిశుపాలునకు సమాధాన మిచ్చుట :—

అనిపల్కుటయు విని యంతకాత్మజుఁడు
"వినవోయి! శిశుపాల! వెఱ్ఱివి గాక
హరికి సమానుఁడు నధికుఁడు గలఁడె?
ఇరవుఁదప్పినమాట నేటికాడెదవు?
యజ్ఞరక్షకుఁడును యజ్ఞభోక్తయును
యజ్ఞఫలంబిచ్చు నతఁడును దానె!
అతని తేజోంశంబు లఖిలదేవతలు
నతని గాదన నీకు నర్హమే యిట్లు?"
అనిపల్క సభ్యులు నతనిఁ గీర్తించి
కనుఁగొని శిశుపాలుఁ గలుషించి రంత.

—: శిశుపాలవధ :—

ఆమాటలకు దైత్యుఁడాత్మసైన్యంబు
తోమహాశాస్త్రంబులోఁ బన్నినిలుచె!
కురుబలంబుల నాఁగఁగొనక వే గదిసి
పరవశంబొనరింప పంకజోదరుఁడు
వారల వారించి జ్వాలనార్చులొలయ
దారుణ చక్రముద్ధతిఁ బ్రయోగింప
నాదిత్యకుండలాయతతీవ్రమగుచుఁ
జేదిభూపతి శిరచ్ఛేదంబు సేసె.
ఆహారవంబులు నమరసన్నుతులు
నోహోబలంబుల నులివు పెల్లడర
నాతని తేజోంశ మండలుఁ జూడ
నాతతంబుగ వచ్చి హరిఁ గాంచఁగలసె! 650

మనుజులు ఋత్విజులును మురనైరి లావుఁ
గొనియాడి మెచ్చిరి గురుభక్తి నంత
రాజసూయంబుఁ బూర్ణము సేసి ధర్మ
రాజు, పెంపున భగీరథు సుతయందు
నవభృతస్నాతుఁడై యరుదెంచి రాజ
నివహంబుఁ బూజించి నెరవడిఁ గొలిపి
[1] వరదక్షిణల విప్రవరకోటిఁ దనిపి
యావిభవంబున నఖిలబంధులకు
వావిరి నుత్తమ వస్తువు లొసఁగి
యనుప! సుయోధనుఁడా పట్టణమున
నినుపారఁ గొన్ని నెలలు వర్తించి
యాసంపదల పెంపు నయ్యధ్వరంబు
నాసభావిభవంబు నాగౌరవంబుఁ
బాంచాలిరూపసౌభాగ్యసంపదలుఁ
గాంచి నిర్విణ్ణుఁడై కడుచిన్నపోయి
యమ్మహీపతి పేర్మి యంతరంగమునఁ
గ్రమ్మర దనవీటి కరిగె రారాజు. 660
పౌరిఁ బాండవులచేతఁ బూజలు వడసి
హరి ద్వారవతి కేఁగె నతివలుఁ దాను.
అని చెప్పుటయు కౌరవాధినాయకుఁడు
వినుతుఁడై శుకయోగి విభున కిట్లనియె
వరమునీశ్వర! నీదువాక్యామృతంబు
గురుభక్తి నేనెంతఁ గ్రోలిననైన

---

[1] ఒకపాఠమున్నది.

తనివోవదు చిత్తమార్ద్రైత్యారి మహిమ
వినుపింపు మటుమీఁది వృత్తాంత మనుఁడు
అమ్మహాయోగీంద్రుఁ డమ్మహాత్మునకుఁ
గ్రమ్మన నప్పుణ్య కథఁజెప్పదొడఁగె.
ఇవియాదిగాఁ బెక్కు లిందిరావిభుఁడు
ః విధవినోదియై విహరింపుచుండె.
మఱియును గృష్ణుఁడు మహనీయగతుల
తెఱవలఁ గూడి వర్తించెఁ బెంపార ;
బహురత్నచిత్రితశర్మ్యహర్మ్యముల
విహరించె సతతము వెలఁదులు దాను ;
వరపుష్పతానేక వనముల యందు
మరియును బెక్కైన మదనతంత్రములఁ
దనిపి యాయింతుల ధన్యులఁ జేసె.
అనియిట్లు విష్ణుని యవతారకథలు 670
వినుపించు ఘనులకు విన్నపుణ్యులకు
వినిమెచ్చియాగల వివరమంతులకు
ఘనదోషహరమును కైవల్యసుఖము
ఘనులు యోగీంద్రులు గమనింపలేని
హరిభక్తిగల్గును నరయంగ నిదియు
వెరఁగున మది గల్గు విమలాత్ములకును
అనియిట్లు నిత్యధర్మారంభు పేర
జనలోకనవపారిజాతంబు పేరఁ
జతురకళాపూర్ణచంద్రుని పేర
నతులవైభవ నిర్జరాధీశు పేర
శోభితనవరూపసూనాస్త్రు పేర

నాభశమంత్రి కందామాత్యుపేరఁ
గోరిభరద్వాజగోత్రసంజాతుఁ
ఢారూఢమతి నయ్యలార్యనందనుఁడు
శృంగారరసకళాశ్రితవచోధనుఁడు
సింగనామాత్యుఁడు చెలువగ్గలించి
సలలితరసభావశబ్దగుంభనల
వలనొప్ప శ్రీభాగవతపురాణమున
మహాదాదియగు దశమస్కంధసరణి
విహితలీలలనొప్పు విష్ణుచారిత్రఁ 680
బ్రాకట జగదభిరక్షకాండంబు
నాకల్ప మాకల్ప మగుభంగిఁ జెప్పె.

జగదభిరక్షకాండము సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.

# తప్పొప్పుల పట్టిక



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 8 | రాజ్ఞున | రాజైన |
| 7 | 11 | నీవి | నీవు |
| 8 | 15 | విరచుట | విఱుచుట |
| 8 | 19 | జలనన | జలన |
| 8 | 19 | చాపమో | శైలమో |
| 8 | 23 | మేరూ | మేరు |
| 11 | 9 | వేఁగ | వేగ |
| 11 | 19 | మఱియును | మరియును. |
| 14 | 3 | వృంత | వృతం |
| 14 | 19 | రండండనొలుక | రండంద రొయులుక |
| 14 | 25 | బెదిదంవు | బెడిదంవు |
| 14 | 25 | జెటికి | బెటికి |
| 15 | 8 | నండందఁజూడ | నండంద చూడ |
| 15 | 22 | సౌఖ్వా | సౌఖ్యా |
| 16 | 9 | నండండఁగాంచి | నండంద కాంచి |
| 17 | 5 | కృష్ణుల | కృష్ణుల |
| 19 | 1 | గొచను | గొనుచు |
| 19 | 8 | విణ్ణనుదున | విణ్ణనువున |
| 20 | 8 | పోరులు | పౌరులు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 27 | 7 | బాండవుల | బాంధవుల |
| 27 | 19 | దసము | దనము |
| 43 | 10 | అర్హా | అరుహా |
| 44 | 11 | సందండః జేర్చి | సందంద చేర్చి |
| 57 | 7 | బెద్ద కాలుము | బెద్ద కాలము |
| 67 | 2 | శిఖ | శిఖ |
| 112 | 17 | నెఱుఁగింఫు | నెఱేఁగింపు |
| 114 | 16 | దమను | దమనుని |
| 115 | 22 | యందండ | సందండ |
| 125 | 23 | యక్కటికముతో | యక్కటికముతోడ |
| 135 | 22 | సయ్యంతి | సయ్యింతి |
| 138 | 4 | యనిరుద్దుఁ | యనిరుద్ధుఁ |
| 138 | 5 | తప్పకఁజూచి | తప్పక చూచి |
| 138 | 9 | కలయుల్ల | కలయెల్ల |
| 139 | 9 | మంచము | తల్పము |
| 161 | 16 | కులంబునుఁగూలు | కులంబులు గూలి పోవు. |
| 163 | 20 | త్రైలోన్య | త్రైలోక్య |
| 163 | 23 | చద్రుఁడు | చంద్రుఁడు. |
| 164 | 8 | నెఱేఁగించి | నెఱింగించి |
| 164 | 9 | యనుదెంచె | యరుదెంచె. |
| 169 | 17 | పుత్రైంచె | పుత్తెంచె. |
| 171 | 8 | నఱిక | నటిక |
| 171 | 15 | కుండలరత్య | కుండలరత్న |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 175 | 21 | చరిత్రంబు | చరితంబు |
| 177 | 6 | చూచుఁబోరి | చూచుచుఁ బోరి |
| 183 | 12 | నెఱుగఁక | నెఱుంగక |
| 189 | 12 | వూఁత | మూఁత |
| 189 | 15 | ఒుండొక్క | ఒండొక్క |
| 190 | 5 | జ్ఞానాధికుఁడౌట | జ్ఞానాధికుండౌట |
| 190 | 21 | తలఁచిన | తలంచిన |
| 194 | 5 | బ్రద్దఁబూని | బ్రద్దలఁబూని |
| 198 | 22 | గొల్చిరాఁగ | గొల్చి వేరాఁగ |
| 199 | 19 | నగరికి | నగరికిని |
| 207 | 8 | స్థంభ ంబు | స్తంభంబు |
| 211 | 3 | గ్రమ్మ మొప్ప | గ్రమమొప్ప |
| 213 | 6 | రక్షకుఁడును | రక్షకుండును |
| 213 | 10 | సభ్యాలు | సభ్యులు |
| 213 | 16 | పంపజోదరుఁడు | పంకజోదరుఁడు |
| 214 | 11 | నినుపారఁగొని | నినుపారగాఁగొన్ని |
| 216 | 6 | శ్రీధాగవత | శ్రీభాగవత |